# భారతి

సాహిత్య మాసపత్రిక
ఆగస్టు 1980

రెండు కవితలు
డా॥ సి. నారాయణరెడ్డి

ఫాసిజమ్
కృష్ణారావు

అసహనం
చైనా గోడలాంటి పుస్తకాలముందు
శివారెడ్డి

వేమన పద్యాల ప్రతులు
గోపి

మఱ్ఱిచెట్టు
మధునాపంతుల సత్యనారాయణమూర్తి

మళ్లీ వచ్చేశాడు!
నరేంద్ర

ఇంకా సారా, భానుమూర్తి, లక్ష్మణరావు, ఖద్రమొద్దీన్, గోదావరిశర్మ, కన్న, రామకృష్ణమూర్తి, జ్ఞానానందము, ఉమాపతి, శ్రీనివాసులు, రఘునాథరెడ్డి, మునిసుందరం, సుందరరామశాస్త్రి, మురళిమనోహర్, సీతారామారావు, శివరామశాస్త్రి ఇతరుల రచనలు

వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# ప్రధానమంత్రి 20 అంశాల కార్యక్రమం
# లక్షలాది కష్టజీవులకు వరప్రసాదం

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ప్రకటించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమం వాస్తవానికి ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి, సుస్థిరమైన ప్రగతికి సంకేతం. ఇది బడుగు వర్గాల అభివృద్ధికి జరుపుతున్న కృషిలో నూతన అధ్యాయాన్ని ప్రారంభించి, లక్షలాది మంది బలహీనవర్గాల ప్రజలలో కొత్త ఆశలను చిగురింపజేసింది.

**వాస్తవాలే ఇందుకు దర్పణం:**

**రికార్డుస్థాయిలో ఆహారోత్పత్తి:**

1978-79లో రికార్డు స్థాయిలో 106,67 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను ఉత్పత్తి చేశారు. తుఫాను, దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడినప్పటికీ తాత్కాలిక ప్రణాళికలను త్వరితగతిని అమలు జరపడంతో 79-80లో కనీసం 70 లక్షల టన్నుల మేరకు ఉత్పత్తిని సాధించగలిగారు.

**ప్రజలకు చౌకవస్త్రాలు:**

అరవై శాతం మంది చేనేత పనివారలను సహకార పరిధిలోకి తెచ్చారు. 1977-78లో 189 లక్షల చదరపు మీటర్ల చౌక వస్త్రాలను ఉత్పత్తి చేయగా 1978-79లో 213 లక్షలు, 1979-80లో 330 లక్షల చదరపు మీటర్లు చౌక వస్త్రాలను ఉత్పత్తి చేసి యిప్పుడు 388 కేంద్రాలద్వారా ప్రజలకు పంపిణీ చేశారు.

**చౌక ధర దుకాణాలద్వారా అత్యవసర సరకులు:**

ఇప్పుడు 22,000 చౌకధర దుకాణాలద్వారా ప్రజలకు అత్యవసర సరుకులను సరఫరా చేస్తున్నారు.

**భూసంస్కరణలు:**

రాష్ట్రంలో భూ సంస్కరణలను తీవ్రతరంగా అమలు జరుపుతున్నారు ఇందువల్ల 3·79 లక్షల ఎకరాల మిగులు భూమిని స్వాధీనం చేసుకున్నారు 1,74,125 కుటుంబాలకు భూమి పంపిణీ చేశారు. వారిలో చాల వరకు షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతులవారు ఉన్నారు.

**బలహీన వర్గాలకు ఇళ్లు:**

ఈ పధకాన్ని ద్విగుణీకృతోత్సాహంతో అమలు జరుపుతున్నారు. 2.5 లక్షల కుటుంబాలకు 5,000 కొత్త వాడలలో వసతి కల్పించారు. 12 లక్షల పేద కుటుంబాలకు ఇళ్ల స్థలాలు కేటాయించారు.

DIPR / 1 / 80

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



అగస్టు 1980

సంపుటము : 57 సంచిక : 8



విడిపత్రిక వెల రూపాయిన్నర

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1980



(*)

# రెండు కవితలు

## విత్తుకంటిలోంచి

ఇప్పుడు నేను అజ్ఞాతంగా
  ఇరుకు గదిలో ఖైదీలాగా
చేతుల్ని కట్టేసినట్టు
నోటిని కుట్టేసినట్టు
కళ్లలోని వెలుగును
కత్తిరించేసినట్టు.
దీనంగా – గొంతును పూడ్చేసినంత
మౌనంగా.
పుట్టుకొస్తాను రేపు
మట్టి బెడ్డల సమాధినుంచి.
చిమ్ముకొస్తుంది నా చూపు
చిచ్చులా విచ్చిన
విత్తుకంటిలోంచి.

## జాలిపడి

ఉద్ధృతంగా లేస్తుంది అల
  ఒడ్డును పెరుక్కుపోవాలని.
విరుచుకు పడుతుందది మాటికీ
నురగలెత్తే శివంతో.
చలించని ఒడ్డు జాలిపడి
అల చేతి కందిస్తుంది
ఒంటిమీద పేరుకున్న మట్టిపొరను;
ఓడిన అభ్యర్థి వీపు తట్టిన
విజేతలాగా.

డా॥ సి. నారాయణరెడ్డి



# సరస్వతీ సాక్షాత్కారం

శ్రీ కె. గోదావరిశర్మ

వాడని వలపుల కల్హారమాలవై
  ఎన్నడూ ఆరని కవితా జ్వాలవై
నా కంఠాన్ని కౌగిలించిన సరస్వతీ,
నా గొంతులో గొంతు విప్పిన సరస్వతీ !
నీ బహూకృతిని తలదాల్చి
నీ దయ నా చిరుకై తలదాల్చి
నేనే నీకు మారుగా, నీకు నోరుగా
రచిస్తున్నా నీ పాటలనే !
వచిస్తున్నా నీ మాటలనే !
నా అభిప్రాయాలకు ప్రాయంరాని రోజుల్లో
భావాల స్వభావాలు రూపుదిద్దుకోని రోజుల్లో
సాహిత్య స్వర్గద్వారానికి ప్రవేశకుసుము
గిరజాలూ విరజాజులే అనుకునే రోజుల్లో
నువ్వు నాకు పరాదేవతవి;
కాని పరదయితవి.
నవ్వుల్లో వెన్నెల శారికలూ
కన్నీళ్లలో కాటుక చారికలూ
నిట్టూర్పులూ నిదాఘతాపాలూ
నిన్నాకర్షిస్తాయనీ నువ్వు హర్షిస్తావనీ
నేనూ నమ్మాను కొన్నాళ్లు;
విరజిమ్మాను కన్నీళ్లు కొన్నేళ్లు.
ఇంతలో వింతబృందం ఒకటి
బృందగానం చేస్తూవచ్చి
ఉదయానికి మా అభివాదమంది.
అభ్యుదయ వాదం మాదంది.
వాదమెందుకు సరే లెమ్మని
వాళ్లతో నేనూ బయల్దేరాను.
బాటలు చీలేచోటు వచ్చేసరికి
బావుటాలూ చీలక తప్పలేదు.
తీరాచూస్తే నువ్వు మాతో లేనేలేవు —
నీ సాహచర్యం లేకపోతే
నా పదాలు తడబడతాయి;
నడక నీరసిస్తుంది.

ముందుకి వెళ్లడానికి మనస్కరించక
నిశ్శబ్దంగా వాళ్ళకి నమస్కరించాను.
పేరుపడ్డ రాటబల్ల ఒకటి ఉందక్కడ —
కూర్చుంటే నీడివ్వదు, నడిస్తే తోడివ్వదు.
ఒకప్పుడు, నువ్వు ఆ ఊరేలినప్పుడు
తోవచెప్పే బాణపు గుర్తులు వాడిగా ఉండేవట.
నువ్వొచ్చేశాక పాపం రాటబల్ల
తానే దిక్కులేనిదై పోయింది.
ఓ గడ్డపాయన అటుగా వెళుతూ
నువ్వు నాలోపలే ఉన్నావట —
అరవిందంలో మకరందంలా —
వెతుక్కోమన్నాడు. వట్టి అడివీ అధ్వాన్నం.
ఆయనకింకో నమస్కారం చేశాను.
ఈలోగా వీళ్ళెవరో, రోషపూరిత కంఠాలతో
ప్రపంచానికి ఎర్రరంగు పూసేస్తున్నారు.
షడ్దిశలనుండి దిశమొలగావచ్చి,
అయ్యయ్యో, నిన్నూ వివస్త్రవి చేసేస్తున్నారు
సూర్యుడిని పిండివేస్తామనీ
సముద్రాల్ని ఎండవేస్తామనీ
ఏదో గొడవచేస్తున్నారు, గొంతెండిపోయేలా
వీళ్లకితోడు వీరులు కొందరు
విప్లవానికీ విధ్వంసానికీ తేడా తెలియనివాళ్లు
మార్చడమంటే హతమార్చడ మనుకునేవాళ్లు
కేకలనే కవిత్వమనుకుంటూ —
ఇంతకీ నువ్వింకా ఇక్కడెక్కడున్నావు ?
బతికి బట్టకడదామని వీళ్ల
కళ్లుకప్పి తప్పించుకున్నావు. నీవాళ్లని
రహస్యంగా నీ దగ్గరకే రప్పించుకున్నావు
ఇక్కడ నీకోసం వేట సాగుతూనేఉంది
కొందరు నీ బొమ్మలు వాళ్లేచేసి
అవే నువ్వని నమ్మిస్తున్నారు.
నువ్వు నాటిన మొక్కలు నేడు వృక్షాలై
కాయలుకాస్తే తమవేనని అమ్ముకుంటున్నారు.

నేను లేచి
నాలుగు గోడలూకూల్చి
నింగితాకే ఓ కొండమీద నిల్చి
కనుచూపు సాగేదాకా చూశాను నీకోసం
పర్వతంలా పేరుకున్న చరిత్రని కదిలించాను.
ప్రవాహంలా పారుతున్న చరిత్రని అదిలించాను.
బహువేషధారిణివై, బహుకావ్యకారిణివై
నన్ను కరుణించి దర్శనమిచ్చావు
గాలిబ్ కవితా చరణాల గమనానివై
ఖయ్యాం మధుపాయి వాయిలో తమకానివై
డాంటే, డన్, షేక్స్పియర్, కీట్సూ,
కాళిదాసు, వేమన మహాకవుల
అందరి కవనాల్లో స్పందించిన హృదయానివై
అందని గగనాల్లో వికసించిన ఉదయానివై
మకుటధారిణివై, మహారాజ్ఞివై ఏలిన నువ్వు
ఇప్పుడీ సిద్ధాంతాల చర్చల్లో
రాద్ధాంతాల ఉచ్చుల్లో ఎందుకు పడ్డావు ?
నిన్ను నిన్నుగా ప్రేమించే మరి నేనో !
ఆశ, నిరాశల తెరలలో నిన్ను వెతుక్కుంటూ
నీ క్వణత్కింకిణులు ఎటు పిలిస్తే అటు వెళుతూ
మనుషుల్లో కవుల్నీ కవుల్లో మహాకవుల్నీ
మహాకవుల్లో మధురక్షణాల్నీ వాటిలో నీ ఛాయల్నీ
పోల్చుకుంటూ, నన్ను నేను గెల్చుకుంటూ
ఎన్నాళ్లు ఆడాను అనంతమైన ఈ ఆట !
ఎంత శ్రుతిలో పాడాను మహంతమైన ఈపాట !
కవితా చరణాలు రాజకీయాల్లో నర్తించినా
బజార్లలో తిరిగినా నినాదాల్లో శబ్దించినా
కావ్యాత్మ మాత్రం వీటికి అతీతంగా, ఉన్నతంగా
కల్తీలేని కవి ఆత్మలా ఉంటుందని తెలుసుకున్నాను.
నిన్నారాధించే వాళ్ళెందరో ఉన్నా
నువ్వు కటాక్షించేవాళ్లు కొందరే.
తపసుగా మారిన నా తపననీ
ప్రతీక్షలో మసలే నా ప్రతీక్షణాన్నీ
గుర్తించి నన్ననుగ్రహించావు.
నీ వాణిగా, నీ వాణ్ణిగా నన్ను గ్రహించావు
ఎందుకోసం నన్నెంచుకున్నావో,
ముందు ముందు నన్నేం చెయ్యదల్చుకున్నావో,
నా కంఠాన్ని కౌగిలించిన సరస్వతీ,
నా గొంతులో గొంతువిప్పిన సరస్వతీ !

# నాతో నేను

## కన్న

అలమటిస్తున్నా
నాలో నేనే
నా ఆకలితో అరగని ప్రేవుల్ని చూస్తూ
మండే కడుపుతో పండువెన్నెల్ని చూస్తూ
కంపుగొడుతున్నా
నాకు నేనే
నా అరుపుల్లో బుతుల్ని పలికిస్తూ
నా ఆశల్లో రుచుల్ని జుర్రుకుంటూ
కుళ్ళిపోతున్నా
నాలో నేనే
నా రక్తంలో రంగుల్ని వెదుక్కుంటూ
రకరకాల జబ్బుల్ని పెంచుకుంటూ
అందుకే —
పోరాడుతున్నా
నాతో నేనే
నాలోని 'నన్నే' జయించాలని
'నన్ను' చంపి నేను జీవించాలని !

# హిమగిరే ఒరిగితే?

## శ్రీ సూరం శ్రీనివాసులు

అదేమిటి ?
వింగిలోని తెల్లజెండా
కొనలు విరుచుకుంటూ
కొండ చివర్లో కూలిపోతోంది
తెల్లపావురం చితిమంటల్లోదూకి
ఆత్మాహుతి చేసికోవాలనుకుంటోంది
కన్నతల్లి కన్నీళ్ళను చూడలేక
కాలానలాన్ని కౌగిలించుకోవాలంటోంది ...
తూర్పు పడమరలొకేవైపు వ్రాలిపోయి
శిశిర మధుమాసాలొకే తోటలో బందీలయి
మందార వనాంతరాల్లో
మబ్బు తునకలే పూస్తున్నాయి
ఆనంద కోశాంతరాల్లో
అడవి వెన్నెల్లే కాస్తున్నాయి
ఆపండి బాబూ !
మన నెత్తుటిలో ఎన్నికత్తులు పారుతున్నా
దాని రుధిరాన్ని కోరటంలేదని చెప్పండి
కనీసం కాగితం పడవలోనైనా
శాంత సాగరంలో విహరిస్తూండమనండి
మనలో మానవత్వం మారాకు తొడిగితే
మళ్ళీ పిలిపించుకుందాం
మరో క్షణంలోనో
మరో యుగంలోనో ... !



# ప్రణయినీ!

## శ్రీ పి. ఆర్. భానుమూర్తి

నీ సౌందర్యం
నన్ను తపస్విని చేస్తోంది ప్రేయసీ !
నీ మువ్వల సవ్వడిలో
నా కలల కోలాహలం
నా కళ్ళల్లో భవిష్యత్ స్వప్నాల్ని
ఇంద్రధనుసుగా ప్రతిఫలిస్తోంది
నక్షత్రహారం నుంచి ఏ నక్షత్రం రాలిపడిందో
వెన్నెలతోటలోంచి ఏ పువ్వు జారిపడిందో
కోకిల పాటలోంచి ఏ పల్లవి సోలిపడిందో
నీవై నీవై నీవై
మెరుస్తోంది
నవ్వుతోంది
పిలుస్తోంది
ఏ సౌందర్య సామ్రాజ్యాన్ని దోచుకుని వచ్చిందో
నీ నవ్వు —
నన్ను పిచ్చివాణ్ణి చేస్తోంది !



శ్రీ ఏ. కృష్ణారావు

# ఫాసిజమ్-ఒక పరిశీలన

19వ శతాబ్దం వ్యక్తి స్వేచ్ఛా వాదానికి (Individualism), ప్రజాస్వామ్యానికి ప్రాముఖ్యం వహిస్తే 20వ శతాబ్దం నియంతృత్వ వ్యవస్థకు నాంది పలుకుతున్నది. రెండు ప్రపంచ యుద్ధాలు, ఆర్థిక సంక్షోభము, రాజకీయ అవినీతి, పాలనా అసమర్థత, ప్రజాస్వామ్య సంస్థల వైఫల్యము సామాన్య ప్రజానీకం దృష్టి నియంతృత్వాల వైపుకు మరలుతున్నది. అరాజకము, ప్రాతినిధ్య సంస్థల మందకొడి కార్యకలాపాలు నిర్ణయాలలో కాలయాపన, వీటిని ఆధారం చేసుకొని కొన్ని రాజకీయపక్షాలు, వర్గాలు నియంతృత్వ పద్ధతులను, విధానాలను బాహాటంగా సమర్థిస్తున్నాయి. ఆంతరంగిక కల్లోలాల ఫలితంగా "ఆంతరంగిక అత్యవసర పరిస్థితి" విధించటం జరిగిందని శ్రీమతి ఇందిరాగాంధీ 26, జూన్, 1975న ప్రకటించింది. ఈనాటికీ 1975-77 మధ్య కాలంలోని రాజకీయ సంవిధానము, ప్రభుత్వ నిర్వహణ "సరైనదే" అని సమర్థించుకొనే వారూ ఉన్నారు.

పాశ్చాత్య ఉదారవాద జీవన విధానానికి వ్యతిరేకంగా 20వ శతాబ్దంలో ఏర్పడిన కమ్యూనిజమ్ మొట్టమొదటి విప్లవం; రెండవ వ్యతిరేక వాదంగా ఫాసిజమ్ (Fascism) ఏర్పడింది... సమాజాన్ని, ప్రభుత్వాన్ని ఒకేపార్టీ ఆధిక్యతతో నియంత్రణచేసే నియంతృత్వ వ్యవస్థే ఫాసిజమ్ సారాంశము.

## ఫాసిజమ్ నిర్వచనము

ఫాసిజమ్ అంటే ఏమిటి? ఎవరిని ఫాసిస్ట్ వాదులు లేదా శక్తులు అంటారు? అనేవి ఖచ్చితమైన సమాధానాలు దొరకని కొన్ని ప్రశ్నలు. ఎందుకనగా ఫాసిజమ్ అనే భావాన్ని రాజకీయ ప్రయోజనాలకు, పరస్పర దూషణకు (కొన్ని సందర్భాలలో) వినియోగించటం జరుగుతున్నది. ఉదాహరణకు 1976లో శ్రీ జయప్రకాష్ నారాయణ్‌ను ఫాసిస్ట్ శక్తులప్రతినిధిగా కాంగ్రెస్ వర్ణిస్తే, శ్రీమతి గాంధిని ఫాసిస్ట్ నియంతగా ప్రతిపక్షాలు విమర్శించినాయి. అయితే "ఫాసిజమ్" అనే పదానికి ఖచ్చితమైన అర్థం ఒకటి ఉన్నది.

ఫాసిజాన్ని "ఒకే వ్యక్తి సొంతం చేసుకొన్న ప్రభుత్వ వ్యవస్థ"గా ఫ్రాంక్లిన్ డి. రూజ్‌వెల్ట్ నిర్వచించినాడు. ప్రజలు ఎప్పుడైతే ప్రజాస్వామిక సంస్థలకంటే బలమైనవిగా ఇతర శక్తులను పెరగనిస్తారో, అప్పుడు ప్రజాస్వామిక స్వేచ్ఛ అంతరించిపోతుందని ఆయన భావించినాడు.

## ఫాసిజమ్ అవతరణ

మొదటి ప్రపంచయుద్ధం తరవాత ఇటలీలో అనేక పరిస్థితులు ఫాసిజమ్ ఆవిర్భావానికి దారితీసినాయి. ఆర్థిక సాంఘిక రంగాలలో అవ్యవస్థత, ద్రవ్యోల్బణము, నిరుద్యోగము, సమ్మెలు, అధిక వేతనాలు, సైన్యంలో అసంతృప్తి, ప్రజాస్వామ్య సంస్థల సామర్థ్యంపట్ల ప్రజల అపనమ్మకం నియంతృత్వ వాదానికి నీరుపోసినాయి. ప్రాచీన రోమన్ సామ్రాజ్య వైభవాన్ని ఇటలీకి తిరిగి కల్పించాలన్న ఆకాంక్ష ప్రబలి, అన్ని రంగాలలో అరాజకాన్ని తొలగించి శాంతి భద్రతలను పునఃస్థాపించటానికి ఒక బలమైన, స్థిరమైన ప్రభుత్వంకోసం ఆరాటం పెరిగింది. 1922లో బెనిటో ముసోలినీ నాయకత్వంలో ఫాసిస్ట్ పార్టీ అధికారంలోకి వచ్చింది. 1922 నుంచి 1945 వరకు ఇటలీలో ఫాసిస్ట్ పార్టీ అధికారంలో ఉన్నది. రెండవ ప్రపంచ యుద్ధంలో ఇటలీ పరాజయంతో, ముసోలినీ ప్రభుత్వ పతనంతో ఫాసిస్ట్ పార్టీ అంతమొందింది. ఫాసిజమ్ ఒక రాజకీయశక్తిగా అంతమొందినప్పటికీ దాని పద్ధతులు, ధోరణులు నేటికీ అనేక రాజ్యాలలో కనిపిస్తున్నాయి.

## ఫాసిజానికి ఆధారాలు

ఫాసిజమ్ ఒక రాజనీతితత్త్వంగా అవతరించలేదు. దానికి సృజనాత్మకమైన రూపంలేదు. అయితే ఫాసిస్ట్ సిద్ధాంతకర్తలు కొన్ని ఆధారాలద్వారా ప్రభావితులైనారు. అవి :

1. డార్విన్ సిద్ధాంతము:— దీని ప్రకారం మానవ సమాజాన్ని చైతన్యం చేసేది సంఘర్షణ. ఇది వ్యక్తులమధ్య, సమూహాల మధ్య, వర్గాలమధ్య కూడా కనిపిస్తుంది. ప్రాబల్యం ఉన్న వర్గం మిగతా వర్గాలపై తన ఆధిక్యతను స్థాపిస్తుంది. సజాతీయత, క్రమశిక్షణ, కార్యదీక్ష ఉన్న వర్గం అన్ని సందర్భాలలోనూ విజయాన్ని పొందుతుందని డార్విన్ సిద్ధాంతాన్ని సమర్థించేవారు అంటారు. దీనిని ఆధారం చేసుకొనే ముసోలినీ యుద్ధాన్ని, సామ్రాజ్యవాదాన్ని ఈ విధంగా సమర్థించినాడు : "ఫాసిజమ్ రాజ్య విస్తరణకాంక్ష, సామ్రాజ్యవాదం ఒక జాతి మనుగడకు అత్యంత ఆవశ్యకమైన లక్షణం అని భావిస్తుంది ... రాజ్యకాంక్ష లేని జాతి అతి త్వరలోనే పతనం చెందుతుంది."

2. మేధాశక్తి వ్యతిరేక వాదము : నిర్హేతువాదులు హేతువాద ప్రభావాన్ని అంగీకరించరు. మానవుడు ప్రధానంగా హేతువాదం ద్వారాకాక, విశ్వాసము, ఉద్వేగాలు, రాగద్వేషాలవల్ల ప్రభా

వితుడైనాడు. అందువల్ల సిద్ధాంతాలకు కాక చర్యలకు ప్రాముఖ్యం ఇవ్వాలి. "నా కార్యక్రమం చర్యే కాని ప్రసంగాలు కాదు" అని ముస్సోలినీ అనేక పర్యాయాలు అన్నాడు. సోరేల్ సూచించిన భ్రమ (Myth) వాదాన్ని ముసోలినీ పూర్తిగా అంగీకరించినాడు. "మేము ఒక భ్రమను కల్పించినాము. అది ఒక నమ్మకము, ఒక ప్రగాఢ ఆకాంక్ష; అది వాస్తవం కానవసరంలేదు. అది ఒక లక్ష్యంగా మనోధైర్యంగా (ప్రజల్లో) వాస్తవం అవుతుంది. మా 'మాయ'–జాతి, జాతీయ ఔన్నత్యము. దీనిని వాస్తవంలోకి తర్జుమా చేయటానికి మేము ప్రయత్నిస్తాము, పోరాడతాము; ఈ జాతీయ ఔన్నత్యమనే ప్రగాఢమైన భ్రమను వాస్తవం చేయటానికి నిరంతరం ప్రయత్నిస్తాము."

3. జర్మన్ ఆదర్శవాదము : హెగెల్, కాంట్, ఫిచీ మొదలైన జర్మన్ తత్త్వవేత్తలు రాజ్యాన్ని ఒక మహోన్నత వ్యవస్థగా, వ్యక్తులు దాని లక్ష్యాలకు సాధనాలుగా భావించినారు. వ్యక్తికి స్వేచ్ఛ రాజ్యంలోనే సాధ్యం అవుతుందనీ, వ్యక్తికి హక్కులకంటే విధులే ముఖ్యమనీ చెబుతారు. దీనిని ఆధారం చేసుకొని రాజ్యానికి సంపూర్ణాధికారాలు ఉండాలని, దాని ఆధిక్యతకు, నియంత్రణకు ప్రజలు విధేయులై ఉండాలనీ ముసోలినీ వాదించినాడు.

## ఫాసిజమ్ స్వరూపము

ఫాసిజమ్ ఒక క్రమబద్ధమైన సిద్ధాంతంకాదు. దానికి ఒక నిర్ణీతమైన, స్పష్టమైన కార్యక్రమంలేదు. హింసాకాండద్వారా, దమన నీతిద్వారా అధికారాన్ని సంపాదించుకుని, పదవిలో కొనసాగటానికి ఉపయోగపడే సాధనాలనుమాత్రమే ఫాసిజమ్ సూచిస్తుంది. ముసోలినీ ఫాసిజమ్ గురించి ఈ విధంగ చెబుతాడు :

"మా కార్యక్రమం చాలా సాధారణమైనది. మా అభీష్టం ఇటలీని పరిపాలించటం. మీ కార్యక్రమాలేమిటి అని అందరూ మమ్మల్ని అడుగుతారు. ఇప్పటికే అనేక కార్యక్రమాలు, ప్రణాళికలు, విధానాలు కుప్పలు తిప్పలుగా పడిఉన్నాయి. ఇటలీని రక్షించటానికి కావలసినవి ప్రణాళికలు కావు; మనోనిశ్చయం ఉన్న వ్యక్తులు, వారి చర్యలు మాత్రమే." 1919లో ముసోలినీ తన జీవిత చరిత్రలో ఈ విధంగా వ్రాసుకొన్నాడు : "మాకు తెలిసిన ప్రతి సిద్ధాంతాన్ని, ప్రతి మూఢవాదాన్ని మేము నాశనం చేసేము. అరచేతిలో స్వర్గాన్ని చూపే ప్రతి ఆదర్శాన్ని వ్యతిరేకించాము. మానవ సమాజానికి శాంతి సంపద లందిస్తామన్న ప్రతి ఊసరవెల్లినీ దుమ్మెత్తిపోసాము మాకు ఏ వ్యవస్థపై నమ్మకంలేదు. మాకు కొలబద్ద వ్యక్తి. అతని ఔన్నత్యానికి, ఆత్మగౌరవానికి, స్వేచ్ఛకు, సంపదకు, సదుపాయాలకు మేము నిరంతరం కృషి చేస్తాము. వ్యక్తికి హాని కలిగించే ప్రతి పరిమితిని మేము వ్యతిరేకిస్తాము. వాటిని తొలగించటానికి పోరాడుతాము ...రెండు మతాలు మానవుడిని జయించటానికి పరస్పరం తీవ్రంగా పోటీ పడుతున్నాయి. ఒకటి మాస్కో నుంచి, మరొకటి రోమ్ (వాటికిన్ నగరము) తమ ప్రచారకులను పంపుతున్నాయి. మేము ఈ రెండిటినీ వ్యతిరేకిస్తాము."

ఫాసిస్టులు సమయానుకూలంగా తమ విధానాలను, విశ్వాసాలను మార్చుకొంటారు. వారు స్థిరమైన లక్ష్యాలకు, సాధనాలకు కట్టుబడిఉండరు. మొదట అధికారాన్ని చేజిక్కించుకొని, తరవాత తమ చర్యలను సమర్థించుకోటానికి, హేతుబద్ధం చేయటానికి అనుకూలమైన సిద్ధాంతాలను వెతుక్కుంటారు. అయితే మొదటి నుంచి వారు ప్రతిఘటన శక్తిని, సైనిక క్రమశిక్షణను, నిర్దాక్షిణ్య చర్యలను సమర్థించేవారు. నీతి నియమాలను లెక్క చేయరు. వారి ఏకైక ధ్యేయం అధికార రాజకీయాలు (Power Politics) వారి ఏకైక నాయకుడైన ముసోలినీ నిర్ణయంపై ఫాసిస్టు విధానాలు, చర్యలు ఆధారపడి ఉంటాయి. ప్రజలు వాటిని పూర్తి విధేయతతో అనుసరించాలి. ముసోలినీ ఉత్తరువులను తు. చ. తప్పకుండా పాటించాలి. రాజ్యాధికారానికి మహోన్నతమైన స్థాయిని కల్పించి దానికి వ్యక్తిని బానిసగా ఫాసిజమ్ చేస్తుంది. "ఇటలీ ప్రజల భావి శ్రేయస్సునే ప్రధానంగా ఎంచుకొని ఏటు సిద్ధాంతాలకు, నియమాలకు కట్టుబడక నిరంతరం కృషిచేస్తున్న ఇటలీ రాజకీయాలలోని జిప్సిలే (స్థిరనివాసం లేనివారు) ఫాసిస్టు" లని స్కిడర్ వ్యాఖ్యానించినాడు.

ఫాసిస్టు ప్రధాన సిద్ధాంతకర్త అయిన రాకా (Rocco) ఫాసిజమ్ గురించి ఈ విధంగా చెబుతాడు : "ఫాసిజమ్ ఒక నూతన సమాజాన్ని శక్తివంతమైన, ప్రయోజనాత్మకమైన ఉద్యమంద్వారా ఒక నవీన సంస్కృతి ప్రారంభాన్ని సూచిస్తుంది. ఫాసిజమ్ ప్రజాస్వామ్యాన్ని, ఉదారవాదాన్ని, సామ్యవాదాన్ని వ్యతిరేకిస్తుంది. మొదటి రెండు వ్యక్తి ఆసక్తులకు, మూడవది ఒక ఆర్థికవర్గం ఆసక్తులకు ప్రాధాన్యత వహిస్తే ఫాసిజమ్ అందరి ప్రయోజనాలనూ కాంక్షిస్తుంది. దీనికి సమాజ శ్రేయస్సు అంతిమ లక్ష్యం, సాధనాలు వ్యక్తులు."

## తీవ్ర జాతీయ వాదము

ఫాసిస్టులు జాతి ఔన్నత్యాన్ని ఎలుగెత్తి చెబుతారు. వారి అభిప్రాయంలో జాతి ఒక ప్రత్యేక లక్ష్యము, ఉనికి మరియు వ్యక్తిత్వం ఉంటాయి. ప్రజల ఆసక్తి కంటే జాతి అభ్యుదయం గొప్పది. జాతీయ జీవన వాహిని నుంచి ప్రజలను విడదీయలేము.

జాతి ఔన్నత్యానికి, ప్రయోజనాలకు కృషి చేయటం ప్రతి పౌరుని విద్యుక్త ధర్మము అని ఫాసిజమ్ బోధిస్తుంది. దిన పత్రికలు, వార్తా ప్రచార ప్రసార సాధనాలు, చలన చిత్రాలు మహోన్నత జాతీయ భావాన్ని ప్రజల మనోఫలకంపై చెరగని ముద్రవేయటానికి ఉపయోగపడాలి. దీనికి అనుగుణంగా ప్రజలభావాలను మానసికంగా ప్రభావితం చేయాలి.

## రాజ్యానికి వ్యక్తి బానిస

రాజ్యసార్వభౌమాధికారాన్ని ఫాసిజమ్ పూర్తిగ సమర్థిస్తుంది. వ్యక్తిని రాజ్య సంపూర్ణ నియంత్రణకు పూర్తిగా లోబరుస్తుంది. రాజ్య ప్రయోజనాల కోసం ప్రజలు తమ ఆస్తులను అవసరమైతే ప్రాణాలను అర్పించటానికి సంసిద్ధులై ఉండాలి. రాజ్యాధికార అంతిమ లక్ష్యం జాతి ఔన్నత్యము. ఈ సందర్భంలో ముసోలినీ ఈ విధంగా అంటాడు :

''ఫాసిస్ట్ రాజ్యం ప్రజల సంపదకు, వ్యక్తిగత రక్షణకు, సౌఖ్యాలకు మాత్రమే పరిమితం కాదు. రాజకీయ, ఆర్థిక, న్యాయ నిర్ణయ సంస్థల ద్వారా ఒక ప్రత్యేకమైన ఆధ్యాత్మిక ధ్యేయాన్ని, ఔన్నత్యాన్ని సంపాదించటానికి రాజ్యం ప్రయత్నిస్తుంది.'' రాజ్య భావన నశించినప్పుడు ప్రజలు, సంస్థలు, వ్యతిరేక, విచ్ఛిన్నకరమైన శక్తులకు లోబడి అనతికాలంలోనే పతనం చెందుతారు.

ఫాసిస్టుల అభిప్రాయంలో రాజ్యంద్వారానే వ్యక్తి జీవనం సుఖమయం అవుతుంది. రాజకీయ సమాజం వెలుపలవారికి ఎటువంటి రక్షణ, ప్రగతి ఉండవు ! ''సర్వమూ రాజ్యం లోపలే; రాజ్యానికి వ్యతిరేకంగా రాజ్యానికి అతీతంగా'' ఏదీ సాధ్యము కాదు. ఫాసిస్టు రాజ్యంలో పౌర స్వేచ్ఛలకు స్థానం లేదు. ''ఫాసిజమ్ ఏలుబడిలో వినాశనకరమైన స్వేచ్ఛా వాదాలన్నీ పెంటకుప్పమీద విసిరి వేయబడతాయి'' అని ముసోలినీ పౌరహక్కులను అపహసించాడు. రాజ్యంలో వ్యక్తికి స్వాతంత్ర్యం ఎంత ఇవ్వవలసినది నిర్ణయించేది ప్రభుత్వమే అని అతని అభిప్రాయము. అంతేకాక ''ప్రజలు ఇప్పుడు స్వేచ్ఛ పట్ల విసుగు చెంది ఉన్నారు; వారివి ఇప్పుడు కదిలించకలిగేది క్రమశిక్షణ మాత్రమే.''

వ్యక్తి స్వాతంత్ర్యం పట్ల అయిష్టత, ప్రజలందరినీ తమ పద్ధతిలో ఒకే త్రాటిపై నడిపించాలన్న ఆకాంక్ష పౌరహక్కులను, కార్మిక హక్కులు – సమ్మె – మొదలైన వాటిపట్ల ఫాసిజానికి కుల ద్వేషానికి కారణం.

## కార్మిక వ్యతిరేక ఉద్యమం

ఫాసిజమ్ విధానాలను గురించి లోతుగ పరిశీలించిన హెచ్. బ్రౌన్ (H. Brown) అనే అమెరికా రచయిత, ''ఏ దేశంలోనైనా అధికారాన్ని హస్తగతం చేసుకోవటంలో కార్మిక ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయటం ఫాసిజమ్ మొదటి పని.'' సమ్మెను ఒక ఆయుధంగా వినియోగించే కార్మిక సంఘాలను నిర్మూలించటానికి కార్మికుల హక్కులను, సమ్మెలను నిషేధించటం ద్వారా కార్మికోద్యమాలను ఫాసిస్టులు అణిచివేస్తారు. ''సమ్మెచేసే హక్కు, అనాగరిక, ఆదిమ సమాజాల లక్షణం''అని స్పైన్ (మాజీ) నియంత జనరల్ ఫ్రాంకో భావించినాడు. అయితే పాశ్చాత్య కార్మిక ఉద్యమ నాయకుడైన సామ్యూల్ గోవంప్ దీనిని తీవ్రంగా ఖండించినాడు. ''సమ్మె జరగని ఏ దేశమైనా ఉంటే నాకు చూపండి. నేను మీకు స్వేచ్ఛ లేని దేశమేదో చూపెడతాను'' అన్నాడు.

మన దేశంలో ఆంతరంగిక అత్యవసర పరిస్థితి అమలులో ఉన్న కాలంలో ఒక్క సమ్మె కూడా జరగలేదని ప్రభుత్వం చెప్పుకొన్నది. క్రమశిక్షణ పేరుతో ''అనుశాసనపర్వం''లో ఒక భాగంగా కార్మిక హక్కులను రద్దు చేయటం జరిగింది. ''బోనస్'' అనే దాచుకొన్న జీతాన్ని (Deferred Wages) అత్యవసర పరిస్థితి కార్మికులకు నిరాకరించింది. అందువల్లనే సర్వ సాధారణంగా పారిశ్రామిక వేత్తలకు ఫాసిస్టు నియంతలు ఆరాధ్య దైవాలు.

"Introduction to Politics" అనే గ్రంథంలో హెరాల్డ్ జె. లాస్కి ఈ సత్యాన్ని గురించి ఇలా అంటాడు : ''ఇటలీలో ఫాసిస్టు ప్రభుత్వం, జర్మనీలో నాజీ నియంతృత్వం, స్పైన్‌లో ఫ్రాంకో నిరంకుశపాలన మొదలైన నిరంకుశ ప్రభుత్వం చరిత్రగతిని పరిశీలించినట్లైతే ఉద్దేశపూర్వకంగా రాజ్యాంగ చట్టాన్ని సవరించి అధికారాన్ని హస్తగతం చేసుకొన్న ప్రయత్నం మనకు కనిపిస్తుంది. ఈ రాజ్యాంగ సవరణ పరిశ్రమాధిపతుల ప్రోత్సాహంతో జరిగినట్లు కూడా అర్థం అవుతుంది. ఎందువల్లనంటే మిగతా విషయాలను అటుంచి, అది కార్మిక సంఘాల నిర్మూలన కది దోహదంచేసింది.''

## ప్రజాస్వామ్యానికి బద్ధశత్రువు

ఫాసిస్టులు ప్రజాస్వామ్యాన్ని వ్యతిరేకిస్తారు. పార్లమెంటరీ సంస్థలకు వాళ్ళు బద్ధశత్రువులు. వారి దృష్టిలో ప్రాతినిధ్య సంస్థలు అసమర్థతకు, అజ్ఞానానికి, అవినీతికి నిలయాలు. ప్రజాస్వామ్యాన్ని ముసోలినీ ఈ విధంగా విమర్శించినాడు :

''ఫాసిజమ్ ప్రజాస్వామ్యాన్ని సిద్ధాంత రీత్యా, ఆచరణరీత్యా వ్యతిరేకిస్తుంది. సంఖ్యాబల నిర్ణయాలద్వారా ప్రభుత్వాన్ని నిర్దేశించటం ఫాసిజమ్ త్రోసిపుచ్చుతుంది. ప్రజలకు సార్వభౌమాధికారం ఉన్నదంటూ బాధ్యతలేని వ్యక్తులు చలాయించే విధానమే, వ్యవస్థే ప్రజాస్వామ్యమని మేము అంటాము.''

అధికార పరంపరపై సమాజం ఏర్పడుతుందని ఫాసిజమ్ భావిస్తుంది. నాయకులను ప్రజలు ఎన్నుకోరాదు. వారు ప్రజలకు బాధ్యత వహించరు ప్రజలే వారికి బాధ్యత వహించాలి ! ప్రతి రంగంలోనూ సైనిక క్రమశిక్షణ, గుడ్డి విధేయతలను ప్రజలు అనుసరించాలి. ''విశ్వాసము, విధేయత, పోరాటము'' వారు కలిగి ఉండవలసిన లక్షణాలు. ప్రజాస్వామ్యంఅంటే ఇష్టపడని ఫాసిస్టులు తలక్రిందులైన పిరమిడ్ స్వరూపము, స్వభావము ఉన్న రాజకీయ వ్యవస్థను అభిలషిస్తారు.

ఫాసిస్టులు ప్రజాస్వామ్య వ్యతిరేకులు కాబట్టి ప్రతి పక్షాలను వారు సహించరు. తన క్షేమానికి, తన పార్టీ క్షేమానికి భంగకరమైన ప్రతిదీ దేశక్షేమానికి భంగం కలిగిస్తుందని భావిస్తారు. అందుకనే ప్రతిపక్షాల ఉనికిని నాశనం చేయటానికి, వాటిని విశే

ధించటానికి ప్రయత్నిస్తారు. ''బాధ్యతాయుతమైన ప్రతిపక్షం'' అంటే చప్పట్లుకొట్టే ప్రతిపక్షం అన్నమాట.

1975 జూన్‌లో 26 రాజకీయ సంఘాలను నిషేధించటం జరిగింది. దేశ క్షేమానికి వ్యతిరేకంగా పనిచేసే సంస్థలను నిషేధించటానికి, వ్యక్తులను శిక్షించటానికి తగిన విధంగా ప్రభుత్వానికి అధికారాలను కల్పించే విధంగా రాజ్యాంగానికి సవరణలు చేయటం జరిగినది.

సమాన భావాలపై కాక విభిన్న అభిప్రాయాలను అనుసరించినప్పుడే రాజకీయ స్వేచ్ఛ ఏర్పడుతుందని ప్రజాస్వామ్య సిద్ధాంతం చెబుతున్నది. దీనికి వ్యతిరేకంగా పూర్తి విధేయతను ప్రోత్సహిస్తుంది. ప్రజాస్వామ్యం అభిప్రాయ భేదాలపై ఆధారపడితే నియంతృత్వం అభిప్రాయ ఏకత్వం కావాలని కోరుతుంది.

## వ్యక్త్యారాధన (Hero Worship)

ఫాసిస్ట్ రాజ్యంలో సర్వాధికారాలు నియంతకే ఉంటాయి. అతని అభిప్రాయం గొప్పది. అతని నిర్ణయం తిరుగులేనిది. అతని మేధాశక్తి అపూర్వమైనది. అతడే రాజ్యము; రాజ్యమే అతడు. ''నేనే రాజ్యము రాజ్యమే నేనని'' లూయిస్ IV ప్రభువు చెప్పుకొన్నాడు.

మన దేశంలో ''ఇందిరాయే ఇండియా, ఇండియాయే ఇందిరా'' అని ఒకనాటి కాంగ్రెస్ అధ్యక్షుడైన డి. కె. బారువా శ్రీమతి ఇందిరా గాంధీని వేనోళ్ళ శ్లాఘించినాడు. ఈ రకమైన రాజకీయ వ్యక్తిపూజ వికృతమైనదనీ, ఇది ఫాసిస్ట్ ప్రభుత్వాన్ని సూచించే ముఖ్య సంకేతం అని విన్‌స్టన్ చర్చిల్ భావించినాడు. 1935 లో హిట్లర్ నాజీ కాంగ్రెస్‌లో స్వయంగా చెప్పుకొన్నాడు: ఫ్యూరరే పార్టీ, పార్టీయే ఫ్యూరర్.

ఫాసిస్ట్ నియంతలో ''మగలో మానియా'' లక్షణాలు తీవ్రంగా కనిపిస్తాయి. (మగలోమానియా అంటే అందరి కంటే తానే గొప్ప అనుకొనే ఒకరకమైన మానసిక రోగము). అత్యవసర పరిస్థితిని సమర్థిస్తూ శ్రీమతి గాంధీ ''నేను దేశ క్షేమానికై కొన్ని ఆదర్శాలకు, ప్రణాళికలకూ ప్రత్యేకంగా నిలబడ్డందుకు వారు (ప్రతిపక్షాలు) నన్ను వ్యతిరేకించారు అంతేకాక వారికి నేను మొత్తం దేశాన్ని సంఘటితం చేస్తున్న వ్యక్తిగా కనిపించాను. దేశమంతా వ్యాపించిన పార్టీ నాదే. దేశ సౌభాగ్యానికీ, సుస్థిరతకూ, ప్రజలు సంఘటిత మవటానికి నా పార్టీయే కారణము. ఇప్పుడు ఇలాంటి పార్టీని విచ్ఛిన్నం చేయటానికి ప్రయత్నిస్తే, అది దేశ సమైక్యతనే విచ్ఛిన్నం చేసినట్లే. పైగా దేశ క్షేమం దృష్ట్యా ప్రమాదకరమైనది కూడా'' అని ఒక ఇంటర్వ్యూలో చెప్పినది.

## ఫాసిస్ట్ పద్ధతులు

ఫాసిజమ్ పద్ధతులకు చాలా ప్రాధాన్యం ఇస్తుంది. లక్ష్య సాధనకు ముఖ్యంగా ప్రచారము, హింసా దౌర్జన్య కాండలను, దమన నీతిని ఉపయోగించటాన్ని సమర్థిస్తుంది.

అసత్యప్రచారము హిట్లర్ ప్రభుత్వంలో ప్రచారశాఖ అత్యంత కీలకమైన శాఖ. వాణిజ్య ప్రచార పద్ధతులను రాజకీయ ప్రయోజనాలకు వినియోగించుకోవచ్చన్న విషయాన్ని మొట్టమొదటగా గుర్తించిన యూరోపియన్ రాజకీయవేత్త హిట్లర్. ఆయన ప్రభుత్వంలోని ప్రచార శాఖాధిపతి అయిన పాల్ జోసెఫ్ గోబెల్స్ **(Paul Joseph Gobbles)** హై వోల్టేజ్ **(High Voltage)** అబద్ధ ప్రచారానికి పర్యాయ నామధేయుడిగా చరిత్ర ప్రసిద్ధి కెక్కినాడు.

హిట్లర్ తన ''మైన్ కాంఫ్'' అనే గ్రంధంలో ప్రచారాన్ని కొనసాగించే పద్ధతుల పట్ల అతని అభిప్రాయాలను స్పష్టంగా వివరించినాడు ''తెలివిగానూ తెరిపి లేకుండానూ ప్రచారంచేయటం ద్వారా స్వర్గాన్ని నరకంగానూ లేదా అత్యంత దయనీయమైన జీవితాన్ని స్వర్గతుల్యంగానూ నమ్మించవచ్చు.'' హిట్లర్ పాలనలో రెండవ లక్షణం పైశాచికత్వంపై ఆధారపడటం ఉద్రేకాలను రెచ్చగొట్టే విషయాలను ఎప్పుడూ ఎగదోస్తూ ఉండటం తమ బాధలకూ కష్టాలకూ యూదులే కారణమనీ జర్మన్‌లు అనుకొనేటట్లు యూదులనొక రాక్షస జాతిగా చిత్రీకరించారు. చట్టబద్ధంగా యూదుల నణచివేయటం, వారిని సమూలంగా నాశనం చేయటం, దేశక్షేమం దృష్ట్యా అనివార్యమని ప్రజలలో వ్యాప్తిచేయటం జరిగింది. జూలై 22, 1975న లోక్‌సభలో ప్రసంగిస్తూ శ్రీమతి గాంధీ ఇలా అన్నారు : ''నిన్న ప్రతిపక్ష సభ్యులొకరు ఫాసిజం అంటే ఏమిటో తెలిసికొనగోరినారు. ఫాసిజం అంటే అణచివేత మాత్రమేకాదు; పోలీసు జులుం ఎక్కువగా ఉంటుందనికాదు; ప్రజలు నిర్బంధితులైనారనికాదు. ఫాసిజం అంటే అబద్ధపు ప్రచారం. అన్నిటికంటే మించిన విషయం ఈ అబద్ధాలను ప్రచారం చేయటం, పుకార్లను పుట్టించటంలో ఉన్నది; బలి పశువులను సృష్టించటంలో ఉన్నది.''

దౌర్జన్యకాండ–దమననీతి : ఫాసిజం హింసను, దౌర్జన్య పద్ధతులను ప్రోత్సహిస్తుంది. శత్రుత్వాన్ని కాక శత్రువులను పూర్తిగా నిర్మూలించటం ఫాసిస్ట్‌ల ధ్యేయము. ఈనాటి ప్రత్యర్థి రేపటి మిత్రుడు అనే ప్రజాస్వామ్యవాదాన్ని ఫాసిజం అంగీకరించదు. నిర్బంధ శ్రామిక శిబిరాలు, కఠిన కారాగార శిక్షలు, చిత్రహింస, మేధాక్షాళనము **(Brain washing)** రాజకీయ వ్యతిరేకులను, అసమ్మతివాదులను లొంగదీయటానికి ఫాసిస్ట్‌లు అనుసరించే కొన్ని సాధనాలు.

ప్రజల నైతిక, హేతువాద మేధాశక్తులను పూర్తిగా నిర్వీర్యంచేసి వారిని ప్రభుత్వానికి తోకాడించే శునకాలుగా చేయ

టానికి ఫాసిస్ట్లు నిరంతరం ప్రయత్నిస్తారు. హింసాయుత పద్ధతుల ద్వారా వ్యక్తి, మానసికస్థితిని పూర్తిగా లొంగదీసి, నాశనం చేసి చివరికి అతడు చేయని, చేయలేని తప్పులను కూడా అతడు చేసినట్లు ఒప్పిస్తారు.

## ము గిం పు

ప్రాతినిధ్య సంస్థలు, ప్రభుత్వ ఉదార విధానాలు, నిర్ణయాలలోనూ, చర్యలలోనూ విఫలమైనప్పుడు లేదా మురా ప్రయోజనాల కోసం జాతీయ ఆసక్తిని బలి చేసినప్పుడు, ప్రజలు నియంతను, నియంతృత్వాన్ని సమర్థించటానికి సిద్ధపడుతారు. ఎటువంటి పద్ధతులద్వారా అధికారాన్ని సంపాదించినా, అది ఏ విధంగా చెలాయించినా సామర్థ్యంతో రక్షణ, ప్రజా జీవనంతో క్రమబద్ధతలను కల్పించినప్పుడు ఆ నియంతను ప్రజలు, ఇతర రాజ్యాలు గౌరవిస్తారు.

ఫాసిజంను అరికట్టాలంటే ఫాసిస్ట్ శక్తుల ప్రాబల్యాన్ని తొలగించాలి. దీనికి విరుగుడుగా ప్రజాస్వామిక సంస్థలను బలపరచాలి. ప్రజాస్వామ్యానికి నిజమైన ప్రమాదం ఫాసిజంనుంచి కాక ప్రజాస్వామ్య వ్యవస్థనుంచే (అంతర్గతంగా) ఏర్పడుతుంది. "Todays Isms" అనే గ్రంథంలో ఇబెన్‌స్టీన్ ఈవిధంగా వ్యాఖ్యానించినాడు: "ఈనాడు ప్రజాస్వామ్యానికి ఏదైనా ఫాసిస్ట్ ప్రమాదం ఉన్నదంటే అది బెర్లిన్, రోమ్, టోక్యోలనుంచి కాక, ప్రజల నిర్లక్ష్యం, అనాసక్తులనుంచి ఏర్పడుతుంది. ఎందుకంటే అటువంటి పౌర వ్యాధులనుంచి రాజకీయ వాక్చతురులు, భయాన్ని ప్రేరేపించేవారు, తమ ప్రయోజనాల నిమిత్తం జాతిని నాశనం చేస్తారు." ప్రజాస్వామ్య సంస్థల లోపాలను, అసమర్థతలను తొలగించనంతవరకు, ఫాసిజమ్, ఫాసిస్ట్ శక్తులనుంచి ప్రజానీకానికి రక్షణ ఉండదు.

ఫాసిజమ్ నగ్నస్వరూపాన్ని "Political Philosophies" అనే గ్రంథంలో మాక్సీ (Maxey) ఈ విధంగా వర్ణించాడు: "ఫాసిజం నగ్న అధికార కాంక్షకు ఆదర్శవాదమనే పట్టు వస్త్రాన్ని తొడిగింది; హింసాకాండకు నైతిక బలాన్ని చేకూర్చింది; దేశభక్తిని అపరిమితంగా ఉపయోగించుకొన్నది; అల్పసంఖ్యాకుల అధికారాన్ని హేతుబద్ధం చేసింది; కమ్యూనిజంపట్ల భయం, దానితో పాటు సమానంగా పెట్టుబడిదారీ సంస్థలపట్ల ప్రజల తీవ్ర అసంతృప్తినుంచి పూర్తి లాభాన్ని పొందింది. సామాన్య ప్రజలకు ఒక నూతన మతము, ఆరాధించటానికి నూతన దైవాన్ని ప్రతిపాదించింది; ఈ కారణాలవల్ల ఫాసిజం ఒక ప్రబలమైన శక్తిగా రెండు ప్రపంచ యుద్ధాలలోనూ ఫాసిస్ట్ ప్రభుత్వము నశించినప్పటికీ — ఈనాటికీ కొనసాగుతున్నది.

ఇటలీ, జర్మనీ రాజ్యాలలో ఫాసిస్ట్, నాజీప్రభుత్వము ప్రారంభంలో కొంతమంచినీ, ప్రయోజనాలను సమకూర్చినప్పటికీ వాటి తీవ్ర విధానాలవల్ల, నిర్నిబంధ అధికార వినియోగంవల్ల అవి అనతి కాలంలో ప్రపంచ శాంతికి, ప్రజాస్వామ్య మనుగడకు వ్యతిరేక శక్తులైనాయి.

"నీరో చేతకాని, ముస్సోలినీ చేతకాని పరిపాలింపబడినప్పటికీ కాస్త మంచి ఉండకపోదు. అయితే మనం అలాంటి ప్రభుత్వాలను పూర్తిగా విసర్జించాలి. మన దేశంలో చక్కని రోడ్లు, రాజ భవనాలను తలంపుచేసే విద్యా సంస్థలూ ఉన్నాయి. అయితే అవి దేశాన్ని అణగద్రొక్కే (బ్రిటీష్ ప్రభుత్వ కాలంలో) ఒక విధానంలో భాగాలు మాత్రమే. నాకు అవి అవసరం లేదు. అలాంటి ప్రభుత్వం పడగ మీద మణిని ధరించిన పాము లాంటిది, నోట్లో మాత్రం విషమే" అని గాంధీజీ వ్యాఖ్యానించినాడు.

## సంప్రదింపు గ్రంథాలు


1. Ebenstein : Todays Isms.
2. Mussolini : Fascism.
3. H. W. Schdnier : Making of Fascist State.
4. Rocco : Political Doctrine of Fascism
5. Coker : Recent Political Thought.
6. Sabine : A History Political Theories.
7. Maxey : Political Philosophies.




# కచ్ఛపీనాదము

శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి

రసహృదయమ్ము కల్గుట పురాకృత పుణ్యవశమ్మొ-కాదొ-నీ
రసమగు చర్చలేల మధురంబగు నాద పరీమళమ్ములో
గుసగుసలాడు భావములకుం జలియించుట నేర్చినట్టి – మా
నసమది దివ్యధామము; సనాతన నిశ్చల సాంప్రదాయముస్.

ప్రతి పాటకు; ప్రతి మాటకు
శ్రుతి యొక్కటి మంద్రమగుచు సోకును చెవులన్
గతి తప్పదు; మధురస సం
గతి విప్పుచు నీడవోలె కదలును వెంటన్.

నునుమంచు తెరలలో కనిపించు బాలార్క
బింబమ్ము రీతి పవిత్రమగుచు
ప్రాభాత సమయ పుష్పాభిశోభిత వనీ
సౌందర్య మట్లు నిసర్గమగుచు
అనిమిత్త మధురహాసామృతావిష్కృత
శైశవస్థితి భంగి స్వచ్ఛమగుచు
సప్తవర్ణ ప్రభా సమ్మేళనమ్మైన
హరివిల్లువలె మనోహరమునగుచు

దృశ్యమేకాక శ్రవ్యమౌరీతిఁదోచు
గానమో! యిది చిత్రమోగాని దిశలఁ
గ్రమ్ముకొన్నది యాద్యంత రహితమగుచు
రాగశుద్ధమ్ములైన మూర్ఛనల తోడ!

ఒక కవీశ్వరు భావనోద్యాన సీమలో
వాసించు వ్యంగ్య ప్రవాహమదియె!
ఒక చిత్రకారుని యొక్క కుంచియనుండి
జాల్వారు రంగుల స్వప్నమదియె!
ఒక దివ్యమధురగాయకమౌళి గొంతులో
రవళించు రసమయ రాగమదియె!
ఒక మహా శిల్పి చేతికి లొంగు శిలలోని
నవనీత సదృశ ప్రాణమ్మనదియె!

నర్తకీ పదయుగళ విన్యాసమదియె!
తరళ చంద్రికవోలె ప్రత్యణువునందు
'కారయిత్రి' గ కచ్ఛపీగానముండు
కాలగతి వెంట నేపథ్యగానమువలె.

శోకమే రసమయ శ్లోకమై జగతికి
దశరథాత్మజుగాథ దక్కినపుడు
ఆషాఢమాసాన నంబరమ్మన మేఘ
సందేశమొక్కటి సాగునపుడు
గీర్వాణ సౌధాలకే యంకితముకాక
తెలుగింట 'వ్యాసము' కులుకునపుడు
స్వచ్ఛానుభూతియే సర్వస్వమౌనట్లు
భావగీతము పొంగు వారునపుడు

ఎట్టిరాగము పల్కినదేమొగాని
అక్షరాకృతి జాతికి నందెనిట్లు
ప్రణవ నిక్షిప్త మంత్రాక్షర ప్రభాస
నవ్యతాస్రష్ట కచ్ఛపీనాద లహరి.



శ్రీ పి. సుందరరామశాస్త్రి

# విష్ణుకుండినుల వంశ, కాలానుక్రమణికలు

*(గత సంచిక తరువాయి)*

## VII తుమ్మలగూడెం శాసనాలు : ప్రామాణికత

తుమ్మలగూడెం శాసనాలను గూర్చి కూడ ఇటువంటి వివాద మున్నది. వాటిలో రెండవ శాసనం శక సంవత్సరాన్ని పేర్కొనడం వలన, అది ఆచార్య వి. వి మిరాషీ[191] గారి అనుమానానికి గురయింది. ఆనాటికింకా శకసంవత్సరం ఆంధ్రదేశంలో వ్యాపించలేదని ఆయన అభిప్రాయపడి, ఆ శాసనాలు కృతకమైనవి కావచ్చునని భావించారు. కాని, తుమ్మలగూడెం శాసనంతో ఇంచు మించు సమకాలానికి చెందిన అనేక బాదామి చాళుక్య శాసనాలు శక సంవత్సరాలను పేర్కొంటున్నాయి[192] వాటికంటె ముందు ప్రాచీన పల్లవ రాజైన సింహవర్మ 22వ రాజ్య సంవత్సరానికి సరియైన శక380 సంవత్సరాన "లోక విభాగ" మనే జైన గ్రంధ రచన పరిసమాప్తి చెందినట్లు, ఆ గ్రంధాతర్గత సాక్ష్యంవలన తెలుస్తున్నది.[193] కనుక శక సంవత్సరం పేర్కొనబడడంచేత, తుమ్మలగూడెం శాసనాలు కృతకమైనవిగా శంకించపనిలేదు.

అయితే, రెండు తుమ్మలగూడెం శాసనాల లిపి లక్షణ సామాన్యం వలన మొదటి శాసనం కృతకమని భావించ వీలున్నది. లిపి లక్షణాన్ననుసరించి డా.రామారావుగారు చేసిన సిద్ధాంతం పైన సవిమర్శకంగా ప్రస్తావించి, నిరాకరించడం జరిగింది. అయితే మొదటి తుమ్మలగూడెం శాసన భాష, శాసనోక్త విషయాలు తక్కిన విష్ణుకుండిన శాసనాలతో విరోధించనందున దాని ప్రామాణికతకు భంగంలేనట్లు తోస్తుంది. రెండవ విక్రమేంద్రవర్మ దానం చేసే సమయాన, అంతకుపూర్వం గోవిందవర్మచే నీయబడిన శాసనానికి, మఱొక ప్రతి చెక్కించబడిందని, మనకు లభ్యమైనదదేనని భావించడం యుక్తమని తోస్తుంది.

తుమ్మలగూడెం శాసనంలో ప్రధానంగా కన్పించే బౌద్ధమత ప్రభావంవలన, గోవిందవర్మను, మొదటి విక్రమేంద్రవర్మను బౌద్ధులుగా వర్ణించడంచేత; ఈ రెండు శాసనాలు పరమ భట్టారికా మహాదేవీ విహారంలోని బౌద్ధ భిక్షువులచే రచించబడియుంటాయని, డా. శంకరనారాయణన్[194] గారభిప్రాయపడినారు. అది సత్యమే కావచ్చును. కాని, ఆ రాజులా కారణంచేత బౌద్ధులుగా వర్ణింపబడినారని, యథార్థంగా వారు బౌద్ధమతావలంబులన్న వర్ణనలు వాస్తవం కాకపోవచ్చునన్న ఆయన వాదం[195] యుక్తియుక్తంగా కన్పించదు. ఆ రెండు శాసనాలు విక్రమేంద్రవర్మ దానం చేసిన సమయంలో నాతని పర్యవేక్షణలోనే రచింపబడియుంటాయని, రాజవంశీయుల ప్రశంసలు పరిశీలించబడకుండ శాసనస్థం కాజాలవని నిస్సంశయంగా చెప్పవచ్చు. పైన చర్చించిన పొలమూరు శాసన విషయాలతో పోల్చినపుడి విషయం స్పష్టం కాగలదు. ముఖ్యంగా మాధవవర్మ, ఇంద్రభట్టారక వర్మ, రెండవ విక్రమేంద్ర వర్మల కెట్టి బౌద్ధ వర్ణన లేక వాస్తవంగానే ప్రశంసించబడడంతో, శంకరనారాయణన్ గారి వాదం పేలవమై పోతున్నది.

ఈ కారణాలవలన రెండు తుమ్మలగూడెం శాసనాల ప్రామాణికత శంకాస్పదం కాదని, ఆ శాసనాలనుండి లభ్యమైన సమాచారమే సమగ్రమైన విష్ణుకుండిన వంశ, కాలానుక్రమణికల నిర్మాణానికి విశ్వసనీయమైన సాక్ష్యాధారమని భావించడం యుక్తం.

## VIII విష్ణుకుండిన వంశ, కాలానుక్రమణికలు

పై చర్చల సారాంశంగా, రెండుతుమ్మలగూడెం శాసనాలలోను వివరించబడిన వంశకాలానుక్రమ సాక్ష్యాధారాలనుపయోగించి విష్ణుకుండిన చరిత్రను నిర్మించడం యుక్తమని, అందు కవరోధమవుతున్న పొలమూరు శాసనం కృతకము, అవిశ్వసనీయము కావడాన వదలివేయదగిందని అర్థమవుతున్నది.

రెండవ తుమ్మలగూడెం, తుండి, శాసనాలవలన రెండవ విక్రమేంద్రవర్మ క్రీ. శ. 550–570 సంవత్సరాల నడిమికాలంలో పరిపాలించినాడని ఖచ్చితంగా నిర్ణయించవచ్చు. అతని తండ్రియైన ఇంద్రవర్మ తన 27వ రాజ్య సంవత్సరంలో రామతీర్థం శాసనాన్నిచ్చినాడు. అతన్నిగూర్చి రెండవ విక్రమేంద్రవర్మ తాని

చ్చిన ప్రతిశాసనంలోను దాయాద వినిర్ఘాతం చేశాడని చెపుతుండగా, రామతీర్థం శాసనం ఆ యుద్ధాలను గూర్చి ప్రస్తావించదు. కనుక ఆ పోరాటాలు రామతీర్థం శాసన ప్రదానానంతరం జరిగాయని అందుచే ఇంద్రవర్మ 27 సంవత్సరాలకంటె అధికంగానే పరిపాలించినాడని నిశ్చయించవచ్చు. ఆ రాజు సుమారు ముప్పది సంవత్సరాల కాలం క్రీ. శ. 525-535 సంవత్సరాల నడుమ పరిపాలించినాడని నిర్ణయించవచ్చు. ఇంద్రవర్మ తండ్రియైన మొదటి విక్రమేంద్రవర్మ పరిపాలన మొకదశాబ్ది కంటె నధికమని భావించ వీలులేదు. అతని కుమారుడు ముప్పది సంవత్సరాలు, తండ్రి నలువది సంవత్సరాలు పరిపాలించినట్లు కన్పిస్తూండడాన ఈ నిర్ణయం సహేతుకమే. ఈతని పరిపాలనకాలం క్రీ. శ. 515-525 సంవత్సరాల మధ్యకాలంగా భావించవచ్చు.

మొదటి విక్రమేంద్రవర్మ తన తండ్రియైన రెండవ మాధవవర్మనుండి పరిపాలనాధికారాన్ని పారంపర్యంగానే పొందినాడని అతని ద్వైమాతుర సోదరుడైన దేవవర్మ కాని అతని కుమారుడు, రెండవ ఈపూరు శాసన ప్రదాతయునైన మూడవ మాధవ వర్మకాని, స్వతంత్రరాజులు కారని పైన నిర్ణయించబడింది.[196] అందుచే పూర్వచరిత్ర కారులవలె ఈ త్రికూట శాకీయులను విష్ణుకుండిన వంశవృక్షంలో కుడిప్రక్కనకాక ఎడమ ప్రక్కన చూడవలసి యుంటుంది.

రెండవ మాధవవర్మ పొలమూరు శాసనాధారం వలన 48 సంవత్సరాలు పరిపాలించినట్లు తెలుస్తున్నది ఆ శాసన ప్రామాణికతను పైన తిరస్కరించి, తత్త్యాగమదానం మొదటి ఈపూరు శాసన ప్రదాన సమయంలోనే జరిగి యుంటుందని నిర్ణయింపబడింది. ఆ శాసనం మాధవవర్మ ముప్పది ఏడవ సంవత్సరంలో ఈయబడినది. కనుక మాధవవర్మ సుమారు నలువది సంవత్సరాలు, క్రీ. శ. 475-515 సంవత్సరాల నడుమ పరిపాలించినాడని నిర్ణయించ వచ్చును. విష్ణుకుండిన వంశంలో నీతడొక్కడే ఏకాదశాశ్వమేధక్రతు సహస్రయాజి.

రెండవ మాధవవర్మ తండ్రియైన గోవిందవర్మ తన తుమ్మలగూడెం శాసనం వలన ముప్పది ఏడు సంవత్సరాలు పరిపాలించినట్లు తెలుస్తున్నది. ఆ శాసన ప్రదానానంతరం కొంత వ్యవధినిచ్చి, అతడు నలువదేండ్లు, క్రీ. శ. 435-475 సంవత్సరాల నడిమి కాలంలో పరిపాలించినట్లు భావించవచ్చు. గోవిందవర్మ తాత తండ్రులయిన ఇంద్రవర్మ, మొదటి మాధవవర్మలను గూర్చిన సమాచారమేదీ తెలియరాదు. అట్టి సందర్భాలలో చరిత్రకారులు 25 సంవత్సరాల సగటు పరిపాలనా కాలాన్ని కేటాయించే సంప్రదాయాన్ననుసరించి, ఆ రాజులు క్రీ. శ. 385-410, 410-435 సంవత్సరాల నడుమ పరిపాలించారని తాత్కాలికంగా నిర్ణయించవచ్చు. ఈ విధమైన విష్ణుకుండిన వంశ, కాలాను క్రమణికలు ఎట్టి యసహజమైన ఊహలు, శుష్కతర్కాల సాయంలేకుండ నిర్మించదగి, సమకాలీన సన్నిహిత రాజవంశాల చరిత్రలతో చక్కగా సరిపోలి ఉంటాయి.[197]

అయితే ఈ విధమైన వంశకాలాను క్రమణికలు విష్ణుకుండిన పరిపాలన క్రీ. శ. 570తో నంతమవుతున్నట్లు; క్రీ. శ. 617లో రెండవ పులకేశి దండయాత్ర వరకు శూన్యకాల మేర్పడు తుందన్న వాదన[198] చేత కించిద్బాధిత మవుతుంది. కాని వాస్తవంగా, అటువంటి అనుమానాని కవకాశంలేదు. తూర్పు చాళుక్య శాసనాలు వేంగిని కుబ్జవిష్ణువర్ధనుడు, దుర్జయులనుండి సాధించినట్లు తెల్పుతాయి. అందుచే విష్ణుకుండిన చాళుక్య యుగాల నడుమ కొంతకాలం దుర్జయుల పాలనకు కేటాయించాలి. అయితే, క్రీ. శ. 570 సంవత్సరం తర్వాత వెంటనే వేంగి దుర్జయుల వశమైందనడానికి బలీయమైన సాక్ష్యమేదీలేదు. ఆ సంవత్సరం తర్వాత రెండవ విక్రమేంద్రవర్మ మరికొంత కాలం పరిపాలించినాడని చెప్ప వీలులేకున్నా, వెనువెంటనే దుర్జయులు ప్రాబల్యం వహించినారన వీలులేదు. విష్ణుకుండిన పతనానంతరం తీరాంధ్రదేశంలోని వారి ప్రధాన సామంతులు, శ్రీ పృథ్వీమూల, రణదుర్జయ వంశీయు లిరువురూ, స్వతంత్ర రాజ్య స్థాపనకు ప్రయత్నించినారని, అందుతుదకు రణదుర్జయులు విజయులైనారని చెప్పడానికి తగిన ఆధారాలు కన్పిస్తున్నాయి.[199]

రణదుర్జయ వంశీయుడైన పృథ్వీమహారాజు తన గొల్లావల్లి శాసనాన్ని అతని 49వ రాజ్య సంవత్సరంలో నీయడంవలన[200] అతడొక అర్ధశతాబ్ది కాలం పరిపాలించినట్లు భావించవచ్చు. అతని పరిపాలన క్రీ. శ. 617లో రెండవ పులకేశి దండయాత్ర వరకు జరిగినట్లూహించుకొంటే, అతని రాజ్యారంభ సంవత్సరం క్రీ. శ. 567గా నిర్ణయించ వీలవుతుంది. క్రీ. శ. 566లో రెండవ విక్రమేంద్రవర్మ పల్లవులపై దండయాత్రను ముగించిన వెనుక, గోదావరీ ప్రాంతంపై దండు వెడలినట్లు తుండి శాసనం తెలియజేస్తుంది. ఈ ఆధారాలనుబట్టి, రెండవ విక్రమేంద్రవర్మ పల్లవుల వలన దండయాత్రా సంరంభంలో నుండగా, రాజ్యాభిషిక్తుడైన పృథ్వీ మహారాజు స్వతంత్రించి, విష్ణుకుండిన రాజు నా ప్రాంతంపై దండెత్తి రావలసిన పరిస్థితి కల్పించినట్లు స్పష్టమవుతున్నది. అయితే ఆ యుద్ధంలో విష్ణుకుండినరాజు విజయుడైనాడని భావించవచ్చు. కారణమేమంటే, అతడు రణదుర్జయ రాజధానియైన పిష్టపురందాటి, ఈశాన్యదిశగా పయనించి, తుండి గ్రామాన్ని దానం చేసినాడు. రణదుర్జయరాజు నోడించనిదే, అది అసాధ్యంకద!

ఈ ఆధారాలనుబట్టి క్రీ. శ. 570 తర్వాత రెండవ విక్రమేంద్రవర్మ మృతివలన శ్రీ పృథ్వీమూల, రణదుర్జయ వంశీయుల నాడు జరిగిన పోరాటాల్లో రణదుర్జయులు, బహుశ క్రీ. శ. ఏడవ శతాబ్దారంభకాలంలో వేంగినాక్రమించి, రెండవ పులకేశి దండయాత్రనాడు తీరాంధ్రమంతటిని పరిపాలించినారని, ఈ రాజవంశాల సంఘర్షణలతో ఆరవశతాబ్ది చతుర్థపాదం ముగిసిందని భావించవచ్చు.

పై పరిశీలనాంశాలన్నిటిని దృష్టిలోనుంచుకొని, డా. విష్ణుకుండిన వంశ, కాలానుక్రమణికల నీవిధంగా నిర్మించడం అజయ్ మిత్రశాస్త్రిగారు సూచించిన ప్రణాళికల కనుగుణంగా యుక్తమని నిర్ణయించ వచ్చును.




## అధోజ్ఞాపికలు: అనుబంధ వ్యాఖ్యలు

1 డా. మారేమండ రామారావు, J. I. H., **XL, P. 575**; భారతి 1978 నవంబరు, పుట 60. ఈ విషయం ముందు వివరంగా చర్చించబడింది, ఖండిక V

2 ఆ శాసనాన్ని ప్రకటించిన ఆచార్య వి వి మిరాషీ **(Epi. Ind. XXVII, Pt. VII, P. 313)**, ఆ శాసన ప్రదాత పుండరీక (పౌండరీక) బహు సువర్ణాది క్రతువులను చేసిన సార్వభౌముడని వర్ణించడం వలన, ఆ కాలాన అట్టి క్రతువులు చేసిన మాధవవర్మ నామధేయుడైన రాజు విష్ణుకుండిన వంశీయుడొక్కడేనని, అభిప్రాయపడినారు. కాని, డా॥ డి. సి. సర్కారుగారు **(H.C.I.P., III, P.207)** ఈ శాసనం కృతకమైందని **(Spurious)** విశ్వసనీయమైంది కాదని, అభిప్రాయపడినారు. అయితే, ఆయన ఇటీవల తన అభిప్రాయాన్ని మార్చుకున్నట్లు ఈ వ్యాసకర్తకు ఒక ఉత్తరంలో తెలియజేశారు.

3 విష్ణుకుండిన వంశ, కాలానుక్రమణికల కుపయోగించకున్నా అది వారి చరిత్రలో పల్లవులతో గల సంబంధాన్ని వివరిస్తుంది.

4 **Epi. Ind. IV, PP. 193—198.**

5 శాసన పాఠం (శా.పా.) పంక్తులు 25-26. "విజయ రాజ్య సంవత్సరంబుళ్ 10 మాసక్కం 8 గిహ్మ 5.

6 విష్ణుకుండిన శాసనాలన్నిటా మహారాజుల పరంపర పితృ పుత్రానుగత సంబంధంలోనే వివరింపబడింది.

7 శా. పా. 2–9. "...ఏకాదశాశ్వమేధావ భృథావధౌత జగత్కల్మషస్య క్రతు సహస్రయాజినః సర్వమేధావాప్త సర్వభూత స్వారాజ్యస్య బహు సువర్ణ పౌండరీక పురుషమేధ వాజపేయ యూధ్య షోడశి రాజసూయ ప్రాధిరాజ్య ప్రాజాపత్యాద్యనేక వివిధ పృథు గురు వర శతసహస్ర యాజినః క్రతువరానుష్ఠా తాధిష్ఠా ప్రతిష్ఠిత పరమేష్ఠిత్వస్య మహారాజస్య సకల జగన్మండల విమల గురు పృథుక్షితిపతి మకుటమణిగణ నికరావనత పాదయుగళస్య..."

8 శా. పా. 6–7 పైన పేర్కొనబడింది. ముందు దీన్ని గూర్చి చర్చించబడింది. ఖండిక VI-1

9 శా. పా. 10. "విష్ణుకుండి వాకాట(క) వంశద్వయాలంకృత జన్మనః"

10 శా. పా. పంక్తులు, 11–13. "...స్ఫురన్నిశిత నిస్త్రింశ ప్రభావ భాసితాశేష జగన్మండలాధిష్ఠితస్య భ్రూ భంగకర వినిర్ధూత సమగ్రదాయాదస్య అనేక చాతుర్దంత సమర సంఘట్ట ద్విరదగణ విపుల విజయస్య..."

11 శా. పా., పంక్తులు 12–13. పైన పేర్కొనబడింది, ముందు వివరించబడింది. ఖండిక III.

12 శా. పా. పంక్తులు 17–18. "శైశవ ఏవ సకల నృప గుణాలంకృతస్య సమ్యగధ్యారోపిత సకల రాజ్య భారః"

13 Epi. Ind. XII, PP. 133 - 136.

14 శా. పా., పంక్తులు 15–16. "శ్రీమతో రాజ్య కాల వర్షా ణీంద్రవర్మణః సప్తవింశతికం జ్యేష్ఠమాస శుక్లపక్ష సప్తమ్యాం..."

15 శా. పా. పంక్తులు 1-4. "సకల మహీమండలావనత సామంత మకుట మణి కిరణావలీఢ చరణ యుగో విఖ్యాత యశాః శ్రీ మన్మహారాజ మాధవవర్మా। తస్యోర్జిత శ్రీ విష్ణుకుండి పార్థివోదితోదితాన్వయ తిలక సముద్భూ తైకాదశాశ్వమేధావాభృథా వధౌత జగత్కల్మష క్రతు సహస్ర యాజినః స్నానపుణ్యోదక పవిత్రీకృత శిరసః..."

16 శా. పా. 4–5. "...మాతా పితృ పాదానుధ్యాతో భయ వంశాత్మజాలంకార భూతః శ్రీ మాన్విక్రమేంద్రాఖ్య రాజా .."

17 శా. పా. పంక్తులు 5–6. "...అనేక చాతుర్దంత సమర శతసహస్ర సంఘట్ట విజయీ...చతురుదధి నృపతి మకుట మణిమయూఖ విచ్ఛురిత పాదామ్బురుహః..."

18 Epi. Ind. XVII, PP. 334—337.

19 శా. పా. పంక్తి. 14. "ప్రవర్థమాన విజయ రాజ్య సంవత్సరే సప్తత్రింశా గి ప 7 ది 10 5॥"

20 శా. పా. పంక్తులు 1–3. "...అపరిమిత బలపరాక్రమస్య పరమ ధార్మికస్య ప్రజాత సకల సామంతస్యానేక గో హిరణ్య భూమి ప్రదానస్య మహారాజస్య శ్రీ గోవిందవర్మణః..."

21 శా. పా. పంక్తులు 3–8. "...స్మృతి మతిబల సత్వ ధైర్య వీర్య వినయ సంపన్నః సకల మహీమండల మనుజ పతి ప్రతిపూజిత శాసనః త్రివరనగర భవనగత యువతీ హృదయ నందనః స్వనయ బలవిజిత సకల సామంతాతుల బల వినయ నయ నియమ సత్వసంపన్నః సకల జగదవనీ పతి ప్రతి పూజిత శాసనః అగ్నిష్టోమ సహస్రయాజీ హిరణ్య గర్భ ప్రసూతః ఏకాదశాశ్వమేధావ బృథావధౌత జగ త్కల్మషః సుస్థిర కర్మా మహారాజ శ్రీ మాధవవర్మా..."

22 Epi. Ind. XVII, PP. 337-339.

23 శా. పా. పంక్తులు 1–4. ".. ఏకాదశాశ్వమేధావ భృథావ ధౌత జగత్కల్మష స్యాగ్నిష్టోమ సహస్రయాజినోనేక సామన్త మకుట కూట మణి ఖచిత చరణయుగల కమలస్య మహారాజస్య శ్రీ మాధవర్మ ణః "

24 శా. పా. పంక్తులు. 4–5 "...క్షత్రియావస్కంద ప్రవర్తితాప్రతిమ విఖ్యాత పరాక్రమస్య శ్రీ దేవ వర్మ ణ ః..."

25 శా. పా. పంక్తులు 5-6 త్రికూటమలయాధిపతి ర్వయ వినాయ సత్వసంపన్నో . "

26 శా. పా. పంక్తి 13. విష్ణుకుండ్యధిరాజధ్యానో దాత్తా అని హుల్ష్ దొరగారు చదివినారు. కాని, ఇటీవల డా. శంకరనారాయణన్‌గారు "విష్ణుకుండ్యధిరాజ గుణ భర్తా" అని చదివినారు. (The Vishnukundis and their times, PP. 13, 49, PP. 164) ఆయన పాఠము అనుమానాస్పదము, దానిపై ఆధారపడిన సిద్ధాంతం సహేతుకంకాదు.

27 డా. డి. సి. సర్కారు, Successors of Satavahanas, P. 134, డా. కె. గోపాలాచారి The Early History of Andhra Country. P 205. ఈ పూరు శాసనకాలం నాటికి తత్ప్రదాత అస్వతంత్రుడని, అందుచే అందలి రాజ్య సంవత్సరం "విష్ణుకుండ్యధిరాజ"ని పేర్కొనబడిన మహారాజ మాధవవర్మకు చెందినవని డా. సర్కారుగారి అభిప్రాయం. అయితే ఆరాజు తర్వాత సింహాసన మధిష్ఠిం చిన వాడే శాసనదాత అయిన మాధవవర్మయని ఆయన భావించారు. వంశ, కాలాను క్రమణికల గూర్చిన చర్చలో విపులీకరించ బడింది.

28 ఈపూరు శాసన కాలంనాటి కీతడు స్వతంత్రించినట్లే వ్యాసకర్త భావం. ఖండికIIIలో చర్చింపబడింది.

29 హుల్ష్ Epi. Ind. XVII,

30 భావరాజు వెంకట కృష్ణారావు Early Dynasties of Andhradesa, P. 419, 482.

31 డా. డి. సి. సర్కారు. Successors of Satavahanas P. 103

32 Journal of the Dept. of Letters, Calcutta University, XI, PP. భారతి, VIII, సంచిక 8, IX, సంచిక2; J A H R S. vI, P. 17 ff

33 శా. పా. పంక్తులు 26, "....ఫాల్గుణ పౌర్ణమాస్యాం సోమ రాహు సగ్రహనిమిత్తే; పంక్తి 41, విజయరాజ్య సంవత్సరే 48.

34 శా. పా. పంక్తులు. 1–4 " .. అప్రతిహత శాసనస్య స్వప్రతాపోపనత సామంత మనుజపతి మండలస్య విరహిత రిపుషడ్వర్గస్య విధివదుపచిత త్రివర్గస్య విబుధపతి సాధ్య శరవీర విభవ బలపరాక్రమస్య..."

35 శా. పా. పంక్తులు. 4–6. అనేక సమర సంఘట్ట విజయినః పరనరపతి మకుటమణి మయూఖావదాత చరణ యుగళస్య విక్రమాశ్రయస్య

36 శా. పా. పంక్తులు 7–8.

37 శా. పా. పంక్తి. 8.

38 శా. పా. పంక్తులు, 8–9.

39 శా. పా. పంక్తులు 9–11.

40 శా. పా. పంక్తులు 11–14.

41 శా. పా. పంక్తులు 14–16.

42 Epi. Ind. XIX, No. 42, PP. 254–258.

43 ముందు V ఖండికలో విపులీకరించబడింది.

44 A. P. G. A. S., No. 8 ఆచార్య రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు ప్రకటించారు., Epi. Ind. XXXVI, Pt. I, PP 7-12లో డా. డి. సి. సర్కారుగారు కూడ ప్రకటించారు.

45 సర్కారుగారు ఈ శాసన కాలాన్నిలా స్పష్టంగా ఉద్ధరించారు. సంవ 10 4 గ్రీ [2] ది ప్రతిపది.

46 భారతి 1966, జూన్ 14–28, మరియు జులై 2–14 లలో ఇంద్రపాల నగర శాసనాలనే పేర ప్రకటించబడినాయి. Epi. Andhrika, IIలో తుమ్మలగూడెం శాసనాలనే పేర, అవి లభ్యమైన తావుమబట్టి పేర్కొనబడుతూ, ప్రకటించబడినాయి.

47 మొదటి తుమ్మలగూడెం శాసనం. ముందు వివరించబడుతున్నది.

48 అందు పేర్కొనబడిన శక కాలసూచిక. అంతేకాక, 6వ శతాబ్దికి చెందిన ఇతర విష్ణుకుండిన శాసనాలతో – తుండి, చిక్కుళ్ళ, గోదావరి, కట్టు చెరువు తామ్రశాసనాల లిపితో పూర్తి పోలికలు కల్గిన అక్షర నిర్మాణం కల్గి ఉంటాయి. చూడండి, ఖండిక V.

49 శా. పా. పంక్తి 13. "గోవిందవర్మణాం ఆత్మనః ప్రవర్థమాన విజయరాజ్య సంవత్సరే సప్తత్రింశత్కే వైశాఖ పూర్ణ మాస్యాం..."

50 గోవిందవర్మ ప్రశంస, పంక్తులు 4–12. "స్వనయ భుజ బలోత్సాహ ప్రభావానురాగా వాప్త స్వరాజ్యేన, శౌర్య ధైర్య ప్రతాపానుభావా దన్యసామంతాక్రాంత రాజ్యాంతరేణ, దాన మానాదిభి రనురక్త వర్ణాశ్రమ స్వజన పరిజనేన, గ్రామ క్షేత్ర హిరణ్య ద్విరద తురగ గోబలీవర్ద శయనాసన యాన పాన భోజన భాజన భవన వసనాభరణ కన్యాదాసీ దాస సహస్రాణాం దాత్రా, అనేక దేవాయతన విహారసభా ప్రపాతటాకోదపానారామ ప్రతి సంస్కార పూర్వ్యకరణీవాలంకృత సకల దిగంతరేణ, భిక్షుద్విజానాథ యాచక వ్యాధిత దీన కృపణ జనోపభుజ్యమాన న్యాయాధిగత విభవ ధన సముదయేన, సకృత్సర్వస్వ త్యాగినా, సకల శాస్త్రార్థ శ్రవణ పరిజ్ఞానాదిహ పరత్ర చానన్య చక్షుషా విద్వచ్ఛూర మహా కులీన జన సమాశ్రయేణ, సకల సత్వధాతూ త్రాణాయోత్పాదిత మహాబోధి చిత్తేన, మహారాజశ్రీ గోవిందవర్మణా..."

51 శా. పా. పంక్తులు 21-24. "స్వస్యా అగ్రమహిష్యా పరమ మహాదేవ్యా విహారస్య దీప, ధూప గంధ పుష్ప. దార్థం ద్వా వె మ్బు దల పెన్కా పఅ నామధేయో గ్రామౌ ఉదక పూర్వకం అతిసృష్టో..."

52 శా. పా., పంక్తులు 30–31. "...అస్మాభిః ప్రవర్థమాన విజయరాజ్య సంవత్సరై కాదశే కార్తికమాస కృష్ణ పక్షాష్టమ్యాం..."

52a శా. పా. పంక్తులు, 43–44. "...సాష్టాశీతి చతుశ్శతే శకపతే సంవత్సరాణాంగతే..'

53 శా. పా. పంక్తి 1. దీప్త్యా దిజ్మండలం వ్యాప్తం। యస్య బాలార్క తేజసః॥ సత్యాశ్రయ। శ్రీమత్స। జయత్యుత్తమాశ్రయః॥

54 శా. పా, పంక్తులు 3–6 "...షడభిజ్ఞ ప్రాతిహార్య దర్శనానుగ్రహాజనిత సుగత శాసనాభి ప్రసాదస్య, విబుధ భవన ప్రతిస్పర్థి శోభాసముదయానేక మహావిహార ప్రతిష్ఠాపనాధిగత బ్రహ్మపుణ్య సంభారస్య మహారాజశ్రీ గోవింద వర్మణః..."

55 శా. పా., పంక్తులు 6–9 "ఏకాదశాశ్వమేధ బహుసువర్ణ పౌండరీక వాజపేయ క్రతుసహస్ర సర్వమేధ రాజసూయ పురుషమేధా ద్యాహరణాత్సమ్యగనుష్ఠిత శ్రుతివిహితా శేష దుష్కర కామ్యకర్మానుష్ఠానస్య, ప్రాగ్దక్షిణాపరాంభోనిధి రేవా సరిత్సవిలవలయ విభూషణా యాభువోభర్తుః మహారాజశ్రీ మాధవవర్మణః."

56 శా. పా., పంక్తులు 9–10 " వాకాటక మహాదేవీ సుతస్య మహాకవేః పరమసౌగతస్య మహారాజశ్రీ విక్రమేంద్ర..."

57 శా. పా., పంక్తులు 10–13 ". అనేక చాతుర్దంత విజయాధిగతాశేష చక్రవర్తి క్షేత్రాధి పత్యస్య, స్ఫురత్ఖడ్గ కరసహస్రావలీ పరిగత స్వభుజ దినకర ప్రభావ విధ్వస్తాశేష దాయాద మండలఘన తిమిరపటలస్య శ్రీంద్ర భట్టారక వర్మణః"

58 శా. పా., పంక్తులు. 13–16. ". శ్రీంద్రభట్టారక వర్మణః ప్రియసూనుః తదనురూప శౌర్యాతిశయ సమస్త

రాజర్షి గుణసంపద్యోగ సామర్థ్యాత్ప్ర కృతి మండలేన శైశవే వారోపిత రాజ్యభారం: పరమధార్మికో ధర్మవిజయీ ప్రణతానేక సామంత మకుట మణిమయూఖోద్భాసిత వర చరణ యుగళం: శ్రీమా న్విక్రమేంద్రభట్టారక వర్మణా ''

59 శా. పా పంక్తులు 17–30 శ్రీమతి పరమభట్టారికా మహాదేవిని గూర్చిన ప్రశంసలో, పంక్తులు 29–30 '' పరమభట్టారికా మహాదేవ్యా శ్రీమదింద్రపుర ముచ్చై రలంకర్తుకామయేవ ప్రతిష్ఠాపితే శ్రీమతి పరమభట్టారికా మహావిహారే...''

60 శా. పా., పంక్తులు 17–18. ''. గతకాలభావినః ప్ర పర వంశాలంకార భూతాన్సర్వానేవ రాజర్షీనను రూపేణ స్వకృత్యేత్థ మవబోధయతి (యథా) ..''

61 శా పా., 20 పంక్తిలోని ''సుతచ్ఛలేన...'' అనేవిశేషణం. దీనిని డా. రామారావుగారు పుత్రభావంతోనని అర్థం చేసుకొని శాసనప్రదాత మాధవరాజనే బాలుని పుత్రునిగా స్వీకరించాడని అనుకొన్నారు. ముందు, ఖండిక V లో చర్చింపబడింది.

62 శా.పా., పంక్తులు18–21 ''...(యథా) ప్రథిత ప్రభావాన్య రాజవంశ సాత్మీభూత పృధివీపతి పదప్రసహ్యాహరణ వ్యక్తనిరతిశయ మహిమానం, శ్రీ మాధవరాజాభిధానం, సుతచ్ఛలేన, మనోహరాకారబద్ధం నయపర్యాక మాది గుణ సందోహమభి ప్రజాతాయ ''

63 శా. పా., పంక్తులు 21–24 ''.. విష్ణుకుండికుల బహుమత్యైక సంబంధితాభి ఖ్యాత మాహాత్మ్యం, అశేష సామంత కుల తిలకాయ మానాభిజనం, అఖిలగుణమణి కిరణనికర విచ్ఛురిత విపులదిగంతరాలం, శ్రీపృథ్వీమూల రాజవంశ ముత్పత్తి పరిగ్రహేణ శ్రియేవ సాగర మలం కృతవత్యా. '' ఇందలి ''అశేష సామంతకుల తిలకాయ మానాభిజన'' మన్న సమాసాన్ని మాధవరాజుకు విశేషణంగా భావించి, డా. రామారావుగారు బాలునొక సామంతరాజవంశం నుండి రెండవ విక్రమేంద్రవర్మ గ్రహించినట్లు అభిప్రాయ పడ్డారు.

64 శా పా, పంక్తులు 24-29 ''... ప్రతి విషయ మతి బహు ప్రకార మనోరమోదార కర్మాద్భుత స్తూప విహార చూళామణిభిరలంకృత సకల దక్షిణాపథస్య శ్రీ పార్వతేయ పూర్వాపరక్షితిపతి పరంపరాహార మధ్య నిరుపమ విరాజితయా కౌస్తుభాయమానయశో జన్మనః గుణరూప సంపద్భిరనుగత గోవిందస్య శ్రీ గోవిందరాజస్య మూర్తిమతీ శ్రియ, ప్రత్యవిషయాకృత మనోరథయా పరమ భట్టారికా మహాదేవ్యా. '' ఇందలి ''గోవింద రాజస్య మూర్తిమతీ శ్రియ'' అంటే గోవిందరాజు యొక్క మూర్తీభవించిన శ్రీరూపమైన యామెచేత, అనగా గోవిందరాజుయొక్క భార్యచేత అని స్పష్టంగా చెప్పబడగా, డా. రామారావు గారు వారిరువురి సంబంధం అస్పష్టంగా చెప్పబడిందని అభిప్రాయ పడడం విచిత్రం. అలాగే శ్రీ పార్వతేయ పూర్వాపరక్షితిపతి... అనే సమాసాన్ని శ్రీ పార్వతేయాం ధ్రులు, అనగా చూటుశాతకర్ణి లేక ఇక్ష్వాకు వంశీయులని కొందరు చరిత్రకారులు భావించడం వారి ప్రజ్ఞా విశేషాలకు తార్కాణం !

65 గోవిందరాజు, గోవిందవర్మ వేర్వేరని డా. రామారావుగారి భావం జ్ఞాపికలు 51, 64 పోల్చి చూడండి. ఇద్దరు మహావిహార నిర్మాతలు, పరమ (భట్టారికా) మహాదేవి భర్తలే! తుమ్మలగూడెం శాసనంలోని భట్టారికా పదం ఆరాజులిద్దరు వేర్వేరని సూచించదు. రెండవ విక్రమేంద్ర వర్మ తరుచుగా తన వంశ పూర్వుల నామధేయాలకు భట్టారక లేదా భట్టారికా సంజ్ఞను చేర్చడం అతని శాసనాలనుండి గమనించవచ్చు.

66 64వ సూచికలో ఆమె గోవిందరాజు భార్యయని సూచించే వాక్యాలు ఉల్లేఖించ బడినాయి.

67 ఆమె ఐహిక వాంఛలనుండి మనసు మరలించి (ప్రత్యవిషయీ కృత మనోరథయా) ఇంద్రపురాన్నలంకరించే ఒకే కోరికతో మహావిహార ప్రతిష్ఠాపన జరిపిందని శాసనార్థం. అంతేకాని ఆమె గోవిందరాజు యొక్క సంపదలను ప్రదర్శింప దలచిందన్న రామారావుగారి వివరణ సరికాదు.

68 Epi. Ind. XVII, P 338

69 A. R. E., 1914, P 102.

70 A R. E, 1920, P 97 ff.

71 ఈ గుర్తింపు గూర్చి ముందు వివరంగా చర్చించ బడింది.

72 J. D. L, XI, PP. 31-62, భారతి, 1930, పుటలు 463–80, 1931, 302–314

73 Successors of Satavahanas, (1939) PP. 98-103 ఆయన నిర్మించిన విష్ణుకుండిన వంశాను క్రమణిక, అదే గ్రంథం, 104 పుటలో.

74 హుల్ష్ దొరగారు నిర్మించిన విష్ణుకుండిన వంశానుక్రమణిక చూడండి.

75 కొమర్రాజు లక్ష్మణరావుగారు నిర్మించిన విష్ణుకుండిన వంశానుక్రమణిక చూడండి.

76 Successors of Satavahanas, pp. 99-100; Q. J. M. S., XXVII, p. 232, and J. A. H. R. S., XI. pp. 129-130.

77 Early History of Andhra Country (1941), p.209

78 Studies in Early History of Andhradesa (1971) p. 109.

79 Early Dynasties of Andhradesa, p, 421.

80 Indian Culture, XV, P. 17 and H. C I. P., III p. 223.

81 మొదటి ఈపూరు శాసనము, శా. పా., పంక్తి 4–5. పొలమూరు శాసనం, శా. పా., పంక్తి 8–9.

82 మొదటి ఈపూరు శాసనము, శా. పా. పంక్తి 8; పొలమూరు శా. పా. పంక్తి 9–11.

83 హిరణ్యగర్భ ప్రసూత బిరుదం, మొదటి ఈపూరు శా. పా. పంక్తి 7, పొలమూరు శా. పా. పంక్తి 12.; అనసిత వివిధ దివ్య, పొలమూరు శా. పా. పంక్తి 8, జనాశ్రయ బిరుదం పొలమూరు శా. పా. పంక్తులు 14, 17. పొలమూరు గ్రామదానం కూడ జనాశ్రయ దత్తమని చెప్పబడింది. శా పా. పంక్తి 27.

84 భావరాజు కృష్ణారావు, Early Dynasties, p. 515, and also 538–39; ఆచార్య నీలకంఠశాస్త్రి H.C.I.P., III. p 226.

85 ఆచార్య నీలకంఠశాస్త్రి, Indian Culture, X, pp 13, ff. and H. C. I P., III, p. 224.

86 బాదామి చాళుక్యులలో మొదటి పులకేశి అశ్వమేధయాగం చేయగా, వంశానుగతంగా రాజులందరు, "అశ్వమేధ పవిత్రీకృత వపుషాం" అని చెప్పుకొనడం వారి శాసనాలలో గమనించవచ్చును. అయితే, అక్కడ అశ్వమేధఫలం వ్యక్తినుండి వంశగతమై, వంశప్రశస్తిలో ఒక భాగమైంది. కాని విష్ణుకుండినులలో అది కేవలం వ్యక్తిపరమే ఇచ్చట మాధవవర్మ నామధేయులు మాత్రమే అశ్వమేధులు కావడం గమనీయాంశం.

87 విపులమైన చర్చ ఖండిక VI లో చేయబడింది.

88 కొమర్రాజు లక్ష్మణరావుగారు, భావరాజు కృష్ణారావు, మొదట్లో డా. డి. సి. సర్కారుగార్లు ఈ ప్రాతిపదికపై నిర్మించిన వంశానుక్రమణికలను చూడండి. ఇటీవలి కాలంలో ఈ విధానాన్ననుసరించినవారు డా. నేలటూరు వెంకటరమణయ్యగారు, A. P. G. A. S., No. 40, pp, 30–31.

89 J. A. H. R. S., X, pp. 187–193.

90 డా. డి. సి. సర్కారు. H. C. I. P., III, p. 206–7, డా. మారేమండ రామారావు, Studies in Early History of Andhradesa, p. 107–8. etc.

91 తుమ్మలగూడెం రెండవ శాసనం.

92 రామతీర్థం శాసనం.

93 తుండి తామ్రశాసనం.

94 గోవిందవర్మ దానంచేసిన పెణ్కపఱ, పల్లవ సింహవర్మ మాంగడూరు శాసనంలోకూడ కన్పిస్తుంది. అది బహుశ, కర్మరాష్ట్రంలోనిదని భావించవచ్చును ఎంబుదల నేడు గుంటూరుకు సమీపంలో గల ఎనమదల గ్రామం కావచ్చును. ఈ రెండు గ్రామాలను పరమ మహాదేవీ విహారానికి దానం చేయడంవలన, ఆతని అధికారం కృష్ణదాటి దక్షిణంగా విస్తరించిందనడానికి సరియైన నిదర్శనం.

95 Epi Ind XXXVII, శా. పా. పంక్తి 4—సహ్యస్కంధావార గతో వేల్పూరుదేశం... పంక్తి 6లో ... పల్లవకుల... అనే మాటలు కన్పిస్తాయి.

96 విష్ణుకుండిన-పల్లవ సంబంధాలనుగూర్చి ఒక సమగ్రాంగ్ల వ్యాసం J. O.R., Barodaలో ప్రకటించనున్నాను.

97 మొదటి ఈపూరు శాసనం పంక్తి 1. హుల్ష్ దొరగారి పాఠం.

98 అదే శాసన పాఠ పంక్తి, శంకరనారాయణన్‌గారి వాదం.

99 J. A. H. R. S., XI, pp. 191.

100 భావరాజు కృష్ణారావు, Early Dynasties, p. 428.

101 శంకరనారాయణన్‌గారు "Vishnukundins and their Times" "అధిరాజ" శబ్దానికి రాజవంశంలో పుట్టిన, రాజ్యార్హతలేని సాధారణ రాకుమారుడని అర్థం చెప్పడం పొసగదు. Vishnukundins and their times, p 62.

102 ఖండిక VIII, చూడండి.

103 పై జ్ఞాపిక 98 చూడండి.

104 కొమర్రాజు లక్ష్మణరావుగారు J. D. L. XI, పైన పేర్కొనబడింది, భావరాజు కృష్ణారావు, Early Dynasties, p 414-415

105 మాధవవర్మ పొలమూరు శాసనం, పంక్తులు 22–26.

106 జయసింహవల్లభుని పొలమూరు శాసనం, పంక్తులు 15–19.

107 అదే శాసనం, పంక్తి 19.

108 J.D L. XI, పైన పేర్కొనబడింది, భారతి, VIII, IX, పైన పేర్కొనబడినాయి.

109 J D. L, XI, పైన పేర్కొనబడింది, పేజి 64. భారతి, VIII, 473–474.

110 డా. నేలటూరి వెంకటరమణయ్యగారి నిర్ణయాన్ని చాల సహేతుకంగా ఖండించారు. A. P G. A. S., 40, పుట 20.

111 Political History of Ancient India, (Edn. VI), p. 602, Successors of Satavahanas, p. III.

112 పొలమూరు శా. పా., పంక్తులు 21–22 "ప్రాగ్దిగ్జిగీషయా ప్రస్థితః గోదావరీ మతీతరన్..."

113 సర్కారుగారు రెండవ ఈపూరు శాసన ప్రదాత అయిన మాధవవర్మ మొదటి మాధవవర్మ యనంతరం సింహాసనము నధిష్ఠించినట్లు భావించారు. పైన, 88వ జ్ఞాపిక చూడండి.

114 Epi. Ind. XVIII p. 257 ff ఈ శాసన కాలాన్ని రాబర్టు స్యూయెల్ క్రీ. శ. 631, అక్టోబరు 10,గా నిర్ణయించారు.

115 H. C. I P., III, p. 207.

116 Epi Ind. XXXVI, Pt. I, p 8.

117 Early History of Andhradesa, (1941) p. 213.

118 Indian Culture, XV, p. 13 ff.

119 ఇతడు గంగశకము 39వ సంవత్సరంలో జిర్జింగి శాసనాన్నిచ్చినవాడు. అతడు కూడ విష్ణుకుండిన ఇంద్రవర్మవలెనే చతుర్దంత సంగ్రామవిజయుడు. ఆ శాసనకాలం క్రి. శ. 537.

120 Early Dynasties of Andhradesa, pp. 414-421.

121 అదే గ్రంథంలోని 421 పుటలో ఆయన చూపిన వంశ, కాలాను క్రమణికల పట్టిక, మరియు పుటలు 484–489.

122 అదే గ్రంథంలో పుట 487.

123 అదే గ్రంథంలోని 487–89 పుటలు. ఖండిక VIIIలో ఈ విషయం చర్చించబడుతున్నది.

124 అదే గ్రంథంలోని పుట 4, 21.

125 Epi Ind., XXIII, pp 88 ff.

126 ఉభయులు గోవిందవర్మ కుమారులే, ఏకాదశాశ్వమేధ, క్రతు సహస్రయాజులే.

127 J. I H, XLIII, pp. 734 ff. ఆయన పూర్వం ప్రకటించిన కాలానుక్రమణిక డా. సర్కారుగారి ప్రణాళిక ననుసరించి, ఈ వ్యాసంలో చూపిన (పుట 21) ప్రణాళికలో మొదటి తుమ్మలగూడెం శాసనంలోని ముగ్గురు రాజులను తొలగించగా ఏర్పడేదే! దాని నాయన J.I.H., XL, pt. 2, p 375 లో చూపారు.

128 Studies in the Early History of Andhradesa, p. 107. మరియు J. I. H, XLIII, పైన పేర్కొనబడినది.

129 తుమ్మలగూడెం రెండవ శాసనం రెండవ విక్రమేంద్రవర్మ 11వ రాజ్య సంవత్సరం నాటిది, శక 488 (క్రీ. శ. 566) నాటిది. ఆరాజా తుండి శాసనాన్ని తన పదునాలుగవ రాజ్య సంవత్సరంలో ఇచ్చినాడు.

130 ఈ వ్యాసాంతంలో ఖండిక VIIIలో ఈ విషయాలు విపులీకరించబడినాయి.

131 భారతి 1965 జూన్ సంచిక, పుట 17.

132 Eastern Chalukyas of Vengi. p. 55.

133 J. I. H., XLIII, pp, 734 ff and studies in the Early History of Andhradesa, pp. 105 ff. భారతి, 1978 నవంబరు, pp. 54 ff.

134 పైన పేర్కొనబడిన Studies in the Early History of Andhradesa, పుట 120.

135 పైన పేర్కొనబడిన, భారతి నవంబరు, పుట 55.

136 J. I. H, XLIII, p. 734 ff. భారతి, నవంబరు, పుట 60.

137 పైన తుమ్మలగూడెం రెండవ శాసనం వివరించబడింది. జ్ఞాపికలు 61 నుండి 68 వరకు చూడండి.

138 J. I. H., XLIV, pt. III, pp. 683–691.

139 పై తుమ్మలగూడెం శాసన వివరణలు–జ్ఞాపికలు 51, 65, 66 చూడండి.

140 గోవిందవర్మ (రాజ) పరమ (భట్టారికా) మహాదేవీ కుమారుడైన మాధవరాజు, మాధవవర్మ కాక అన్యుడు కాలేదు కద! తుమ్మలగూడెం రెండవ శాసనం స్పష్టంగా మహారాజు మాధవవర్మ గోవిందవర్మ కుమారుడని చెప్తూండగా 'రాజు' అనే నామాంతాన్నిబట్టి మాధవరాజొక సామంత వంశంలో జన్మించినాడని, గోవిందరాజు గోవిందవర్మకాడని భావించడం యుక్తి యుక్తం కాదు.

141 A.P.G.A.S., No 40. "విష్ణుకుండినులు"

142 అదే గ్రంథం, పుటలు 20–22.

143 అదే గ్రంథం, పుటలు 22–23, మరియు 38–39.

144 అదే గ్రంథం–పుట 24.

145 The Vishnukudins and Their Times. (1977)

146 అదే గ్రంథం పుటలు 10–11.

147 పైవలెనే—

148 అదే గ్రంథం పుట 12.

149 అదే గ్రంథం పుట 12. ఆయన నిర్ణయంమాత్రం సహేతుకం కాదు, కాని వాదం సరియైనది. పాలమూరు శాసన భాష, లిపి లక్షణాలను గూర్చి రాబోయే VI ఖండికలో విపులంగా చర్చించబడింది.

150 అదే గ్రంథం పుట 87.

151 అదే గ్రంథం పుట 13.

152 Proceedings of the A. P. History Congress, Vol. II, pp. 7–18.

153 పైన ఖండిక II లో పేర్కొనబడినాయి. జ్ఞాపికలు 81–83.

154 డా. సి. సోమసుందరరావుగారు, "The Chronology of the Vishnukundins" అనే పరిశోధక వ్యాసాన్ని 1976 మేలో గుంటూరు ఆంధ్ర విశ్వవిద్యాలయ స్నాతకోత్తర కేంద్రం నిర్వహించిన గోష్ఠి (Seminar)లో సమర్పించారు.

155 మత్స్యపురాణం 275 అధ్యాయం. అందు తల్లి గర్భం నుండి జనించిన మర్త్యుడు, ఉత్తమ సంస్కార కర్మలనే ఉన్నతమైన దివ్యదేహం ధరిస్తాడని చెప్పబడింది. అందు కనుగుణమైన కర్మకాండ నిర్దేశించబడింది.

156 పైన వివరించబడిన శాసన పాఠాలను పరిశీలించండి. రెండవ విక్రమేంద్రవర్మ శాసనాలలో క్రమంగా క్రతువుల వైవిధ్యం, సంఖ్య పెరగడం గమనించవచ్చు. తుండిశాసనం అశ్వమేధాలనే కాక, బహుసువర్ణ పౌండరీకాలను సైతం మాధవవర్మ ఏకాదశ సంఖ్యలో చేసినట్లు వివరించడాన్ని సందర్భంలో ఉదహరించవచ్చు.

157 కొమర్రాజు లక్ష్మణరావుగారు J. D. L., XI, pp 34 and 39.

158 డా డి. సి. సర్కారు Successors of Satavahanas, P. 129, అధోజ్ఞాపిక 1.

159 ఆచార్య నీలకంఠశాస్త్రి, పైన పేర్కొనబడిన Indian Culture, XV; H.C.I. P., III, ఆచార్య ఓరుగంటి రామచంద్రయ్య Itihas, I, pp. 1–9.

160 ఆచార్య నీలకంఠశాస్త్రి, Indian Culture. XV, p 13 ff. Prof. అజయమిత్రశాస్త్రి మల్లంపల్లి సోమశేఖరశర్మగారి స్మారక సంచిక, పుట.

161 డా. శంకరనారాయణన్‌గారు తన గ్రంథం(పైన పేర్కొనబడింది) పుట 10లో తర్క సంగ్రహంలోని ఒక శ్లోకాన్ని తన వాదానికి మద్దతుగా గ్రహించారు.

162 డా. శంకరనారాయణన్ మాత్రం అందుకు విముఖులు; పైన వివరించబడింది.

163 రెండవ తుమ్మలగూడెం శాసనం 45 వరుసలు కల్గి అన్నింటిలో దీర్ఘమైనది కాగా, దాని తర్వాత చెప్పాగింది 41 పంక్తులుగల పాలమూరుశాసనమే. రెండవ తుమ్మలగూడెం శాసనంలో 17–30 పంక్తులలోని పరమభట్టారికా మహాదేవి ప్రశంసను మినహాయిస్తే, పాలమూరు శాసనమే అన్నిటికంటె పొడవైన విష్ణుకుండిన శాసనము. దీని తర్వాత నీయబడిన తూర్పు చాళుక్య శాసనాలుకూడ 25 పంక్తులు మించవు. జయసింహవల్లభుని పాలమూరు శాసనం కూడ 24 పంక్తులు మాత్రమే కలది.

164 6వ పంక్తి నుండి 14వ పంక్తి వరకు కల మాధవవర్మ ప్రశంస, విష్ణుకుండిన శాసనాలన్నిటిలో, అందలి రాజుల ప్రశంసలకన్న దీర్ఘతరమైనది. అందలి కొన్ని వాక్యాలు ... విగత జగదేనస్కః, నియమాగన సంసత్వం వంటి వాక్యాలకు కల అర్థం సరిగా తోచదు.

165 వివిధ శాసనాలలోని గోవిందవర్మ ప్రశంసలు, జ్ఞాపికలు 20, 50లలో నీయబడినాయి.

166 గోవిందవర్మను పాలమూరు శాసనంలో ప్రశంసించిన తీరు 35వ జ్ఞాపికలో నీయబడింది.

167 జయసింహవల్లభుని పాలమూరు శాసన పంక్తులు 4–6. ''అనేక సమర సంఘట్ట విజయినః పరనరపతి మకుటమణి మయూఖావదాత చరణయుగలస్య శ్రీవిష్ణువర్ధన మహారాజస్య '' అనే వాక్యాలలో విష్ణువర్ధన మహారాజ నామం బదులు విక్రమాశ్రయస్య గోవిందవర్మణః అనేది మాత్రమే రెండు పాఠాలకు గల వ్యత్యాసము.

168 మొదటి విక్రమేంద్రవర్మ కనేక విష్ణుకుండిన శాసనాలలో రాజ, మహారాజ బిరుదాలు గమనించవచ్చు. రెండవ విక్రమేంద్రుడు మహారాజని చెప్పడంలో సందేహించ పని లేదు కదా!

169 తుమ్మలగూడెం మొదటి శాసనంలో ఇంద్రవర్మ, మాధవవర్మలను మహారాజని పేర్కొనడం, గోదావరి తామ్ర శాసనంలో పృథ్వీమూలుని తండ్రి అయిన ప్రభాకరుడు మహారాజని పేర్కొనబడడం ఈసందర్భంలో ఉదహరించవచ్చు.

170 డా. శంకరనారాయణన్‌గారు ఆ య న గ్రంథంలో పేజి 87లో రెండవ విక్రమేంద్రవర్మ తర్వాత నీ మాధవవర్మ

బలాత్కారంగా సింహాసనాన్నాక్రమించి యుండవచ్చుననే భావన కూడ వ్యక్తం చేశారు.

171 పొలమూరు శాసనం పంక్తులు 15-16. తన విక్రమం చేత సాధించబడిన గొప్ప రాజ్యాన్ని అనగా రాజ్యలక్ష్మిని వివాహమాడి ప్రవేశించినవాడని ఈ వాక్యానికి అర్థం కాని, శంకరనారాయణన్‌గారు (పుటలు 86-87) విక్రమేంద్ర వర్మ నుండి తాను రాజ్యం సంపాదించినట్లు చెప్పుకొన్నాడని భావించారు. అది సరికాదు.

172 రెండవ తుమ్మలగూడెం శాసనంలోని మహారాజ మాధవ వర్మ ప్రశంస.

173 డా. డి. సి. సర్కారు. H. C. I. P, III, p.

174 పొలమూరు శాసనం, 14, 17, 27 పంక్తులు.

175 పై శాసనం 7-8 పంక్తులు.

176 J. O. R. (Madras) XI, pp. 221 ff and భారతి VIII, pt, II, P. 475, Note 6!

177 South Indian Inscriptions, VI, No. 96.

178 శ్రీ కె.రామమోహనరావు, భారతి, జూన్1977, పుట31.

179 శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు, పైన వివరించ బడింది.

180 శ్రీ ఆదిత్యశర్మ, భారతి, అక్టోబరు 1977, పుట 54.

181 మొదటి ఈపూరు శాసనం 8వ పంక్తి.

182 వేంగి నాక్రమించక గుద్దాది (లేక గుద్దవాది) విషయానికి వెళ్ళే వీలులేదు. గుద్దాది విషయం నేటి రామచంద్రపురం తాలూకాతో సరియైన గోదావరితీర ప్రాంతం.

183 17వ అధ్యాయం. "కుమారీ పురాత్ప్ర భృతి బిందసరోఽవధి యోజనానాం నవ శతాని చక్రవర్తి క్షేత్రమ్ !" మరియు, అదే గ్రంధం నండి "తత్రేదం బారతం వర్షమ్। అస్యచ నవ భేదః। ఇన్ద్ర ద్వీపః కసేరుమాన్ తామ్రపర్ణీ గభస్తిమాన్ నాగద్వీపః సౌమ్యో గన్ధర్వో వరుణః కుమారీ ద్వీపశ్చాయం నవమః। పంచ శతానిజలం పంచ శతాని స్థల మితి విభాగేన ప్రత్యేకం యోజన సహస్రా వధయో దక్షిణా త్సముద్రాద్రి రాజః హిమవన్తం యావత్సర స్పర మగ మ్యాస్తే। తాన్యేతానియో జయతి ససమ్రాడి త్యుచ్యతే।" G. O. S., P. 92.

184 అర్థశాస్త్రము, IX, I. "దేశః పృథివీ। తస్యాం హిమవ త్సముద్రాన్తర ముదీ చీనాం యోజన సహస్ర పరిమాణ మతిర్యక్ చక్రవర్తి క్షేత్రమ్।"

185 పైన పట్టిక రూపంలో వివరించబడినాయి. ఖండిక IV, మరియు, జ్ఞాపికలు 105, 106.

186 శా. పా., పంక్తి 29.

187 శా. పా., పంక్తి 22.

188 విష్ణుకుండిన శాసనం పంక్తులు 17 20, 27-29; అదే పాఠం "జనాశ్రయ" పదానికి బదులు "పృథ్వీవిజయ సింఘ"; "జనాశ్రయ దత్తాం"కు బదులుగా "సర్వసిద్ధి దత్తా"అనే పదంతో చాళుక్య శాసనం 13 15; 20-22 పంక్తులలో చదువవచ్చు.

189 పొలమూరు శాసనం 8వ పంక్తి.

190 శరభపుర వంశీయుడైన నరేంద్ర మహారాజిచ్చిన కురుద్ శాసనము (Epi. Ind. XXXI, pp. 265 ff.) ఇందుకు సరియైన ఉదాహరణ. కొన్ని ప్రాచీన పల్లవ శాసనాలుకూడ తర్వాత కాలపు లిపి లక్షణాలు కలవి, అలాంటివేనని చరిత్ర కారుల అభిప్రాయం.

191 J. I. H.

192 చాళుక్య వల్లభేశ్వరుని (మొదటిపులకేశి)బాదామి శాసనము, శక 465 (Epi. Ind. XXVII, pp, 4-9) అలాగే మంగ ళేశుని బాదామి గుహాలయశాసనం, శక 500 (Ind. Ant. VI, pp. 363 ff.) పేర్కొనదగినవి. ఇవి తుమ్మలగూడెం శాసనంలోని శక సంవత్సరం 488కి చేరువలో నున్నవి.

193 సింహసూరి అనే దిగంబర జైనుని గ్రంధం (Mys. Arch. Rep. 1922, p. 23) లోని ఈ శ్లోకం
సంవత్సరే తు ద్వాత్రింశే। కాంచీశః సింహవర్మణః॥
అశీత్యగ్రే శకాబ్దానాం। సిద్ధిమే తచ్ఛత త్రయమ్॥

194 పైన పేర్కొన్న ఆయన గ్రంధంలో 40వ పుట.

195 విష్ణుకుండినరాజులు ఆదిలో బౌద్ధులనే ఈ వ్యాసకర్త అభిప్రాయం.

196 ఖండిక III.

197 విష్ణుకుండిన వంశానికి, సమకాలీన రాజవంశాలలో ప్రధానా లయిన పల్లవ, శాలంకాయన రాజులతోగల సంబంధాలను గూర్చి, J. O. R. బరోడా కొక పరిశోధనా వ్యాసాన్ని పంపి యున్నాను. అందివిషయాలు సాకల్యంగా చర్చించబడినాయి.

198 డా. సి. సోమసుందరరావు. జ్ఞాపిక, 154.

199 శ్రీ పృథ్వీమూల రాజవంశం, విష్ణుకుండిన సంబంధాలు అనే మరొక వ్యాసంలో విష్ణుకుండిన వంశీయుల అస్తమయం, అనంతర స్థితిగతులను గూర్చి చర్చించును. అది కూడ కొలది కాలంలో ప్రకటింపబడగలదు.

200 Epi. Ind. XXXV, pp. 221-224 పంక్తులు14-15.

*[ అ యి పో యిం ది ]*

# మఱ్ఱిచెట్టు

## శ్రీ మధునాపంతుల సత్యనారాయణమూర్తి

ఇక్కడి మఱ్ఱిచెట్టు
  ఎప్పుడు పుట్టిందో ...
నాకు జ్ఞానం వచ్చేసరికి
బాగా విస్తరించి...ఊడలుదిగి
బ్రహ్మాండంగాఉంది.
'పిచ్చిదాని చింపిరిజుత్తులా'
దానితలచూస్తే భయమేసేది నాకు.
ఇప్పటి గ్రామ పెద్దలూ...నేనూ కలసి
అట్లతద్ది రోజున...
మసక వెన్నెట్లో స్తంభాలాట ఆడడం.
ఊడలుపట్టుకు గిరగిరా తిరగడం.
గతించిపోయిన జ్ఞాపకాలు...
చిక్కుపడిపోయిన వేళ్ళల్లోంచి...
గుండెల్లోకి పీల్చుకుంటోందేమో...
అందుకే...ఈ దిగిన ఊడలు,
ఈ పాతికేళ్ళల్లోనూ కొంచెంకూడా మార్పులేదు.
చెట్టుకింద మాట్లువేసే "సాయిబాబు"ముఖం మీద
ఎన్ని ముడతలు ?
కళ్ళు 'నవాసారం' గుళికల్లా మారిపోయాయి.
ఆ పుచ్చిపోయిన తొర్రలోంచి...
తొంగిచూసే చిలక...అప్పటిదేనేమో !
అచ్చం ..అలాగేఉంది.
నా ఊహకి ఇంకా పసితనం వదల్లేదు.
నవ్వుకొన్నాను.
అరవై ఒకటిలో కట్టిన రాతిచప్టా...
చుట్టూరా బీటలువారింది
కానీ...పులీమేకా...దాడీ.. చదరంగం గళ్ళూ...
చెక్కు చెదరకుండా...అలాగే ఉన్నాయి.
పాలికాపులు – కుర్రకారు – పనిలేని పెద్దలూ
కాసేపు గింజలతో (పావులు) కుస్తీపట్టి...
వెళ్ళిపోతూంటారు.
ఈ మహా వట వృక్షానికి ఎన్ని శాఖలో
క్రింద అన్ని శాఖలు
ఊరిఉమ్మడి సంస్కృతికి దర్పణం
అన్యాయంగా వెలివేయబడ్డ
'సూరి'ని గూర్చి విచారణ జరిగిందిక్కడ.
అవమానంతో 'వెంకడు' ...
ఉరివేసుకొన్న దిక్కడ
పంతులుగారి పదవీ విరమణసభ...

జరిగిన దిక్కడ
నాగులచవితికి పాలుపోసి పూజలుచేసేది...
ఈ చెట్టుకింది పుట్టల్లోనే
కూలిపోయిన బడి తిరిగి కట్టేవరకూ...
'క్లాసులు' జరిగిందిక్కడ.
దీపావళి జువ్వలపోటీల్లో ముఖాలు...
కాల్చుకొన్న దిక్కడ
ఒకప్రక్క 'సాయిబాబు' కొలిమీ...
ఇంకోప్రక్క పశువులూ...
గాటీ ఆడే కుర్రకారూ...

ఇలా విభిన్న ఆకర్షణలమధ్య
సాగింది...నా జీవితం.
నేను పెరుగుకోసం మారాం చేసేటప్పుడు
అమ్మనాకు 'ఆ చెట్టే' చూపేది...
అదిగో 'బూచి' అని.

నాకు ప్రతి కొమ్మలోంచీ...
"బూచులు" కనిపించేవి ...
గాలికి కదిలే ఆకులు-కీచురాళ్ళ కేకలతో కలసి..
పాడే పాటలకి...గుండెలు "దడదడ" లాడేవి
ఊరికి కరెంటు వస్తోందని...
సంతోషంతో గెంతులువేసిన నేను
తీగలకు అడ్డం వచ్చాయని...
నరికిపారేసిన కొమ్మల్నిచూసి...

పైకి చెప్పలేని బాధ అనుభవించా
'కర్మసాక్షి' పోయినట్లు విచారించా
ఎర్రటి పువ్వుల్తో మొండిగా...నిలబడి

రోదిస్తోంది చెట్టు.
ఒక సంస్కృతిదగ్ధమైన
విషాదం ప్రతిఫలిస్తోందక్కడ.
దానినీడ పరుచుకున్నంతమేరా ...
ఎదిగేందుకు ప్రయత్నించిన ప్రతి మొక్కా
విఫలమైంది.
ఒక మహా సంస్కృతికి ప్రతినిధిగా...
చిన్నమొక్కనైనా పెంచుకోలేకపోయింది.
సిమ్మెంటుచప్టా అలాగే ఉందక్కడ...
నా జ్ఞాపకాలూ అలాగే ఉన్నాయి.

# కప్పదాటుడు దాటే నువ్వు...

ఖ్రమొద్దీన్

పల్లవించిన మావి తోటలో
  పాట లున్నాయని,
పుష్పించిన పూల తోటలో
పాతాలున్నాయని
చెప్తే
ఇది తెలియందెవరికని
"కప్పదాటుడు దాటే నువ్వు"
వుత్తి అహంకారివి!
కాకపోతే ...
నీకు చేరువలోనే,
ఆ పాటల్లోనే వినిపిస్తున్న
జీవిత మాధుర్యాన్ని,
ఆ పాతాల్లోనే దృగ్గోచర మవుతున్న
జీవిత సత్యాన్ని
గ్రహించక
వాటికోసం
ఎక్కడో,
ఎక్క డెక్కడో
ఎందుకు అన్వేషిస్తావు...?
అహంకారాన్ని అణచుకోలేక
ఎందుకు అయోమయంలో పడతావు...?
నాకు తెలుసు!
బదులు పలుకలేవు నువ్వు!
అందుకే నీ పెదవిమీద జీరాడుతోంది
పాలిపోయిన నవ్వు!!!

# ఊర్పు

శ్రీ ఎస్. మునిసుందరం

గాలి
  సంప్రదాయ కలుషితం
నీరు
కులమత విషభరితం
మట్టి
స్వార్థాంధ పరిపూరితం
అందుకే
మార్పు నా ఊర్పు.

డా॥ కె. మురళి మనోహర్
శ్రీ కె. సీతారామారావు

# సామాజిక శాస్త్ర పరిశోధనలో నిష్పాక్షికత*

సాధారణంగా మానవ విజ్ఞానాన్ని రెండు శాఖలుగా విభజించవచ్చు—ప్రకృతి—భౌతిక శాస్త్రాలు, సామాజిక శాస్త్రాలు. ఈ రెండు శాస్త్రాలు కూడా మానవ నాగరికతా వికాసంలో, మానవులు తమ శ్రమ శక్తికి ఊహాశక్తిని జోడించి, ఆచరణలోని సాధారణ అనుభవాల క్రోడీకరణయే. ప్రకృతి—భౌతిక శాస్త్రాల విజ్ఞానం మానవులు ప్రకృతి శక్తుల జయించడానికి తోడ్పడితే సామాజిక శాస్త్రాలు వాటిద్వారా పొందిన ఫలితాల్ని పంపిణీచేయడానికి సహాయపడతాయి. అందువల్ల విజ్ఞానాభివృద్ధి ఏ శాస్త్ర విభాగంలో జరిగినప్పటికీ దానియొక్క ప్రభావం ఇతర శాస్త్రాలపై పడే అవకాశముంది. అయితే విజ్ఞానాభివృద్ధిని 'సమగ్రమైనదృష్టి' తో చూసి ఇతర శాస్త్రాల ఉనికిని విస్మరించనప్పుడే అన్ని శాస్త్రాల సమతౌల్యమైన అభివృద్ధి జరుగుతుంధి. కాని మొదటి నుండి ప్రకృతి — భౌతిక శాస్త్రాల, సామాజిక శాస్త్రాల విజ్ఞానం పెరుగుదలలో పరస్పర సంఘటిత, స్వావలంబన లేక వాటి పెరుగుదలలో అసమతౌల్యమేర్పడినది. దీనివల్ల సమగ్ర మానవ విజ్ఞానం సంఘటితంగా అభివృద్ధి చెందలేదు. ఎంతో కాలంగా మరుగునపడి ఉన్న సామాజిక శాస్త్రాల పరిశోధనా ప్రాముఖ్యాన్ని ఈమధ్యకాలంలోనే గుర్తించడం జరిగింది. సామాజిక శాస్త్రాలు వస్తుగతంగా పురాతనమైనప్పటికీ, ప్రకృతి—భౌతిక శాస్త్రాలంతగా అభివృద్ధిచెందలేదు. మొదటినుండి సామాజిక శాస్త్రాల అభివృద్ధి విషయంలో ఉన్న సమస్య సరియైన సాక్ష్యాధార పరంగా విజ్ఞానం అభివృద్ధి చెందకపోవడం. భౌతిక శాస్త్రాలు, సాంకేతిక విజ్ఞానం ఉత్పత్తిని—భౌతిక సంపదను పెంచడంలో తోడ్పడినవి. కాని శాస్త్రం, సాంకేతిక విజ్ఞానంవల్ల కల్గిన ఫలితాలను, ఏర్పడిన సౌకర్యాలను ప్రజలందరికీ సమంగా అందచేసే విషయాన్ని — పంపిణీ న్యాయాన్ని — భౌతిక శాస్త్రాలు సాంకేతిక విజ్ఞానం పూర్తిగా విస్మరించినవి. అంతేగాకుండా అభివృద్ధి కూడా వాస్తవానికి దూరంగా శ్రమకు భిన్నమైన ఉత్పత్తి శక్తిగా పెట్టుబడికి ఊడిగం చేయడానికి బలవంతం చేయబడే రూపొందించబడింది. భౌతికవాదం విజ్ఞానం సమస్యను మానవుని సామాజిక స్వభావం నుండి, అతడి అభివృద్ధినుండి వేరుచేసి విడిగా పరిశీలించినందువల్ల వాస్తవికతను కనుగొనలేకపోయినవి. "మానవ విజ్ఞానం భౌతిక ఉత్పత్తిలో అతడుచేసే పనిమీదనే ఆధారపడి ఉంటుంది. అలా పనిచేయడం ద్వారానే అతడు ప్రకృతిలోని అంశాలను, ధర్మాలను, నియమాలను ప్రకృతికి తనకు మధ్యగల సంబంధాలను క్రమంగా అర్థం చేసుకుంటాడు. ఉత్పత్తిలో తన కార్యకలాపాల ద్వారానే అతడు మనిషికీ మనిషికీ మధ్య ఉండే సంబంధాన్ని గురించి కూడా భిన్న భిన్న స్థాయిల్లో క్రమక్రమంగా అర్థంచేసుకొంటాడు. ఉత్పత్తి కార్యకలాపం నుండి వేరుగా జ్ఞానం ఏదీ సంపాదింపబడజాలదు . ప్రాథమిక వనరులనుండే మానవ విజ్ఞానం అభివృద్ధి చెందుతుంది." "అంతేగాకుండా, మానవుని కార్యాచరణ కేవలం ఉత్పత్తి కార్యకలాపానికే పరిమితమై లేదు; అది వర్గపోరాటం, రాజకీయ జీవితం, శాస్త్రీయ కళాత్మక సాధన వంటి అనేక రూపాలలో కొనసాగుతుంది. ఒక్క మాటలో, సంఘజీవిగా మానవుడు సామాజిక జీవితంలోని ఆచరణాత్మకమైన అన్నిరంగాలలో పాల్గొంటాడు. ఆ విధంగా మానవుడు తన భౌతిక జీవితం ద్వారా మాత్రమేగాక, రాజకీయ, సాంస్కృతిక జీవితం ద్వారా కూడా (ఈ రెండూ భౌతిక జీవితంతో అతిసన్నిహితంగా ముడిపడి ఉంటాయి) మనిషికీ మనిషికీ మధ్య ఉండే వివిధ సంబంధాలను భిన్న భిన్న మోతాదుల్లో తెలుసుకుంటాడు. ఈ యితర తరహాల సామాజిక కార్యాచరణలో— ప్రత్యేకించి వర్గపోరాటం — దాని వివిధ రూపాలన్నింటిలోనూ, మానవ విజ్ఞానాభివృద్ధిపై చాల లోతైన ప్రభావాన్ని నెరుపుతుంది." (మావో రచనలు మొదటి సంపుటి పే. 387–388). విజ్ఞానాభి వృద్ధి యొక్క అంతిమ లక్ష్యం సామాజిక ప్రగతి అనుకొన్నప్పుడు నూతన సమాజ నిర్మాణానికి సామాజిక సత్యాలపై ఆధారపడిన సమాజ విజ్ఞానం ఎంతైనాఅవసరం. అంతేగాకుండా, సామాజిక మార్పు అవసరాల దృష్ట్యా మానవ విజ్ఞాన సమతౌల్యాభివృద్ధి ఎంతైనా అవసరం.

"ఇంతవరకు వచ్చిన తత్వవేత్తలంతా ప్రపంచాన్ని ఏదో ఒక విధంగా పరిశీలించారు, వివరించారు. కాని మనం చేయాల్సింది ఈ ప్రపంచాన్ని మార్చడం" అని కార్ల్ మార్క్స్ భావించినాడు. అయితే ఈ మార్చేపని తత్వశాస్త్రాలదే కాదు, సామాజిక, భౌతిక శాస్త్రాలది కూడా. ఇందులో సామాజిక 'సత్యాన్ని', యథార్థాలను సమగ్రంగా క్రమ పద్ధతిలో వివరించడమే సామాజిక శాస్త్రాల

* నిష్పాక్షికత అనే పదం ఇంగ్లీషులో Objectivity కి సమానంగా వాడబడింది.

లక్ష్యం. అదేవిధంగా సమాజంలో వివిధ అంశాలపై ఉన్న సందిగ్ధ, రూప రాహిత్య, సమస్యాపూరిత సమాచారాన్ని, విజ్ఞానాన్ని శాస్త్రీయంగా, విపులంగా వివరించడమే సామాజిక శాస్త్రాల ధ్యేయం. మావో-సే-టుంగ్ చెప్పినట్లుగా ''అస్పష్టమైన సామాజిక అనుభవాన్ని, స్పష్టంగా, శాస్త్రీయంగా, క్రమపద్ధతిలో వివరించడమే సామాజిక శాస్త్రాల మరియు సామాజిక శాస్త్రజ్ఞుల బాధ్యత.'' అయితే సామాజిక శాస్త్ర విజ్ఞానాభివృద్ధి ప్రకృతి–భౌతికశాస్త్రాల విజ్ఞానం మాదిరిగానే సంఘటితంగా లేక సామాజిక సత్యాలకు భిన్నంగా ప్రతిబింబించడంవల్ల అది సమాజ ప్రగతికి అంతగా ఉపయోగపడకుండాపోయింది. సామాజిక విజ్ఞానం వ్యక్తిగత అనుభవంపైగాక సాధారణమైన సామాజిక అనుభవంపై ఆధారపడి వుండాలి. అప్పుడే అది సామాజిక సత్యాలకు దగ్గరగా ఉండి సమగ్ర విజ్ఞానాభివృద్ధికి దోహదకారి అవుతుంది.

సమాజంలోని వివిధ విషయాలలో స్వతంత్ర, ఆధారిత కారకాలు నిరంతరం ఒకదానిపై నొకటి ప్రభావం చూపెడుతాయి. సామాజిక వాస్తవికత ఈ ప్రభావంపై ఆధారపడి ఉంటుంది. సామాజిక పరిశోధన ఈ వాస్తవికతను విపులీకరించేదిగా ఉండాలి. అందువల్ల, సామాజిక పరిశోధన అంటే ''సామాజిక వాస్తవికతను వివరించుటకు సమాజంలోని వివిధ స్వతంత్ర, ఆధారిత కారకాల మధ్యఉన్న కారణ, కారక ప్రభావ సంబంధాలను అర్థం చేసుకొనుట, అంతేగాకుండా సామాజిక అనుభవాన్ని ఒక క్రమపద్ధతి ప్రకారం విశ్లేషించి సిద్ధాంతీకరించుట.''

మార్క్సిస్ట్ దృక్పథంలో సామాజిక పరిశోధనలోని ''శాస్త్రీయ ఆలోచన అన్నిరకాల చైతన్యంవలె 'ఊహాత్మక సారూప్యత'తో పనిచేస్తుంది, అంటే ముడిసరుకే దాన్ని యథార్థ స్ఫురణంగా, మరియు సిద్ధాంతీకరణ ఆలోచనలోని యథార్థాన్ని పునర్నిర్మించడానికి నిరంతరంచేసే యత్నంగా ఉపయోగపడుతుంది. దీనిలో వైరూప్య సిద్ధాంతం, సారూప్యతను అనేక నిర్ణయ కారకాల సంబంధాల, సంపన్న, సమగ్ర రూపంగా చేయడానికి వాడబడుతుంది.'' దీన్ని ఈ క్రింది పటంద్వారా తెలుసుకొనవచ్చు.




ఇదే విషయాన్ని మావో–సే – టుంగ్ మాటల్లో చెప్పాలంటే సరిఅయిన ఆలోచనలు, సామాజిక ఆచరణనుండి మాత్రమే వస్తాయి. అవి మూడు రకాల సామాజిక ఆచరణలనుండివస్తాయి ఉత్పత్తికోసం పోరాటం, వర్గపోరాటం, శాస్త్రీయ ప్రయోగం. మానవుని సామాజిక జీవితమే అతని ఆలోచనా విధానాన్ని నిర్దేశిస్తుంది. పురోగామి (Advanced) వర్గానికి స్వాభావికమైన సరిఅయిన ఆలోచనలను ప్రజానీకం ఒకసారి గ్రహిస్తే, ఆలోచనలు భౌతిక శక్తిగా మారుతాయి. అవి సమాజాన్ని మారుస్తాయి, ప్రపంచాన్ని మారుస్తాయి; తమ సామాజిక ఆచరణలో మనుషులు వివిధ రకాల పోరాటాలలో నిమగ్నులవుతారు. వారి విజయాలనుండి వైఫల్యాలనుండి రెండింటిద్వారా వారు అమూల్యమైన అనుభవాన్ని సంపాదిస్తారు. తమ పంచేంద్రియాలద్వారా – అంటే కన్ను, ముక్కు, నాలుక, చెవి, చర్మంద్వారా–భౌతిక బాహ్య ప్రపంచం యొక్క అంతర్ దృగ్విషయాలు (Phenomena) మానవుని మెదడులో ప్రతిఫలిస్తాయి. మొదట జ్ఞానం (knowledge) గ్రహించబడుతుంది (perceptual). ఈ గ్రహింపబడిన జ్ఞానం చాలినంత చేకూరినపుడు భావనా(conceptual) జ్ఞానాన్ని, అంటే ఆలోచనలకు ఎగరడం జరుగుతుంది. తెలుసుకొనుటలో ఇది ఒక క్రమం. తెలుసుకొనే మొత్తం క్రమంలో ఇది మొదటి దశ. ఇది భౌతిక పదార్థంనుండి స్వీయచైతన్యానికి, అస్తిత్వంనుండి ఆలోచనలకు దారితీసే దశ. వ్యక్తి చైతన్యం లేక ఆలోచనలు (సిద్ధాంతాలు, విధానాలు, ప్రణాళికలు, చర్యలతో సహా) భౌతిక బాహ్య ప్రపంచ సూత్రాలను సరిగ్గా ప్రతిఫలింపచేస్తాయా లేదా అనేది ఈ దశలో ఇంకా నిరూపించబడదు. అవి సరియైనవో కావో నిర్ధారించుకోవడం ఈ దశలో సాధ్యపడదు. అప్పుడు తెలుసుకొనే క్రమంలో రెండవదశ వస్తుంది, చైతన్యంనుండి మళ్ళీ పదార్థానికి, ఆలోచనలనుండి మళ్ళీ అస్తిత్వానికి దారితీసే దశ ఇదే. సిద్ధాంతాలు, విధానాలు, ప్రణాళికలు లేక చర్యలు ఆశించిన విజయాన్ని ఇస్తాయా లేవా అని నిర్ధారించుకోవడానికి మొదటి దశలో సంపాదించిన విజ్ఞానాన్ని ఈ దశలో 'సామాజిక ఆచరణ'కు పెట్టబడుతుంది. సాధారణంగా, చెప్పాలంటే జయప్రదమైనవి సరి ఆయినవి, విఫలమైనవి సరిఅయినవి కావు. ఈ విధంగా ''పదార్థంనుండి చైతన్యానికి, అక్కడినుండి తిరిగి పదార్థానికి దారితీసే క్రమం–అంటే ఆచరణ నుండి జ్ఞానానికి అచటినుండి తిరిగి ఆచరణకు దారి తీసేక్రమం పదేపదే పలుమార్లు జరిగిన తర్వాతనే తరుచుగా సరిఅయిన ఆలోచనకు రావడం జరుగుతుంది.'' ఇదే గతి తార్కిక భౌతిక వాదజ్ఞాన సిద్ధాంతం. సామాజిక శాస్త్రపరిశోధనలో కూడా వాస్తవాల కనుగుణమైన జ్ఞానాన్ని పెంపొందించాలంటే పై సత్యాన్ని గుర్తుంచుకోవలసిన అవసరం ఎంతో ఉంది.

సామాజిక పరిశోధన కాని, విజ్ఞానాభివృద్ధి కాని ఇతర ఆధారిత కారకాల ప్రమేయం లేకుండా స్వతంత్రంగా అభివృద్ధి చెందవు. కనుక ఇవి రెండూ సామాజిక స్థితిపై ఎంతో ఆధారపడి ఉంటాయి ఆదేవిధంగా సామాజిక శాస్త్రవేత్తలు తమ విజ్ఞాన

సముపార్జనా కృషిలో పరిశోధనా క్రమంలో సామాజిక ప్రభావంవల్ల, ఆ ప్రభావంలోనే ఏర్పడే వ్యక్తిగత విలువల ప్రభావంలో కూడా ఉంటూ వాస్తవాన్ని భిన్నంగా చూపించే అవకాశం కలదు అయితే సామాజిక పరిశోధనలో నిష్పాక్షికత అవసరమనీ, సాధ్యమనీ అప్పుడే పరిశోధన అనేది వాస్తవికతను శాస్త్రీయంగా వివరించగలదనీ ఇక కొక వాదన బయలుదేరింది.

ఈ వ్యాసంలో ముఖ్యంగా సామాజిక శాస్త్రపరిశోధనలో నిష్పాక్షికత అంటే ఏమిటి ? అది ఎంతవరకు సాధ్యమవుతుంది? దాని ప్రాముఖ్యత ఎంతవరకున్నది? స్వీయాత్మకతను తగ్గించి నిష్పాక్షికతను ఏవిధంగా మెరుగుపరచాలి? అను విషయాలను చర్చించడం జరిగింది.

## నిష్పాక్షికత అంటే ఏమిటి?

నిష్పాక్షికత అంటే ఒక విషయాన్ని అర్థం చేసుకోవడంలో గాని, వివరించడంలో గాని, వస్తుగత పరిశీలన, హేతుబద్ధత, నిష్పాక్షిక వైఖరి, విశాల దృక్పథం, నిజాయితీ కలిగి ఉండడం సామాజిక శాస్త్ర పరిశోధనలో సామాజిక వాస్తవికతను అర్థం చేసుకొని వివరించడంలో వ్యక్తిగత అభిప్రాయాలకు, విలువలకు తావుండరాదు. నిష్పాక్షికత అనేది; 'సత్యాన్వేషణకు ఉపయోగపడే ఒకపద్ధతి' అని కూడా చెప్పవచ్చు.

## నిష్పాక్షికత ప్రాముఖ్యత

నిష్పాక్షికతకు ఉండే మంచి లక్షణాలనుబట్టి, ఏ శాస్త్ర పరిశోధనలోనైనా సత్యాన్వేషణలో దీనిని ముఖ్యమైన పద్ధతిగా ఉపయోగించవచ్చు. సామాజిక శాస్త్రాల అభివృద్ధిలో, సమాజంలో మారుతున్న పరిస్థితులకు సామాజిక శాస్త్రాల అచరాణుకూలతను పెంచడంలో, సామాజిక శాస్త్ర పరిశోధనలో నిష్పాక్షిక వైఖరి ప్రముఖ పాత్ర వహిస్తుంది. సామాజిక వాస్తవికతను కుణ్ణంగా పరిశీలించడం ఎంత అవసరమో అదేవిధంగా యథార్థంగా బహిర్గత పరచడం కూడా అంతే అవసరం. సాధారణంగా వాస్తవికత వ్యక్తిగత ఇష్టాయిష్టాలకు భిన్నంగా ఉంటుంది. కాబట్టి దాన్ని వ్యక్తిగత ఇష్టాయిష్టాలకు లోబడకుండా చూపించాలంటే సామాజికశాస్త్ర పరిశోధనలో నిష్పాక్షికత ప్రాముఖ్యత ఎంతో ఉంది. నిష్పాక్షికతలో నిజాలను దాచడానికి ప్రయత్నించకూడదు. ఇక్కడ శాస్త్రవేత్త ఒక 'విడివ్యక్తి'గా కాకుండా ప్రజాజీవితంలో ఒక భాగస్వామిగా అందరి ముందు రావడానికి అవకాశం కలదు. అప్పుడు వ్యక్తి తన పరిశోధనలో నిజాయితీగా స్పష్టతతో ముగింపును నిర్ధారించగలడు అంతేగాకుండా తాను చైతన్య దశలో ఉండి వాస్తవికతను విశదీకరించడానికి ఉపయోగపడకలడు· ఏ పరిశోధనైనా అర్థవంతంగా కొనసాగించడానికి, అభిరుచులను పెంచడానికి, వివరించపోయేది సామాజిక సత్యాలకు దగ్గరగా ఉండేవిధంగా స్పష్టపరుచడానికి, అస్పష్టమైన, అసందర్భమైన ఎన్నో అంశాలలో ఉన్న అనుమానాలను దూరం చేయడానికి నిష్పాక్షికత ఎంతో ఉపయోగపడుతుంది. ఇందులోనుండే హేతుబద్ధత జనించి మనం చేసే పరిశోధనకు శాస్త్రీయ దృక్పథాన్ని కలిగిస్తుంది.

వర్ధమాన దేశాలలోని పరిశోధకులు నిష్పాక్షికతను పాటించడంలో అభివృద్ధిచెందిన దేశాల పరిశోధకులకన్న ఎన్నో సమస్యలను ఎదుర్కొనవలసి రావచ్చు. ఎందుకనగా ఇక్కడి పరిశోధకుడు తాను ఎంపిక చేసుకొన్న సమస్య దగ్గరినుండి, అందుకు కావాల్సిన సమాచారాన్ని సేకరించడం, ఆ తరువాత దాన్ని విశ్లేషించి వివరించడం వరకు అన్ని స్థాయిల్లో కూడా అతడు తన సామాజిక సంబంధాల ప్రభావానికి పరిమితం కావలసి వస్తుంది. కనుక ఏ స్థాయిలోనైనా నిష్పాక్షికత లోపించవచ్చు. అటువంటి పరిస్థితుల్లో పరిశోధకుడు తన తప్పిదాలను కప్పిపుచ్చడానికి వివిధ అంశాల ప్రభావానికిలోనై అసందర్భమైన విజ్ఞానాభివృద్ధికి దోహదకారి అవుతాడు. అయితే పరిశోధకుడు వివిధ అంశాల ప్రభావాలకు లోనైనప్పటికి అతడు తన ఉద్దేశాలను స్పష్టపరిచినప్పుడు తన పరిశోధన విలువ పెరుగుతుంది. దీనిని గుర్తించకపోవడంవల్లనే భారతదేశంలో కొందరు సామాజిక శాస్త్రవేత్తలు ప్రణాళికల వైఫల్యాన్ని, నత్తనడకవలె ఉన్న గ్రామీణాభివృద్ధిని, రాజకీయ నాయకుల, ఉద్యోగుల దోపిడీ మనస్తత్వాన్ని మరియు అసమర్థవంతమైన అవినీతితో గూడిన ఉద్యోగి స్వామ్య ప్రవర్తనను అర్థంచేసుకోలేకపోవడమేగాక దానికి సరియైన కారణాలు తెలుసుకొని బహిరంగ పరచలేకపోతున్నారు. కాబట్టి ఈ విధమైన సామాజిక సమస్యలను సరిగా విశ్లేషించి అర్థంచేసుకోలేకపోవడంవల్ల వాటికి పరిష్కారాలను ఇవ్వడం కూడా అరుదుగా కన్పిస్తున్నవి. ఇలువంటి సందర్భంలో సామాజికశాస్త్ర పరిశోధనలో నిష్పాక్షికత ఆవశ్యకత ఎంతో ఉన్నది. అందువల్ల నిష్పాక్షికత లక్షణాలైన ''శాస్త్రీయ దృక్పథం, అర్థస్పష్టత, సహేతుకత, సంక్షిప్తత, సరళత, సాధారణ అనుభవంనుండి సూత్రీకరణ లేదా సిద్ధాంతీకరించుట, ప్రజాస్వామ్య భావాలు, ధృవీకరణ, మరియు అనువర్తించుట'' మొదలగునవన్నీ సామాజికశాస్త్ర పరిశోధనలో పాటించాల్సిన విషయాలు.

## నిష్పాక్షికత ఎంతవరకు సాధ్యము ?

సామాజికశాస్త్ర పరిశోధనలో నిష్పాక్షికత ఉండాలని చెప్పడమే కాకుండా ఎ తవరకు దాన్ని సాధించవచ్చు అనే విషయాన్ని కూడా కుణ్ణంగా పరిశీలించాలి. నిష్పాక్షికతను సాధించడమనేది, సామాజిక శాస్త్రవేత్త ఎంతవరకు తన 'విలువల చట్రం' **(Value frame work)** ప్రభావంనుండి బయటపడి ఆలోచించగలడనే సమస్యకు ముడిపడి ఉన్నది. అంతేగాకుండా సమాజంలో ఎంతవరకు తటస్థ వైఖరి అవలంబించగలడు? సమాజంలో అసలు వ్యక్తులు సామాజిక సమస్యలపట్ల తటస్థంగా ఉండగలరా? అనే సమస్యలకు— సామాజిక శాస్త్ర పరిశోధనలోని—నిష్పాక్షికత సమస్య ముడిపడి ఉన్నదని చెప్పవచ్చు.

ప్రతివ్యక్తి తన జీవితంలో తనకున్న సామాజిక అనుభవంలో, కొంత సామాజిక చైతన్యాన్ని, ఒక రకమైన ఆలోచనా దృక్పథాన్ని, కొన్ని విలువలు కలిగి ఉంటాడు. ప్రతివ్యక్తి 'సామాజీకరణ ప్రక్రియ'లో వ్యక్తిగత విలువలు సంతరించుకొంటాడు, అవి అతని మేధా సంపదలో ఆలోచన సరళిలో తప్పకుండా భాగమైపోతాయి. ఎప్పుడూ వాటిని సంరక్షించుకోవడానికి ప్రతివ్యక్తి ప్రయత్నిస్తాడు. కాబట్టి సామాజిక శాస్త్ర పరిశోధనలో వ్యక్తి, సత్యాన్ని తాను పరిశోధించిన దానికంటె, తాను నమ్మినదానినే వివరించడానికి ప్రయత్నిస్తాడు. ఒకవ్యక్తి తన విలువలను గురించి స్పష్టంగా ఉంటె, తన పరిశోధనకు సామాజిక లక్ష్యాలను కలిగి ఉన్నట్లు తెలుసుకొని నిష్పాక్షికంగా ఉండాలని ప్రయత్నించవచ్చు. అయితే అతని ఆలోచన—అనుభవం మధ్యఉండే అంతర్గ వైరుధ్యంవల్ల అతను కూడా నిష్పాక్షికంగా ఉండలేకపోతాడు. ప్రకృతి—భౌతిక శాస్త్రాలలోవలె సామాజిక శాస్త్ర పరిశోధనలో సంపూర్ణంగా నిష్పాక్షికతను సాధించడమనేది సులభతరం కాకపోవచ్చు. అదేవిధంగా విలువల తాటస్థ్యం' అనేది సామాజిక శాస్త్ర పరిశోధనలో 'మిధ్య'లాంటిదని చెప్పవచ్చు. ప్రముఖ సామాజిక శాస్త్రవేత్తలైన గున్నార్ మిర్డాల్, మాక్స్‌వెబర్, ఎర్నెస్ట్ నెగెల్ మొదలైనవారు గూడా ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చినారు. సామాజిక పరిశోధనలోని అన్ని ముఖ్యమైన దశల్లో వ్యక్తిగత విలువలు తమ ప్రభావాన్ని చూపెట్టే అవకాశమున్నది అంటే ముఖ్యంగా మూడు దశల్లో — పరిశోధనకు సంబంధించిన సమస్యను ఎన్నుకోవడం, దానికి సంబంధించిన సమాచారాన్ని విశ్లేషించి వివరించడం మరియు ముగింపు వ్రాయడం, నిరంతరం మానవుడి ప్రవర్తన సమాజంలోని వివిధ ప్రక్రియల ప్రభావాలకు లోనవడంవల్ల మానవులు అన్ని విషయాలను 'స్వతంత్రంగా వివరించలేకపోతున్నారు.' అంతేగాక సామాజిక శాస్త్ర పరిశోధనలో ముఖ్యవిషయమేమంటే మానవుడు, మానవుని ప్రవర్తనపైననే పరిశోధన చేయడం. అంటే పరిశోధకుడు, పరిశోధనాంశము ఒకే స్వభావాన్ని కలిగి ఉండడం. అందువల్ల తాను చేసే ప్రక్రియలో తన వ్యక్తిగత విలువలు, తనవల్ల ప్రాబల్యం కనిపించే అవకాశం ఉంది. ఇటువంటి సందర్భంలో కొన్ని నిజాలు మరుగునపడి పరిశోధనలో, రచనలో నిష్పాక్షికత లోపించే ప్రమాదమున్నది.

సాధారణంగా పరిశోధకులనగానే వివిధ సంస్థలలో పనిచేసే విద్యావంతులో లేదా పరిశోధకులో లేదా రచయితలో లేదా ఇందులో ఏ కోవకు చెందిన ఇతర మేధావులనో తీసుకోవడం జరుగుతుంది. అయితే వీరి వీరి పరిశోధనలలో తమ వ్యక్తిగత విలువలే కాకుండా అందుకు బాధ్యులైన ఇతర బాహ్య ప్రభావకారకాల ప్రభావంపడుట కూడా గమనించవచ్చు. అరుణ్‌షోరే చెప్పినట్లుగా, ''మేధావులు ఎక్కడున్నాగాని — పాలకవర్గం వాళ్ళను తమలో కలుపుకొని ప్రత్యేక సౌకర్యాలు, భ్రమలుకల్పించి 'పాలకవర్గ సైద్ధాంతికులు' (Official Ideologists) గా మార్చుకుంటారు. ఈమధ్యకాలంలో మేధావుల పోషణ కేంద్రీకృతమైనందున, దీనిపై ఆధారపడి ఉన్నవారిని వంచించడం సులభమైపోయింది. ఇప్పుడు ఈ పద్ధతి ఎక్కువగా వాడబ- మన్నది.'' ఎ. ఘోష్ ప్రకారం భారతదేశంలో పరిశోధకులు, మేధావులు పరిమితమైన పరిధిలో, పరిమితమైన అవకాశాలతో పనిచేస్తున్నారు. ప్రభుత్వ సంస్థలు తప్ప వేరే సంస్థల సహకారం లేకపోవడంవల్ల మేధావులు పూర్తిగా ప్రభుత్వంపై ఆధారపడాల్సి వచ్చింది. దీనివల్ల వారు ప్రభుత్వాన్ని విమర్శించలేకపోయినారు. అయితే విశ్వ విద్యాలయాల్లో పనిచేస్తున్న విద్యావేత్తల కన్న ప్రాంతీయ కళాశాలల్లో పనిచేస్తున్న ఉపాధ్యాయులు, స్థానిక పాఠశాలల్లోని ఉపాధ్యాయులు తరుచుగా అధికార యంత్రాంగంతో పోరాడడానికి ఆకర్షితులౌతారు. వారి సామాజిక బాధ్యతా నిర్వహణలో తప్పనిసరిగా ప్రభుత్వ వ్యవస్థతో పోరాడాల్సి వస్తుంది. వారికి తెలియకుండానే, కొన్నిసార్లు తెలిసి, వారికున్న ప్రభుత్వ వ్యతిరేకత ద్వారా 'సామాజిక విమర్శకులు'గా 'నూతనసమాజ వైతాళికులు'గా మారుతారు. అంతిమంగా వీరే నిజమైన మేధావులుగా మిగులుతారు. అందువల్ల పాలకవర్గం ఈ ప్రమాదం నుండి తమనుతాము రక్షించుకోవడానికి ఎన్నోఎత్తులు వేస్తుంటుంది. ఇటువంటి దశలో పరిశోధకులు తమ కనుకూలంగా తమ పోషకుల కనుకూలంగా నిజాలను ఎంచుకొని సందర్భానుసారంగా వాటిని వివరిస్తారు. ఈ తరుణంలోనే ఎంతో ముఖ్యమైన 'విషయాల'కు ప్రాధాన్యత ఇవ్వకుండా అప్రధానమైన విషయాలకు ప్రాధాన్యత ఇవ్వవచ్చు. ఇ. హెచ్. కార్ ఉదహరించినట్లు, 'చారిత్రకనిజాలు' చరిత్రకారులు పరీక్షించడానికి ఎంచుకొన్నవి మాత్రమే అన్నట్లు వివరిస్తారు. చాలమంది ప్రజలు, చాలాసార్లు రుబికాన్‌ను దాటవచ్చును కాని, చరిత్రకారులు సీజర్ చక్రవర్తి దాటిన సంఘటనకు మాత్రమే ప్రత్యేక ప్రాముఖ్యాన్ని ఇచ్చారు. మనకు వచ్చిన చారిత్రక నిజాలన్నీ—చరిత్రకారులు ఎంచుకొని తమ సమకాలీన పరిస్థితుల్లో ప్రభావితులై తమ విలువలు కనుగుణంగా వివరించబడ్డవే. అందువల్లనే ఎన్నో అప్రధాన విషయాలకు ప్రాముఖ్యత లభించి విజ్ఞానాభివృద్ధిలో ముఖ్యమైన విషయాలను విస్మరించడం జరిగినది.

భారతదేశంలో కూడా విశ్వవిద్యాలయాలు సరికొత్త అధికార సంస్థలుగా మారినవి. నిరక్షరాస్యత హెచ్చుస్థాయిలో ఉన్న మన దేశంలో విజ్ఞానాన్ని సామాజిక — రాజకీయ నియంత్రణా సాధనంగా, రాజ్యం దాని ప్రాముఖ్యాన్ని గుర్తించింది. కాబట్టి ఉన్నత విద్యా కేంద్రాలు సమాజాన్ని నియంత్రించడానికి అధికార యంత్రాంగంలో చేర్చుకోబడినవి ఇటువంటి సందర్భంలో సామాజిక శాస్త్ర పరిశోధనలో నిష్పాక్షికతకు అవకాశంలేదు. మన దేశం వంటి అభివృద్ధి చెందుతున్న దేశాలలో మేధావులు లేదా పరిశోధకులు స్వతంత్రంగా, ప్రైవేటు లేదా ప్రభుత్వ, ప్రభుత్వ సంబంధిత సంస్థల సహకారం లేకుండా పరిశోధన సాగించడం చాల కష్టతరమైనది. అయితే ప్రభుత్వం, ప్రభుత్వ వ్యవస్థలు కూడా ఒక వైపు తమ అవసరాలను తీర్చుకోవడానికి, మరొకవైపు పరిశోధకులను కనిపెడుతూనే, వారిని స్వతంత్రంగా ఆలోచించడానికి తగిన అవకాశం, సమయం లభించకుండా చేయడానికి ఏదో విధమైన పనిలో నిమగ్నం చేయడానికి ప్రయత్నాలు జరుపుతున్నాయి. ఈమధ్య కాలంలోనే, మన

దేశంలో కూడా సామాజిక శాస్త్ర పరిశోధనను 'సంస్థీకరించుట'కు ప్రయత్నాలు జరిగినట్లు తెలుస్తున్నది. అయితే దీనికి ముఖ్యంగా నాలుగు కారణాలు చెప్పవచ్చు (1) ప్రభుత్వం చేపట్టిన ప్రణాళికలు, ప్రాజెక్టులు విజయవంతం కావాలంటే పెద్ద మొత్తంలో సమాచారం, విజ్ఞానం అవసరం. కాబట్టి పెద్దమొత్తంలో రాష్ట్ర స్థాయిలో, జాతీయ స్థాయిలో విద్యావేత్తలను సామాజిక పరిశోధనలో చేర్చుకున్నారు. (2) ఉద్యోగి స్వామ్యంలోని ఉన్నత అధికారులకు - రక్షణ, పోలీస్ శాఖలు మరియు ఇతరశాఖలలో పనిచేస్తున్న సీనియర్ అధికారులకు — శిక్షణ మరియు వ్యవస్థలో ఆధునిక శాస్త్రీయ పద్ధతుల ద్వారా మానవ ప్రవర్తనను తెలుసుకోవడం అవసరం. వీరికి ఉన్నత స్థాయిలో శిక్షణ ఇవ్వడానికి విద్యావేత్తలు అవసరం. (3) ప్రభుత్వం చేపట్టే పరిశోధనా కార్యక్రమాలకు సామాజిక శాస్త్రవేత్తలు అవసరం. (4) ప్రభుత్వానికి బయట నుండి ఉన్న ప్రమాదాన్ని నివారించడానికి ప్రభుత్వమే సామాజిక శాస్త్ర పరిశోధన చేపట్టాల్సి వచ్చింది. పై విశ్లేషణనుబట్టి విశ్వ విద్యాలయాలలోని విద్యావేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు వాళ్ళున్న పరిస్థితుల్లో, (నిర్మాణపరమైన) వాళ్ళు 'సామాజిక విమర్శకులు'గా నిజమైన మేధావులుగా వ్యవహరించలేకపోతున్నారు.

ఇంతవరకు ఆధునిక సామాజికశాస్త్రాల అభివృద్ధి పాశ్చాత్య దేశాలలోనే ఎక్కువగా జరిగింది. ఇప్పుడు అభివృద్ధి చెందుతున్న దేశాలు, పాశ్చాత్యదేశాలలో అభివృద్ధి చేయబడిన సామాజిక సిద్ధాంతాలను, నమూనాలను ఉన్నదున్నట్లు దిగుమతి చేసుకొని అనుసరించడంవల్ల తమ సమస్యలను పరిష్కరించుకోలేకపోయినవి. ఉదాహరణకు మనం పాశ్చాత్య దేశాలలో అభివృద్ధి చెందిన ఆర్థిక సిద్ధాంతాలన్నీ పరిశీలిస్తే — ఆడమ్ స్మిత్ నుండి జాన్ మేనార్డ్ కీన్స్ వరకు అతని తరువాత కూడా — అన్నీ పెట్టుబడిదారీ వ్యవస్థ దాని విలువలచే ప్రభావితమైనటువంటివే. అదేవిధంగా అభివృద్ధి చెందిన దేశాలలో అభివృద్ధి చెందిన ఇతర సామాజిక సిద్ధాంతాలన్నీ కూడా పెట్టుబడిదారీ 'విలువల చట్రాన్ని' ఆధారంగా చేసుకొని నిర్మింపబడ్డవే. మార్క్సిస్ట్ దృక్పథం ప్రకారం, వర్గ సమాజంలో సామాజిక పరిశోధనద్వారా నిర్మించబడే సామాజిక సిద్ధాంతాలన్నీ ఏదైనా ఒక వర్గ ప్రయోజనాలకే తోడ్పడేవిగా ఉంటాయి. సాధారణంగా సమాజ బౌద్ధిక జీవితం పాలకవర్గ భావ జాలం అధికారంలో ఉంటుంది. ''ప్రతియుగంలోను పాలక వర్గ భావాలు, అధికార భావాలు అంటే సమాజ భౌతిక శక్తిని పాలించే వర్గం సమాజ బౌద్ధిక శక్తిని కూడా పాలిస్తుంది. భౌతిక ఉత్పత్తి సాధనాలను

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
(స్థాపితం. 1908)
గాంధీనగరం, విజయవాడ - 3
ఇంట్లో అందరికీ ఆనందాన్ని ఇచ్చే శీర్షికలు! కథలు!! బొమ్మలు!!!
★ సాహిత్య విలువలున్న సీరియల్ కథలు
★ వైవిధ్యం వున్న కథానికలు
★ అన్ని తరాలవారినీ అలరించే "ప్రశ్నావళి" "ధర్మపథం" కార్టూన్‌లు మొదలైన వాటితో ఏవారానికి ఆ వారమే కొత్తదనాన్ని పుణికిపుచ్చుకుని మీకు అందుతుంది!
విడి ప్రతి వెల 90 పైసలు
సంవత్సర చందా (పోస్టుద్వారా) రు. 49-40 పై.
ఆరు మాసాలకు రు. 24-70 పై.
మీ స్థానిక ఏజంటుద్వారా తెప్పించుకుంటే ప్రతీవారం తెల్లారేసరికల్లా మీముందు వుంటుంది
రచనలు పంపే చిరునామా!
ఎడిటర్, ఆంధ్ర సచిత్ర వారపత్రిక
గాంధీనగరం, విజయవాడ 3.
ఇతర వివరాలకు:
మేనేజరు, ఆంధ్రపత్రిక
గాంధీనగరం, విజయవాడ-3.

కూడా ఆధీనంలో ఉంచుకొంటుంది. కాబట్టి సాధారణంగా బౌద్ధిక ఉత్పత్తి సాధనాలమీద అధికారం లేనివాళ్ళ భావాలు అధికార వర్గం ఆధీనంలో ఉంటాయి. అధికార భావాలు ప్రజల భౌతిక సంబంధాల భావ రూప వ్యక్తీకరణ తప్ప మరేమి కాదు.'' కాబట్టి వర్గ సమాజాలలో సామాజిక శాస్త్రవేత్తలు, మేధావులు కూడా ఏదో వర్గానికి ప్రాతినిధ్యం వహించేవారుగా ఉంటారు. కాబట్టి వర్గసమాజంలోని సామాజిక శాస్త్రవేత్తలు నిష్పాక్షికంగా వ్యవహరించడం అరుదుగా కనిపిస్తుంది.

దీనినిబట్టి సామాజిక శాస్త్రవేత్తలు నిష్పాక్షికత పేరుతో తమ వ్యక్తిగత విలువలను, తమ సిద్ధాంతాలలో, నమూనాలలో ఇతర రచనలలో ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తారు. దీనివల్ల సామాజిక వాస్తవికతను అసంపూర్ణంగా వివరించడం అసలు విషయం తేల్చకుండా పక్కదార్లు పట్టించడంవంటి పరిస్థితులు ఏర్పడవచ్చు. ప్రతి సామాజిక పరిశోధనకు ఏదో ఒక ఆశయముంటుంది. కనుక తన పరిశోధనకు ఆశయాన్ని నిర్ధారించుకోవడమంటే ఆ పరిశోధనకు పరిమిత దృక్పథం ఉన్నట్లు భావించవచ్చు. అయితే సామాజిక శాస్త్రవేత్త తనపరిశోధనలలో నిష్పాక్షికత సాధించాలంటే సమాజంలోని ప్రస్తుత వర్గ నిర్మాణాన్ని లేదా అందులోని వ్యవస్థలను కాని, అందులో ఉండే అంతరాలను ప్రశ్నించాల్సిన అవసరం కలుగుతుంది. అయితే ఇక్కడ — 'నిష్పాక్షికత', శాస్త్రవేత్త తన ఉనికికి కూడా ప్రమాదమయే ఆలోచనలు చేయడానికి ఎంతవరకు ఇష్టపడుతాడు? అనే దానిపై ఆధారపడి ఉంటుంది. 'యథార్థాన్ని' యథార్థంగా బహిరంగపరచడమనేది సామాన్యంగా అధికార వర్గాలకు రుచించదు, గనుక పరిశోదకుడు దానిని బహిరంగ పరచడానికి సిద్ధపడి నిష్పాక్షికంగా వ్యవహరించాలంటే అతడు తప్పనిసరిగా ''రెబెల్''గా వ్యవహరించాల్సి వస్తుంది. 'మార్పు'ను ఆహ్వానించాల్సి ఉంటుంది. పాల్ ఫ్రీయర్ భావించినట్లుగా ''మార్పుకు భయపడే పరిశోధకుడు, శాస్త్రీయ నిష్పాక్షికత పేరుతో యథార్థతను మరుగు పరిచి పక్కదార్లు పట్టిస్తాడు. జీవం తొణికిసలాడే విషయాన్ని మృతప్రాయమైనదిగా చిత్రిస్తాడు. అతడు మార్పుతో జీవతత్వాన్ని, భవిష్యత్తును చూడడు, మార్పులో క్షీణతను, మృత్యువును మాత్రమే చూస్తాడు. అతడు మార్పును గురించి అధ్యయనం చేయగోరడం కేవలం దాన్ని నిరోధించడానికే కాని ఉత్తేజపరిచేందుకూ, తీవ్రతరం చేసేందుకూ మాత్రంకాదు. ఏది ఏమైనప్పటికి, మార్పును మృతప్రాయతకు చిహ్నంగా పరిగణిస్తూ, సరళతలేని నమూనాలను నిర్మించేందుకు మానవులను తన పరిశోధనలో నిష్క్రియా వస్తువులుగా పరిగణిస్తాడు. ఆ విధంగా అతడు జీవచైతన్యానికి నాశనకారియై తనను తాను వంచన చేసుకుంటాడు. అయితే యథార్థాలను బహిరంగపరిచి మార్పు నాహ్వానించే పరిశోధకుడు అందు కాటంకపరిచే శక్తులతో పోరాడడానికి సన్నద్ధమైనపుడే తన పరిశోధనలో శాస్త్రీయ నిష్పాక్షికతను నిరంతరంగా పాటించ గల్గుతాడు.

అయితే అందరు పరిశోధకులు 'రెబెల్'గా మారటం సాధ్యం కాదు. గనుక, మారుతారని భావించడం కూడా సరియైనదికాదు. గనుక, వారి వారి పరిశోధనలలో పాక్షికత వివిధ స్థాయిల్లో ఉంటుంది. అటువంటప్పుడు ప్రస్తుత పరిశోధనలలో నిష్పాక్షికతను మెరుగు పరచాలంటే, ముఖ్యంగా వ్యక్తిగత అభిమానాలు, ఆత్మాశ్రయతను తగ్గించాలంటే పరిశోధకుడు కనీసం తనకు తాను స్పష్టంగా ఉండడానికి ప్రయత్నిస్తే కొంతవరకు తన ధర్మాన్ని నిర్వర్తించాడని అనవచ్చు.

## నిష్పాక్షికతను మెరుగుపరచడానికి సూచనలు

(1) గున్నార్ మిర్డాల్ ప్రకారం, సామాజికశాస్త్ర పరిశోధనలో ఆత్మాశ్రయతను తగ్గించాలంటే పరిశోధకునికి, పరిశోధనల్లోతన విలువల ప్రభావంపై నిరంతరం నియంత్రణ అవసరం. అయితే ఇది సర్వత్రా జరుగదు కనుక పరిశోధకుడు తన వ్యక్తిగత విలువలను పరిశోధనలో మొదటే తెలియపరుచుట మంచిది.

(2) పరిశోధకుని సామాజిక-ఆర్థిక పూర్వరంగం తెలుసుకోవడంవల్ల కూడా అతని ఆలోచనా విధానం, విలువలు కొంతవరకు తెలుసుకొనవచ్చు. వ్యక్తిగత విలువలు సమాజంలో అతనికున్న స్థానం అతని చైతన్యంపై ఆధారపడి ఉంటాయి.

(3) సామాజిక శాస్త్ర పరిశోధనలో, ప్రకృతి — భౌతిక శాస్త్రాలలో ఉపయోగించే యాంత్రిక పరిశోధనా పద్ధతులు అంతగా ఉపకరించవు పైగా ఇవి మానవీయ సంబంధాలను అంచనా వేయడంలో యాంత్రికతను ప్రోత్సహిస్తాయి. కాబట్టి ఈ పద్ధతుల ద్వారా గుణాత్మక సమాచారాన్ని విశ్లేషించడం కష్టమైన పని.

(4) సామాజిక శాస్త్రవేత్త 'ద్వంద వ్యక్తిత్వము' కలిగి ఉండరాదు అంటే వీలైనంతవరకు దాన్ని తగ్గించడానికి ప్రయత్నించాలి. అంతేగాకుండా సామాజిక శాస్త్రవేత్త పరిశోధనలో మరియు జీవితంలో నిరంతరం అవసరమైతే ఉన్న విలువలు ప్రశ్నించి, నిరాకరించి, భౌతిక పరిస్థితులు సృష్టించే 'నూతన విలువలు' స్వీకరించడానికి సిద్ధమై ఉండాలి.

(5) సామాజిక శాస్త్రపరిశోధనలో 'కృత్రిమమైన పద్ధతులు (Methodological Sophestication), 'సున్నితమైన విశ్లేషణ' (Refined Analysis) కన్న 'సాధారణ-సమగ్ర సామాజిక అనుభవానికి' ఎక్కువ ప్రాముఖ్యతను ఇవ్వాలి.

(6) సామాజిక శాస్త్ర పరిశోధనలో, 'ప్రత్యామ్నాయ విలువలు' సృష్టించడం ఎంతైనా అవసరం. అవి అభివృద్ధి చెందుతున్న దేశాలలో సామాజిక శాస్త్రపరిశోధనావశ్యకత మరియు సామాజిక మార్పులో వాటి పాత్ర మొదలగు విషయాలపై ఆధారపడి ఉండాలి.

## ముగింపు

సామాజిక శాస్త్రపరిశోధనలో నిష్పాక్షికత అనే భావనను నిజమైన సామాజిక పునాదులపై పునఃపరీక్షించడం ఎంతైనా అవసరం. సామాజిక శాస్త్ర పరిశోధనలో సంపూర్ణమైన నిష్పాక్షికత ఉండడమనేది కానీ, సాధించడమనేది కానీ కష్టతరమని భావించినపుడు నిష్పాక్షికతను మెరుగుపరచడానికి లేదా స్వీయాత్మకతను తగ్గించడానికి కొన్ని చర్యలు గైకొనవచ్చు. అయితే అంతిమంగా సామాజిక శాస్త్రాల పరిశోధనలో నిష్పాక్షికతను సాధించడమనేది, ఎంతవరకు సామాజిక శాస్త్రవేత్త, సమాజంలోని వివిధ అధికార, వర్గసంస్థలను ధైర్యంగా, బహిరంగంగా ప్రశ్నించి విశ్లేషించగలడు? అంతేగాకుండా శాస్త్రవేత్త మారుతున్న కాలాల్లో ఎంతవరకు సామాజిక బాధ్యత వహించగలడు? అనే విషయాలపై ఆధారపడి ఉంటుందని చెప్పవచ్చు.

## సంప్రదింపురచనలు


### BOOKS

| | |
|---|---|
| (1) Objectivity in Social Science Research | Gunnar Myrdal |
| (2) The Methodology of Social Sciences | Max Weber |
| (3) 'Asian Drama' Vol.I (An enquiry into the poverty of Nations) | Gunnar Myrdal |
| (4) Objectivity in Social Sciences-Max Weber | in 'Readings in Philosophy of Social Sciences' Ed. May Broad Beck |
| (5) The value oriented Bias in Social enquiry-Ernest Negel | ,, |
| (6) Scientific Social Surveys | Pauline-V - Yang. |
| (7) Methodology and Techniques of Social Research | Wilkinson and Bhandarkar |
| (8) Selections from Prison Note Books | Antonio Gramsci |
| (9) What is History ? | E. H. CARR |
| (10) Padagogy of the opressed | Paul Freory |
| (11) Ventures in Policy Sciences | Yazkel Dror |
| (12) 'Behind Poverty' The Social formation in a Tamil village | Garan Djurfeldt and Staffan Lind Berg. |
| (13) Science in History Vol. IV Social Sciences | J. D. Bernal |
| (14) Methodology of Social Science Research in India | Ed Sugata Das Gupta |
| (15) మావో రచనలు మొదటి సంపుటి (తెలుగు) | క్రాంతి ప్రచురణలు |

### Journals and Articles

| | |
|---|---|
| (1) Ethics of critical Social Sciences-Mihilo Markevic | ICSSR News Letter |
| (2) The Role of Social Sciences—Dr. S. C. Dube | ICSSR News Letter |
| (3) Objectivity in Social Science Research (An unpublished paper in English) | Dr. G. HARA-GOPAL and Mrs. M. VanaMala |
| (4) The Quest for Indian Intellectuals Economic and Political weekly Vol. 13 No 38 23 September 1978 | A. Ghosh |
| (5) Indian Intellectuals | Seminar No 22 February 1978 |
| (6) Intellectuals and the Interegnum | Arun Shourie July 1977 |
| (7) కార్మికులు–మేధావులు | త్రిపురనేని మధుసూదన రావు, సృజన, మే, 1979 |
| (8) సరియైన ఆలోచనలు ఎక్కడి నుండి వస్తాయి. (తెలుగు అనువాదం) | మావో – సే టుంగ్ సృజన, అక్టోబర్, 1973. |

# అసహనం

ఈ నిశ్శబ్దాన్ని నేను భరించలేను.
ఒక మాట పగిలి
రెండో మాట జన్మించేలోపల మిగిలే నిశ్శబ్దాన్నిగూడా
భరించలేను,
ఆ పాదాలటు కదలిపోయి మరో రెండు పాదాలు వచ్చేలోపల
వీధి మలుపులో రాజ్యంచేసే నిశ్శబ్దాన్ని సహించలేను.
ఒక దీపపు కాంతికీ మరో దీపపు కాంతికీ మధ్య
దృశ్యాదృశ్యంగా కొట్టుకుంటున్న నిశ్శబ్దాన్ని చూశ్ళేను
కంటినుంచి ఒక చూపుదిగి ఒక దృశ్యంవైపు వెదుతుండగా
రెండోచూపు దిగేలోపల మిగిలే శూన్య నిశ్శబ్దాన్ని
భరించలేను.
రెండు రెప్పలమధ్య మిగిలిన గుహల నిశ్శబ్దాన్ని
రెండు పెదవులమధ్య చచ్చిన శవ నిశ్శబ్దాన్ని
రెండు చెవులమధ్య హాయిగా పక్కవేసుకు పడుకున్న
నిద్ర నిశ్శబ్దాన్ని నే సహించలేను
ఒక కెరటం పండి ఒడ్డున చేరేలోపల
రెండో కెరటం పుట్టబోయేముందు సముద్రం కడుపులో
మిగిలిన రాయి నిశ్శబ్దాన్ని భరించలేను
ఒకడు పిలిచి రెండోవాడు పలికేలోపల గడ్డకట్టు నిశ్శబ్దాన్ని
రైలటుపోయి రైలిటు వచ్చేలోపల గడ్డకట్టు నిశ్శబ్దాన్ని
సాగిపోయే నదిలో పుట్టిగిట్టే అలలమధ్య మిగిలిన
ఆత్మహత్యల నిశ్శబ్దాన్ని భరించలేను
నిశ్శబ్దాన్ని నిశ్శబ్దమే భరించగలదు
నేను శబ్దాన్ని
లోనకాన దిగి మట్టిపెళ్ళను విరుస్తున్న
పలుగుచేసే క్రియాత్మక శబ్దాన్ని
భూమిని బద్దలుచేస్తూ సాగిపోయే
నాగలి క్రరుచేసే మోహనరూప శబ్దాన్ని
తొలకరి భూమ్మీదపడ్డ తొలికారు వానచినుకు
మధురఫల శబ్దాన్ని —
కష్టించే చేతుల్లో పుట్టిపెరిగే
దేశమంత సౌభాగ్య సౌందర్య శబ్దాన్ని.

# చైనా గోడలాంటి పుస్తకాల ముందు

చైనా గోడలాంటి
పుస్తకాలముందు నుంచున్నా —
రైలు సాగిపోతుంది
నది పాదిగి పిల్లల్ని చేస్తుంది
ఆకాశాన్ని రెక్కల్లో కూర్చుకున్న పక్షి
నా కనురెప్పలకింద చేరిపోతుంది —
పుస్తకం అంటే
వేల వేల జనం చేతుల్లో పుష్పిస్తున్న కర్మాగారం —
గుండెలకాన దిగిన దమ్ము నాగలి స్మృతి
పండి బరువెక్కి వంగిన వరికంకి —
కర్రకూడా
రకరకాల పద్యాలుగా బతికి
బయటపడి బట్టకడుతుంది —
ముందురోలరు నడచి పోతుంటే
వెనకాల కావ్యం రూపుదిద్దుకుంటుంది —
చదువురాని
మాలకొండాయ్ చేతుల్నిండా పాటలే
తెల్లారగట్ట చలిలో పేడకళ్ళు తీస్తున్న
పదేళ్ళ యాకోబు కళ్ళనిండా పుస్తకాలే —
అజ్ఞాతంగా అనామకంగా చనిపోయిన
మా అమ్మ పెద్ద పుస్తకం —
తెరచివుంచిన పుస్తకం చెరువు
చిగురించే కూనిరాగం కాలువ —
చైనా గోడలాంటి పుస్తకాలముందు నుంచున్నప్పుడు
రాయిలాంటి గీతమేదో లోలోపల ఎదుగుతుంది

శ్రీ కె. శివారెడ్డి

డాక్టర్ ఎన్. గోపి

# వేమన పద్యాల ప్రతులు-పరిష్కరణ

## వేమన పద్యాలు : వేరు వేరు ప్రతులు

వేమన పద్యాల ప్రతులనుగూర్చి ముచ్చటించేటప్పుడు ఆంధ్ర వాఙ్మయోద్ధారకుడూ, మహనీయుడూ అయిన సి. పి. బ్రౌన్‌కు చేయెత్తి నమస్కరించక తప్పదు. తాళపత్ర ప్రతులను సేకరించి, వాటికి కాపీలు వ్రాయించి, పాఠభేదాలను పోల్చిచూచి, శుద్ధ పాఠాలను నిర్ణయించడం ద్వారా ఆయన చేసిన కృషి అనితర సామాన్యమైనది.

వేమన పద్య సంపుటాల ప్రతులు మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో 54 దాకా ఉన్నాయి.[1] వాటిలో 38 తాళపత్ర ప్రతులు 16 కాగితపు ప్రతులు. ఈ 38 తాళపత్ర ప్రతుల్లో దాదాపు అన్నీ బ్రౌన్ సేకరించినవే.[2] ఇవికాక తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో 5 ప్రతులు, కాకినాడ సాహిత్య పరిషత్తులో 7 ప్రతులూ ఉన్నాయి.

## తాళపత్ర ప్రతులు

### బ్రౌన్ ప్రతులు

| క్రమసంఖ్య | లైబ్రరీలోని డి. నెంబరు | పద్యసంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 1 | డి. 1728 | 878 | ''వాదిండ్ల గోపాలయ వ్రాసుకున్న వేమా రెడ్డి పద్యాలు.'' | |
| 2 | డి. 1729 | 1009 | ''వేమన్నగారి పద్యాల'' ప్రతి. | |
| 3 | డి. 1730 | 557 | బెజవాడ వర్ణన పద్య ప్రతి. | లేఖకుడు గ్రంథాదిని బెజవాడ పురవర్ణన చేశాడు. |
| 4 | డి. 1731 | 246 | | 1730 నెంబరు గల ప్రతి, ఇదీ ఒకే ప్రతిలోని భాగాలుగా ఉన్నాయి. |
| 5 | డి. 1732 | 790[3] | ''కొణిదెన కోమటి పుస్తకం'' ప్రతి. | చాల శిథిలమైన ప్రతి. |
| 6 | డి. 1733 | 785 | ''రంగారావు పంపిన బిచా బసప్పకర లిఖిత ప్రతి'' వేమన్న చిన్న పద్యాలు. | చాలా వరకు చెదల పాలయిన ప్రతి. ఇది తప్పుల తడక. |
| 7 | 1734 | 293 | ''మాజేటి సర్వేశలింగం ఖాసా దస్తూరిని వ్రాసుకున్న వేమయ పద్యముల ప్రతి'' | వయస్సు ''తారణ సం॥ మార్గశిర శు॥ 15 ఆదివారం నాటికి రాసిన తారీఖు.'' |
| 8 | డి. 1738 | 123 | ''వేమయ దేవర నీతి శతక'' ప్రతి (జ్ఞానం) | ఈ ప్రతితో 'గరుడాచల విలాసము'ను యక్షగానం, రామ కీర్తనాదులు కూడ కలిపి ఉన్నాయి. |
| 9 | 1739 | 354 | ''దరిశి అగ్రహారం కాపురస్తులయిన దరిశి కృష్ణయ్య వేమన శతకం ప్రొస్తుకం.'' | |
| 10 | 1740 | 459 | బ్రౌన్ తిరస్కరించిన ప్రతి. | ''చూడవలసిన నిమిత్తం లేద''ని బ్రౌన్ దీనిని విడిచిపుచ్చాడు (ఎందుకో ?) |

| క్రమసంఖ్య | లైబ్రరీలోని డి. నెంబరు | పద్యసంఖ్య | ప్ర తి పే రు | రి మా ర్కు లు |
|---|---|---|---|---|
| 11 | 1741 | 189 | "కోదండ రామయ తెచ్చిన" ప్రతి. | |
| 12 | 1742 | 498 | "గోపాలుని శేషయ వేమన పద్య పంచ శతకము" ప్రతి. | |
| 13 | 1743 | 108[4] | | |
| 14 | 1744 | 1083 | "వేమయ పద్యములు." | |
| 15 | 1745 | 308 | "మాజేటి సర్వేశలింగం రాసుకున్న" ప్రతి. | 1734 ప్రతి కిది మాతృక. ఇది రాసిన 6 రోజులకే అది రాయబడింది. |
| 16 | డి. 1746 | 605 | | |
| 17 | 1747 | 194 | వేమన్న శతకం (రెడ్డివారి పద్యములు)· | |
| 18 | 1748 | 300 | గూడూరు ప్రతి. | "ఇవి భట్టిప్రోలు వెంకట్రాయుడు రాసినవి. అనగా సర్వేపల్లి తాలూకాలో చేరి గూడూరులో ఉండే తహస్సీలుదారు బడి చదువుల అయ్యవారు రాసినది." |
| 19 | 1749 | 380 | | |
| 20 | 1750 | 608 | దళిన్ సుబ్బయ్య వేమన శతకం. | |
| 21 | 1751 | 309 | వేమయ శతకం. | |
| 22 | 1752 | 559 | వేమన పుస్తకం. | |
| 23 | 1753 | 503 | వేమన శతకం. | |
| 24 | 1754 | 152 | వేమన శతకం. | |
| 25 | 1755 | 323 | ఠాంగోలు సుబ్బయ్య గ్రంథం. | ఏప్రిల్ 1833లో బ్రౌన్ కందింది. |
| 26 | 1756 | 112 | మామిళ్ల దొరువు ప్రతి. | "నెల్లూరు జిల్లాలో చేరిన మామిళ్ల దొరువులో బ్రాహ్మణుడికీ తావున దొరికిన పుస్తకం." |
| 27 | డి 1757 | 200 | | |
| 28 | 1758 | 182 | "గణపవరపు ప్రతి." | |
| 29 | 1759 | 149 | | |
| 30 | 1760 | 196 | | అత్యంత శిథిలం. |
| 31 | 1761 | 600 | | "డి. 1760 ప్రతితో కలిసి ఉంది." |
| 32 | 1763 | 401 | "యద్దనపూడి చిన్నంరాజు వ్రాసిన ప్రతి." | "మడతున్ చల్మయ్య కొమారుడు సర్వేశలింగానికి యద్దనపూడి చిన్నము రాజు శ్రీకృష్ణార్పణంగాను వేమన శతకనాల్గు వొందల వఖ పద్య సంపూర్ణాన్నాను వ్రాసి యిచ్చెను." |
| 33 | 1764 | 93 | | |
| 34 | 1765 | 309[5] | | ఈ ప్రతిలో కొన్ని ఆకులు కనిపించడం లేదు. |

| క్రమసంఖ్య | లైబ్రరీలోని డి. నెంబరు | పద్య సంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 35 | 1766 | 501 | | |
| 36 | ,767 | 320 | వికారం అనే గ్రంథం. | |
| 37 | 1768 | 91 | | |
| 38 | 1770 | 557 | | |
| 39 | 1771 | 152 | | |
| 40 | 1772 | 505 | 'వేమన చెరిత్ర' ప్రతి. | చరిత్రలేదు; వేమన్న పద్యాలే. |
| 41 | 1881 | 446 | అలభ్యం. | |
| 42 | 8832 | 702 | అలభ్యం. | |
| 43 | 2949 | 997 | సూర్యనారాయణ ప్రతి. | "కందు మహంత్తి వెంకయ్య వ్రాలు" |
| 44 | 2950 | 1000 | పులిచెరి ప్రతి. | "పులిచెరిలో మాజేటి సర్వేశలింగం వ్రాశినది." |
| 45 | 2984 | 110 | వేమయ పద్యాలు. | |
| 46 | 1830 | 1000 | | |
| 47 | 1831 | 446 | | |
| 48 | 1833 | 702 | | |

## తంజావూరు ప్రతులు

| క్రమసంఖ్య | లైబ్రరీలోని నెంబరు | పద్య సంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 1 | ఎమ్. 406 | 340 | వెమంన్న కవి పద్యాల ప్రతి. | తెలుగు లిపి ఆకులు –23 అపూతిన్ సీతా రామస్వామీ సహాయం కరశృత మపరాధం. క్షంతు మహంత్తి సంత్తః శ్రీశ్రీశ్రీ. |
| 2 | ఎమ్. 407 | 170 | | అత్యంత శిధిల ప్రతి. |
| 3 | ఎమ్. 408 | 300 | | 'గజేంద్ర మోక్షం' అనే వచన ప్రతితో కలిసి ఉంది. |
| 4 | ఎమ్. 457 | 215[7] | | ఇందలి పద్యాల్లోని మకుటం 'విశ్వతాభిరామ వినరి వేమ.' |
| 5 | ఎమ్. 35 | 70 | వేమన కృత వైరాగ్య కథనవ్ ప్రతి. | కాగితపు ప్రతి. దేవనాగరి లిపిలో ఉంది. |

## కాకినాడ ప్రతులు

| క్రమ సంఖ్య | లైబ్రరీలోని నెంబరు | పద్య సంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 1 | 185/9 | 271 (72 ఆకులు) | వేమన పద్యాల చిన్న సైజు ప్రతి. | చాలా పాతది. వ్రాత చక్కనిది. 'విరక్త పద్యాలు, వేమయగారు చెప్పిన లోకనీతి' అని రెండు విభాగాలు చేయబడి వ్రాయబడ్డాయి. విభాగాలుచేసి వ్రాయడం తాళపత్ర ప్రతుల్లో అపూర్వం. |
| 2 | 14/9 | 260 | | అత్యంత శిథిల ప్రతి చెదలుతిన్న అక్షరాల చోట రంధ్రాలు ఉన్నాయి మిగిలి ఉన్న అక్షరాలు వెలిసిపోయాయి. |
| 3 | 75/9 | 123 (పొడవైన 14 ఆకులు) | | తప్పుల తడక. |
| 4 | 29/7 | 195 (22 ఆకులు) | | చివరి ఆకులు పోయి ఉంటాయి. పద్యాలు ముగియలేదు. చక్కటి వ్రాత. |
| 5 | 191/9 | 513 (147 ఆకులు) | | ప్రత్యేకత ఏమీలేదు. |
| 6 | 172/9 | 1106 | | ప్రథమ, ద్వితీయ భాగాలుగా విభజింపబడింది కాని విషయ విభజన కాదు. ''ఇది రాశివది కిష్నుడు విక్రమ సం॥...'' శిథిలం తప్పులతడక. |
| 7 | 198/3 | 1179 | | |

## కాగితపు ప్రతులు (Paper Manuscripts)

## బ్రౌన్ వ్రాయించినవి

| క్రమ సంఖ్య | లైబ్రరీ డి. నెంబరు | పద్య సంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 1 | 1721 | 1165 | 1842 నాటి ప్రతి. | 4 భాగాలుగా విభజింపబడినది. చివర పద్యముల అకారాది క్రమసూచిక ఉంది. |
| 2 | 1722 | 1165 | 1842 నాటి కొత్త ప్రతి. | 4 భాగాలుగా విభజింపబడింది. చివర అకారాది క్రమసూచిక ఉంది. |
| 3 | 1723 | 1116 | బెండమూరి లంక ప్రతి. | అంటె బెండమూరి లంక ప్రతికిది పాత్రిక. అకారాది క్రమసూచిక ఉంది. |
| 4 | 1724 | 306 | Q యొక్క పుత్రిక. | వర్ణక్రమ సూచిక ఉంది |
| 5 | 1725 | 869 | | దిస్ ట్రాన్స్‌క్రయిబ్డ్ ఫ్రమ్ టి. టి. 361 బీయింగ్ ది మాన్యుస్క్రిప్ట్ రిఫర్డ్ టు యాన్ లెటర్ (సి). |

| క్రమ సంఖ్య | లైబ్రరీ డి- నెంబరు | పద్య సంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 6 | 1726 | 686 | 1842 నాటిదే మరో ప్రతి. | |
| 7 | 1727 | 675 | | ఈ ప్రతితో మరి రెండు ఇతర గ్రంథాలు కలిసిఉన్నవి. |
| 8 | 1735 | 1116 | బెండమూరి లంక ప్రతి· | బెండమూరి లంక ప్రతి కిది పుత్రిక, 1839 ప్రాంతంవరిలో పెనుగొండ నుంచి వ్రాయించి తెప్పించింది. |
| 9 | 1736 | 252 | | ఈ ప్రతితోపాటు చౌడప్ప శతకముతో పాటు మరి కొన్ని గ్రంథాలు ఉన్నాయి. |
| 10 | 1737 | 1164 | | అకారాది క్రమ సూచిక ఉంది. 4 ప్రకరణాలుగా విభజింపబడింది. |
| 11 | 1762 | 1154 | 1842నాటిదే మరో కొత్త ప్రతి. | |
| 12 | 1769 | 936 | | |
| 13 | 1770 | 919 | | 1, 3, 11 భాగవత స్కందాలలో కూడ ఉంది. |
| 14 | 1773 | 3238 | బ్రౌన్ ఆంగ్లానువాద గ్రంథం. | ఇది ఐదు సంపుటాలుగా ఏర్పడింది. ఇందులో ఒక సంపుటం లాటిన్‌లోనికి అనువదింపబడినది. |
| 15 | 1774 | 1300 | మరో ఆంగ్లానువాద గ్రంథము | ఇంప్రువ్‌డ్ ఎడిషన్. |
| 16 | 1833 | (?) | | |

బ్రౌన్ తాను సేకరించిన 38 తాళపత్ర ప్రతులలోని పద్యాలన్నింటిని చక్కని వ్రాతగాండ్లచేత కాగితాలమీద కాపీ చేయించి భద్రపరిచాడు. ఆ విధంగా ఏర్పడినవే పై 16 కాగితపు ప్రతులు. 38 తాళపత్ర ప్రతులన్నింటిలోని పద్యాల సంఖ్య 16061 ఈ సంఖ్య వేమన పద్యాల మొత్తం సంఖ్య కాదు. 38 ప్రతులలోని పద్య సంఖ్య అన్నింటిని కూడితే వచ్చిన రాశి సంఖ్య అదేవిధంగా కాగితపు ప్రతుల్లోని రాశి సంఖ్య 15852. అంటే బ్రౌన్ కాగితాల కెక్కించకుండా వదిలివేసిన పద్యాలు స్వల్పం.

38 తాళపత్ర ప్రతుల ఆధారంగా ఏర్పడ్డ ఈ 16 ప్రతులను చూస్తే 38 తాళపత్ర ప్రతులను చూసినట్టవుతుంది. అయితే కాగితపు ప్రతులన్నీ ఒక పూటలో ఏర్పడ్డవి కావు. వీటి వెనుక ఎంతో చరిత్ర ఉంది. వీటికి తాళపత్ర ప్రతులకీ ఉన్న సంబంధం, వీటిని వ్రాయించడానికి ముందు బ్రౌన్ చేసిన నిరంతర పరిశ్రమా ఇవన్నీ తెలుసుకుంటే గాని వేమన పద్యాలను గూర్చి ఒక అవగాహనకు రావడం కష్టం.

వేమనను గూర్చి బ్రౌన్ మొదటిసారి 1824లో విని చదివాడు.[9] విన్నదే తడవుగా గ్రంథసేకరణ కుపక్రమించాడు. అప్పుడు అతడు మచిలీపట్నంలో ఉన్నాడు. స్వస్థలంలోనే కాకుండా బళ్లారి, కడప, నెల్లూరు, గుంటూరు, విశాఖపట్టణంనుండి తాళపత్ర గ్రంథాలను తెప్పించాడు[10] భౌగోళిక దృష్టితో ఈ ప్రతులను రెండు తరగతులుగావిభజించవచ్చు· 1. ఒక ప్రాంతంలో పుట్టి ఆ దరిదాపులలోనే సేకరించబడ్డవి ఉదా :—గూడూరు ప్రతి. గూడూరులో పుట్టి నెల్లూరులో దొరికింది. అదేవిధంగా మామిళ్ల దొరువుకు చెందిన ప్రతి (డి 1756) కూడ నెల్లూరులోనే లభించింది. కడప ప్రాంతంలోనే పుట్టిన మరో ప్రతిని (డి 1728) కూడ బ్రౌన్ కడపలోనే సేకరించాడు. 2. ఇక రెండవ తరగతి ప్రతులు పుట్టిన ప్రదేశానికి సుదూర ప్రాంతాల్లో సేకరించబడ్డాయి. ఉదా :— బెండమూరి లంకకు (తూర్పు గోదావరిజిల్లా) చెందిన ప్రతి (డి 1735) బ్రౌన్‌కు పెనుగొండ (అనంతపురం జిల్లా)లో దొరికింది.[11] ఒంగోలు జిల్లాలోని దర్శి తాలూకాకు చెందిన ప్రతిని, తూర్పు గోదావరి జిల్లాలోని యానాంకు చెందిన ప్రతిని (డి 1754) బ్రౌన్ ఇతర ప్రాంతాలలోనే సేకరించాడు. అదేవిధంగా తమిళదేశంలో బ్రౌన్‌కు దొరికిన ప్రతులన్నీ ఆంధ్ర దేశంలో పుట్టి దేశాంతరయానం చేసినవై ఉంటాయి. బ్రౌన్ ప్రతులు సేకరించిన ప్రదేశాలు ఎక్కువగా తూర్పు సముద్ర తీర ప్రాంతాలు. విశాఖపట్నంనుండి నెల్లూరుదాకా ఉన్న ముఖ్యమైన పట్టణాలన్నింటిలో బ్రౌన్ గ్రంథ సేకరణ కార్యక్రమం నిర్వహించాడు. ఉద్యోగరీత్యా కడపలో ఉన్నప్పుడు కూడ రాయలసీమలో అనేక ప్రతులు సంపాదించాడు బ్రౌన్. దాదాపు ఆంధ్ర దేశపు అన్ని మూలలనుండి (తెలంగాణా తప్ప) బ్రౌన్ వేమన పద్యాలను సేకరించాడు. దీనివల్ల వేమన పద్యాల ప్రాచుర్య పరిధి ఎంత విశాలమైనదో తెలుస్తుంది.

ఈ ప్రతులలో వేయి పద్యాలకు మించి ఉన్న పద్యాలు చాలా తక్కువ, వందలసంఖ్యలో పద్యాలున్న ప్రతులే ఎక్కువ. వీటిలో అత్యధిక సంఖ్యలో పద్యాలున్న ప్రతి డి 1774. దీనిలో 1083 పద్యాలున్నాయి. అతి తక్కువ పద్యాలున్న ప్రతి డి 1768. దీనిలో 91 పద్యాలున్నాయి.

## కాగితపు ప్రతులు

కాగితపు ప్రతులన్నీ బ్రౌన్ వ్రాయించినవే. వీటిలో అత్యధిక పద్యాలున్న ప్రతి డి 1721. ఇందలి పద్య సంఖ్య 1165. అతి తక్కువ పద్యాలు కలిగిన ప్రతి డి 1724. దీనిలో 306 పద్యాలున్నాయి.

తాళ పత్ర ప్రతులనుండి వేమన పద్యాలను ఎత్తి వ్రాయించడంలో బ్రౌన్ అవలంబించిన పద్ధతులనుబట్టి కాగితపు ప్రతులను మూడు భాగాలు చేయవచ్చు.

1. అకారాది క్రమంలో వ్రాయబడ్డ పద్యాలు గలవి. (డి 1723, డి 1724, డి 1726) 2. విషయాన్నిబట్టి విభాగాలు చేయబడ్డవి. (4 భాగాలు డి 1721, డి 1722; 3 భాగాలు డి 1737) 3. యథామాతృకంగా వ్రాయబడ్డవి. అకారాది క్రమాన్ని తన 'తెలుగు — ఇంగ్లీషు నిఘంటు'లో వలె క—గ—ల వర్ణక్రమంలో కాకుండా మనకు ప్రసిద్ధంగాఉన్న వరుసనే పాటించాడు బ్రౌన్. విషయాన్నిబట్టి బ్రౌన్ వేమన పద్యాలను మత, నీతి, అధిక్షేప, చిల్లర విభాగాలుగా వర్గీకరించాడు. విభజనము గూర్చి వ్రాస్తూ ఇంగ్లీషులో కూడ వేమన పద్యాలవంటివి ఉన్నాయనీ[12] వాటిని సంగ్రహపరిచేటప్పుడు మాలలు (గార్లాండ్స్) శతకములు (సెంచరీస్) అని విభజించనవసరంలేదని అభిప్రాయపడ్డాడు బ్రౌన్. విషయాన్ని బట్టి విభజించటం గ్రీకు, లాటిన్ మొదలైన భాషలలో ఉందని వ్రాశాడు. విషయాన్నిబట్టి విభజించే పద్ధతి మనకు అపూర్వం కాకున్నా వేమన పద్యాలను మొట్టమొదటిసారి నిర్దుష్టంగా విభజించి ప్రకటించిన ఘనత బ్రౌన్‌దే.

బ్రౌన్ ఈ ప్రతులలో పద్యాలను ఏరుకొని, సంస్కరించి, 3238 పద్యాలను ఇంగ్లీషులోకి (ఒక సంపుటం లాటిన్ లోనికి) అనువదించి ఐదు సంపుటాలుగా వ్రాయించాడు. (డి1773, సంపుటం 1, 2, 3, 4, 5) వీటిలో మత, నీతి, అధిక్షేప, మర్మ విషయాలున్న నాలుగు భాగాలు ప్రధానమైనవి. పై నాలుగు విషయాల్లో దేనిలోనూ చేరనివి చిల్లర విభాగంలో చేర్చబడ్డాయి. బ్రౌన్ ఈ విభాగాలను ప్రథమ గ్రంథము, ద్వితీయ గ్రంథము అని వ్యవహరించాడు. ''తెలుగులోనుండి ఇంగ్లీషులోనికి అనువదింపబడిన పుస్తకములలో ఇదియే విస్తృతమైన ప్రథమ గ్రంథము''[13] అని డాక్టరు కొత్తపల్లి వీరభద్రరావు వ్రాశారు. పైన చెప్పిన ఐదు సంపుటాలే కాక వాటిలోనుండి మరో 1300 పద్యాలు ఏరుకొని ఆంగ్లానువాదం చేసిపెట్టాడు (డి1774) దీనిని అచ్చుకొరకు సిద్ధపరచినట్లున్నది దీనిని సాహిత్య అకాడమీ వారు 'వెర్సెస్ ఆఫ్ వేమన' అనే పేరుతో ప్రకటించారు.

అనేక తాళపత్ర ప్రతుల చివర పాఠకుల సౌకర్యార్థం బ్రౌన్ అకారాది పద్య ప్రథమ పాద సూచికలు వ్రాయించాడు. వేమన పద్యాలకు సంబంధించినంతవరకు బ్రౌన్ ప్రారంభించిపోయిన ఈ సత్సంప్రదాయాన్ని అనంతర పరిష్కర్తలు, ముద్రాపకులనేకులు పాటించకపోవడం గమనిస్తే ఆశ్చర్యం కలుగుతుంది.[14]

## ప్రతుల పరస్పర సంబంధం

ప్రతి నెంబరు డి 1735లో 1116 పద్యాలున్నాయి. ఇన్ని పద్యాలు ఏ తాళపత్ర ప్రతిలోనూ లేవు. అసలు ఏ తాళపత్ర ప్రతిలోని పద్య సంఖ్య కూడ వేయినిమించి లేదని చెప్పవచ్చు. దీనిని బట్టి బ్రౌన్ వ్రాయించిన అనేక లిఖిత (కాగితపు) ప్రతులకు ఏకైక మాతృక అనేది లేదని తెలుస్తున్నది. బ్రౌన్ ఒక ప్రణాళిక ప్రకారం లేక తనకు నచ్చిన ఒకానొక పద్ధతిని చొప్పున తాళపత్ర ప్రతులనుండి పద్యాలను తోడుకున్నాడనిపిస్తుంది. డి 1735 ప్రతి మాతృకను (?) ఆయన పెనుగొండనుండి తెప్పించాడు. దాని సొంతదారుడు ముందు దానిని ఇవ్వడానికి అంగీకరించలేదు.[15] డి1735ను పోలిన మరో ప్రతిని బ్రౌన్ వ్రాయించాడు (డి1723). ఏవో రెండు మూడు పద్యాలుతప్ప పద్య సంఖ్యా, క్రమమూ ఒకేరకంగా ఉన్నాయి. కాబట్టి డి 1735కు డి1723 ప్రతి పుత్రిక అనడానికి ఏటువంటి ఆటంకాలులేవు. ఇక ఈ రెండింటికీ మూలమైన పెనుగొండ ప్రతి దొరుకలేదు. డి 1721, డి 1722 ప్రతులు కూడ ఒకే కుదుట పుట్టిన బిడ్డలుగా భావించడానికి అవకాశాలున్నాయి. ఇవి ఏ దృష్టితో చూసినా అతి ముఖ్యమైన ప్రతులు. ఈ రెండూ 1842లో వ్రాయించినవే. డి1721 పైన రిమార్కు వ్రాస్తూ ''ఇది ఒక పండిత కవిచేత పరిష్కరించబడింద''ని బ్రౌన్ పేర్కొన్నాడు. ఇందులో ''పద్యాల క్రమంకూడా కొంత మారింది'' అన్నాడు. కాని ప్రతులను పోలుస్తూ పరిశీలిస్తే ఈ మార్పు ఏమీ కనబడదు. ''దివాల్యూమ్ కంటెయిన్స్ 1165 స్టాంజాస్ సెలెక్టెడ్ అవుట్ ఆఫ్...'' అని అర్థాంతరంగా ఆగిపోయాడు బ్రౌన్. 3000 పద్యాలలోనుండి ఇవి ఎంచబడినట్లుగా తెలుస్తున్నది. డి 1722 ప్రతిపై రిమార్కు వ్రాస్తూ ''అనేక ప్రతుల ఆధారంగా పెంచబడిన, సరిదిద్దబడిన ప్రతి''[16] గా దానిని వర్ణించాడు. ఇందులోనికి ఎత్తి వ్రాసినవి మాత్రమే ప్రచురణార్హములు' అని బ్రౌన్ అభిప్రాయం. ఇంకా 2000 పద్యాలు మిగిలిపోయాయి. అవి ముఖ్యంగా అన్వయం కుదరని మార్మిక పద్యాలని బ్రౌన్ అభిప్రాయపడ్డాడు. గ్రంథారంభంలో ''దిస్ ఈజ్ ది న్యూ ఎడిషన్ ఆఫ్ వేమన 1842'' అని కూడా బ్రౌన్ వ్రాశాడు. వేటికన్న కొత్తదో తెలియాలి. ఏమైనా పై రెండూ అభేదప్రాయంగానే ఉన్నాయి.

తాళపత్ర ప్రతులూ, లిఖిత ప్రతులూ రెండూ ప్రక్కప్రక్కన పెట్టుకొని చూసినా మాతృకలను కనిపెట్టడం అంత

సులభంకాదు.[17] ఇక్కడ మాతృకలను కనిపెట్టడానికి మనకు స్థూలంగా కనిపించే ఏకైక సాధనం పద్య క్రమం లేక వరుస మాత్రమే అయితే దీనినిబట్టి ఏ రెండు ప్రతుల్లోని పద్య సంఖ్యా సమానతమీద మనం ఆధారపడలేము. ఎందుకంటె ఒక్కొక్క లిఖిత ప్రతికి అనేక తాళపత్ర మాతృక లుండవచ్చు. ఇక ఈ పద్య క్రమాన్ని అంకెలతోనే గుర్తించాలి. అంకెలు లేనిచోట పద్యాలు లెక్కబెట్టుకోవాలి. కాని మూల ప్రతులలోని పద్యాల వరుస పుత్రికలు చాలా వాటిలో మారిపోయింది. అట్లా మారడానికి బహుశా ఈ క్రింది కారణాలు ఎంతవరకు దోహదం చేసినాయో ఆలోచించాలి.

1. లేఖకుల అశ్రద్ధవలన తాళపత్ర ప్రతులలో దొర్లిన దోషాలు. ఉదా :– వ్రాసిన పద్యాలే మళ్లీ వ్రాయడం. అంటే వచ్చిన నెంబర్లే మళ్లీ వస్తాయి. 100, 101, 102, 103 తర్వాత మళ్లీ 100, 101 మొదలు కావడం.

2. (i) శ్రీకరముగ వేమన... (ii) శివకవులకు నవ కవులకు . ; ఈ రెండు పద్యాలు చిన్న చిన్న క్రమభేదంతో ప్రతి ప్రతి మొదటా వస్తాయి. లిఖిత ప్రతులు కొన్నింటిలో వీటిని తొలగించి, కొన్నింటిలో తొలగించకపోవడం వలన నెంబర్ల క్రమం కూలిపోయి చెల్లాచెదురైనాయి.

3. ఇతర ప్రతులను వ్రాయించేటప్పుడు ఆకులను విడదీసి నలుగురికి పంచి వ్రాయించడం వలన, వ్రాసిన తర్వాత వాటిని యథేచ్ఛగా కలపడం వలన కూడ మూల వ్యతిరేకమైన క్రమం ఏర్పడి ఉండవచ్చు.

అయినప్పటికీ కొన్ని మాతృకలను కనిపెట్టడంలో మనం సఫలమవుతాము. వాటి వివరాలు ఈ క్రింద ఇవ్వబడ్డాయి.

| క్రమ సంఖ్య | మాతృకలు | పుత్రికలు | పౌత్రికలు |
|---|---|---|---|
| 1 | డి 1728 తాళపత్రప్రతి | డి 1725 లిఖిత ప్రతి | |
| 2 | డి 1744 తాళపత్ర ప్రతి | డి 1770 లిఖిత ప్రతి | |
| 3 | బెండమూరి లంక ప్రతి(?) | డి 1735 లిఖిత ప్రతి | డి 1721[18]<br>డి 1722<br>డి 1723<br>డి 1762<br>డి 1737(?)<br>ఇవి అన్నీ లిఖిత ప్రతులు |

ఆంధ్రపత్రిక

ఆంధ్రపత్రిక ఇప్పటికి ఇంచుమించు ఏడు దశాబ్దాలుగా తెలుగు వారికి సేవ చేస్తోంది.
విజయవాడ మరియు హైదరాబాద్ నుండి వెలువడుచున్నది.
తాజా వార్తలు, పక్షపాతం లేని వ్యాఖ్యలకి ఆంధ్రపత్రిక పెట్టింది పేరు.
ఇవి కాక అన్ని రకాల అభిరుచులనీ సంతృప్తిపరిచే ఇతర శీర్షికలు ఎన్నో మీరు ఆంధ్రపత్రికలో చదవగలరు!

★ మన సినిమాలు ★ డాక్టరు కబుర్లు ★ కర్లైడో స్కోపు కార్టూన్
★ దినవార ఫలాలు ★ మా ఊరి సమస్య ★ శ్రీకృష్ణభాగవతం
★ ఇది నారీదృక్పథం ★ అరణ్యకాండ ★ వింత యదార్థం
★ ఇంకా — వ్యాసాలు, గేయాలు, కార్టూన్‌లు ... ...

ఎప్పటికప్పుడు ఆంధ్రపత్రికలో సరికొత్త ఆకర్షణలు ప్రవేశపెడుతూనే ఉంటాము!

వెంటనే ఆంధ్రపత్రిక చందాదారుగా చేరండి!

మేనేజరు, ఆంధ్రపత్రిక

# అ ధో జ్ఞా పి క లు

1 లైబ్రరీలో వీటి నెంబర్లు డి 1721 నుండి డి 1774 వరకు.

2 ఈ తాళ పత్ర ప్రతులన్నీ తిరుపతిలోని రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌కి తరలించబడ్డాయి. డి 1739, డి 1769 నెంబర్లుగల ప్రతులు తిరుపతిలో లేవు. వాటికి బదులుగా 2949, 2950 నెంబర్లతో ఉన్నాయి. ఇవి కూడా బ్రౌన్ సేకరించినవే అని వాటిపైన దాఖలా ఉన్నాయి. 38 తాళపత్ర ప్రతుల సంఖ్య 44 దాకా పెరిగింది. అంటే తిరుపతిలో అదనంగా 6 తాళపత్ర ప్రతులు లభించాయి.

3 లైబ్రరీ వారి కేటలాగులో పద్యసంఖ్య 795 అని పొరబాటుగా వేశారు.

4 కేటలాగులో 111 పద్యాలని తప్పుగా ఇచ్చారు.

5 కొన్ని ఆకులు పోవడంవల్ల 240 పద్యాలే ఉన్నవి.

6 ఈ ప్రతులు రాజాశరఫోజీ సరస్వతీ మహల్ లైబ్రరీ తంజావూరులో ఉన్నాయి.

7 కేటలాగులో ఉన్నట్టు 15 కాదు. అది అచ్చు తప్పు. మొత్తం పద్యాలు 215.

8 ఈ ప్రతులు సాహిత్య పరిషత్తువారిచే సేకరించబడి ప్రస్తుతం ఎ. ఎస్. పి. గవర్న్‌మెంట్ మ్యూసియమ్ ఎండ్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, కాకినాడవారి ఆధీనంలో ఉన్నాయి.

9 ...ఇన్ ది యియర్ 1824 వెన్ ఐ ఫస్ట్ రెడ్ వేమన మయి లెర్‌నెడ్ ఎసిస్టెంట్ వెంకటశివశాస్త్రి, ఇంటర్‌ప్రెటెడ్ ఇట్ ఫుల్లీ ...

బ్రవున్ డిక్షనరీ నోట్స్
పు. 312, నెం. డి 1391
వాల్యుమ్ 3.

10 ...దీస్ వెర్ కలెక్టెడ్ ఫ్రమ్ బళ్లారి, కడప, మదరాస్, వైజాగపట్నం. ప్రిఫేస్ డి 1793 వాల్యుమ్.4. ఆఫ్టర్ కలెక్టింగ్ సబ్ కాపీస్ వెర్ టు బి ఫౌండ్ ఎట్ మసిలీపటనం వేర్ ఐ వాస్ దెన్ స్టేషన్‌డ్, ఐ గ్రాడ్యువల్లీ ప్రొక్యూర్‌డ్ అదర్స్ ఫ్రమ్ వైజాగపట్నం నెల్లూర్, గుంటూర్, కడప ఎండ్ మదరాస్

ప్రిఫేస్ వెర్సెస్ ఆఫ్ వేమన (ప్రింటెడ్ ఇన్ 1829)

11 ది ఒరిజినల్ ఎమ్. ఎస్. వాస్ ఫౌండ్ ఎట్ పెనుగొండ, ఐ హాడ్ దిస్ కాపీ మేడ్ ఇన్ ఫిబ్రవరి 1824. బ్రౌన్స్ రిమార్క్స్ ఆన్ ఎమ్. ఎస్. నెం. డి1735.

12 ఎ మిసెలేనియస్ కలెక్షన్ ఆఫ్ అన్‌కనెక్టెడ్ వెర్సెస్ లయిక్‌ది ప్రెసెంట్ ఈస్ జనరల్లీ డెనామినేటెడ్ ఎ శతకమ్ విచ్ ఆన్సర్స్ టు ది గార్‌లాండ్ ఆర్ సెంచురీస్ కంపోస్‌డ్ బయి ఇంగ్లీష్ పొయెట్స్ ఇన్ ఓల్డ్ డేస్; బీయింగ్ ఎ సీరీస్ ఆఫ్ వెర్సెస్ విచ్ ఆర్ సిమిలర్ ఇన్ మీటర్, సబ్జెక్ట్ ఎండ్ కోరస్. దే ఆర్ జనరల్లీ నంబర్డ్ ఇన్ సెపరేట్ హండ్రెడ్స్, బట్ ఇట్ ఎప్పియర్‌డ్ అన్నెససరీ టు రిటెయిన్ అయిదర్ దట్ ఎరేంజిమెంట్ ఆర్ దట్ లిటిల్ ఇన్ ది ప్రెసెంట్ వాల్యుమ్, విచ్ మోర్ నియర్‌లీ రిసెంబల్స్ ది ఆంథాలజీస్ కలెక్టెడ్ ఇన్ గ్రీక్ ఎండ్ లాటిన్ లిటరేచర్; వెర్సెస్ ఆఫ్ వేమన ప్రిఫేస్ (1829)

13 సి. పి. బ్రౌన్, డా. కొత్తపల్లి వీరభద్రరావు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ 1963.
1963.

14 సాహిత్య అకాడమీ ప్రతిలో అకారాది క్రమసూచికలేదు.

15 ది ఒరిజినల్ ఎమ్. ఎస్. వాస్ ఫవుండ్ ఎట్ పెనుగొండ ఎండ్ ది ఓనర్ నాట్ విషింగ్ టు లెండ్ ఇట్. ఐ హాడ్ దిస్ కాపీ మేడ్ ఇన్ ఫిబ్రవరి 1824.

నోట్స్ ఆన్ ఎమ్ ఎస్. బయి బ్రౌన్ నెం. డి 1735.

16 ఎ న్యూ ఎడిషన్, ఎన్‌లార్జ్‌డ్ ఎండ్ కరెక్టెడ్ బయి ది ఎయిడ్ ఆఫ్ న్యూమరస్ మాన్యుస్క్రిప్ట్స్ డి 1722.

17 సాధికారంగా మాతృకలు, పుత్రికలను గూర్చి చెప్పడం అసాధ్యంకాదుగాని, ఒక్కొక్క ప్రతిని మిగిలిన అన్ని ప్రతులతో పోల్చినప్పుడు మాత్రమే ఒకనిర్ణయానికి రావడానికి వీలవుతుంది.

18 డి 1762, డి 1722, డి 1721 ప్రతులు విభాగాలుగా వ్రాయబడినప్పటికీ ఒకే కుదుటన్లో పుట్టాయనడానికి నిదర్శనాలు లభిస్తాయి.



# సంక్రాంతి కల్యాణి

## శ్రీ సుంకగాలి తిమ్మోతి జ్ఞానానందము

౧

నిలువుదోపిడిసేసి నింగికంటుచున్న
ధౌర్త్యంపు ధరలను తట్టుకొనుచు
నడివీధిలో భయానక చర్యలను సల్పు
గూండాయిజమునకు మండిపడుచు
పగల పెంపొనరించి దిగజారిపోయిన
రాజకీయాల యార్భటినిగనుచు
వల్లమాలిన మతవైషమ్య వర్గ భే
దాలకు హృదయాన తల్లడిలుచు
శోక నిభృతమైన సుడిగాడ్పులెన్నియో
చుట్టుకొనిన సరియెనెట్టుకొనుచు
వచ్చుచున్న యట్టి ప్రజలకీ మకర సం
క్రాంతి లక్ష్మి కూర్చుగాక శాంతి

౨

ఆసల్ క్రొత్తవి రేపుచున్ మనసునం దాహ్లాద కల్హార మా
లా సౌగంధ్య ఘుమం ఘుమంబురలదేలన్ పౌషకల్యాణి యె
న్నో సారుల్ భువిజుట్టివచ్చినది నేడూహింపగా నట్లె వి
చ్చేసెన్ నేర్పుత జాతికభ్యుదయ సుస్నేహ క్షమా పాఠముల్

3

రంగుల రంగవల్లుల హొరంగుల భంగిమ తెల్గు గేహపున్
ముంగిళులందు క్రొత్తవలపుల్ పచరింపగ కోడి పందెముల్
పొంగులువార నీ తెలుగు భూముల శౌర్యరసాలదేల్ప వ
చ్చెంగదు సంకురాతిరి విశిష్ట మనోహర భావయుక్తమై

౪

కడిమికి నోచుకోని "యలకాపజ" కెప్పుడులేని సంతసం
బెడద యొకింత హెచ్చినది యీ సమయమ్మున విశ్వశాంతికిన్
తొడవగు వీరి జీవనముతో పులకించుచు నేడు వారిదౌ
గుడిసెలలందుగూడ వెలుగుల్ ప్రసరించుత మెల్లకాలమున్

౫

ఊనంబింతయులేని యాంధ్రులకు కార్యోత్సాహ సంరంభ దీ
క్షా నైపుణ్యము నిచ్చుచున్ ప్రగతి మార్గంబందు నెల్లప్డు కా
లూనం జేయుత తెల్గుగుండియలలో నుప్పొంగ సంక్రాంతి క
ల్యాణీ రత్నము; నాడె యాంధ్రులకు నుల్లాసంపుపర్వంబగున్

౬

అరుణోదయమున శంఖారావ మొనరించె
లింగధారుండైన జంగమయ్య
గంగిరెద్దున కలంకారమ్ములను సల్పి
నృత్యమాడించె గంగెద్దుసామి
తెలుగు పౌరుష మహోజ్జ్వల వీరగాధలు
ముదము బాడెను బుడబుడకవాడు
కళ్లాన ధాన్యాలగని మేను పులకింప
పొలికేకనిడె పల్లె పొలతిమిన్న
చదల పుడమిజుట్టి స్వారిగావించెడు
గొనబు కొంటె గాలి కుఱ్ఱవాడు
వెరశి తెలుగుజాతి కరుసమిత్తురుగాక
ఈ శుభ సమయాన నీ దినాన

౭

ఈ సంక్రాంతి మహోత్సవమ్మునను నా యీ తెల్గు జాతీయత
శ్రీ సంరంభము దిగ్దిగంతములలో చిందాడు నా యాంధ్రభా
షా సౌందర్య నిసర్గ గంధలహరీ సంక్రాంత దార్ఢ్యమ్ము పూ
జా సత్కారములంది కోవలయు భాషాయోష గర్వింపగన్

౮

ఏనాడో యెటు పాటిపోయినవొగానీ నాటి సంక్రాంతి వే
ళా నైర్మల్య కళాభిమానములు ధర్మస్నేహ బాంధవ్య గా
ఢానూన ప్రగతి ప్రభావములు నేడా పూర్వ చైతన్య ర
క్షా నిశ్చేయము లేలగా వలయు నీ సంక్రాంతి వేళంబడిన్

౯

ప్రౌజ్జ్వల్యస్థిత ధర్మ దర్శన సుధావ్యాహార దక్షక్రియా
జాజ్వల్యంబిట సంతరించుకొనుచో సంక్రాంతి ప్రత్నోదయ
ప్రజ్వాలల్ సకలాంధ్రికిన్ సుఖముగూర్పన్ లేవులే; యీబుభు
క్షా జ్వాలావళు లారకున్నయెడ సంక్రాంతీ! సమీక్షింపుమీ!

౧౦

తెలుగుల మగతనం బెలమి దిక్కుల సూప
కోడి పుంజులు తన్నుకొన్న నాడు
తెలుగు వీరులగాథ దెలుపు పాటలు దాస
రన్న తంబుఱను దాగొన్న నాడు
తెలుగు వాకిండ్ల ముగ్గుల యంద చందాల
కాంతి రత్నచ్ఛటల్ గ్రమ్మునాడు
తెలుగు కన్నెల యాట తీరు తీయములలో
వ్యూహ ప్రణాళికలొదుగు నాడు

ఈ యఖండ మహాంధ్ర మహీతలాన
స్నిగ్ధ నిర్ఝరీ ధారా విశేష మెన్న
దురకలేపి పాఱునొ నాడె యుచితరీతి
మకర సంక్రాంతి లక్ష్మికి మహితజయము.

# వెన్నెల పౌరోహిత్యం

శ్రీ వాడపల్లి లక్ష్మణరావు

వెన్నెల పిండి ఆరబోసినట్టుందనడం పరిపాటి వ్యవహారం
ఆ సంగతెలాఉన్నా ఆ తెలుగు నుడికారం సంగతి ఏమైనా
నాకు మాత్రం నా మనసుకు మాత్రం నా మనస్తత్వానికి
మాత్రం
నా గుండె వెలుగుకు వెన్నెలద్దినట్టు
నా అస్తిత్వానికే స్పందన నేర్పినట్టు
నా గొంతుకకే స్వరమధురిమ లమర్చినట్టు
సంగీత ఘుమ ఘుమలు పండించినట్టు
నా మనసులో నీరూపం నిండినట్టు
నా కౌగిలిలో నీ వెచ్చని సంపద నిలిపినట్టు
నీ సుధా మధురిమలు నా పెదవి కందించినట్టు
అనుభూతుల మేలిముసుగులేసి అనుభవానికి
తెచ్చినట్టు
నన్ను నీలో నిన్ను నాలో చిరకాలం దాచినట్టు
మనకోసమే అన్నట్టు విరిపానుపును అల్లుకున్న
వెన్నెల.

# విశ్లేషణం

శ్రీ జెట్టిగుండ్ల రఘునాథరెడ్డి

వానలా నువ్వు
వర్షించు.
ఎండలా నేను
ప్రవహిస్తాను నీలోకి.
అప్పుడే మన ప్రేమ ఫలిస్తుంది.
ఒక ఇంద్ర ధనువు ఉదయిస్తుంది.

శ్రీ మధురాంతకం నరేంద్ర

# మళ్ళీ వచ్చేశాడు!

"వచ్చాడు!"

"వచ్చేశాడు!!"

"మళ్ళీ వచ్చేశాడు!!!"

చేతిలోని పద్మూడు ముక్కల్నీ చిందర వందరగా టీపాయ్ మీదికి విసిరేసి, కిటికీలోంచీ తొంగిచూస్తూ, బిగ్గరగా కేకలేశారు— మిత్రులిద్దరూ.

వాళ్ళకంత కుతూహలాన్ని కలిగిస్తూ, విచ్చేసిన వ్యక్తి యెవరా అనుకుంటూ నేనూ తొంగిచూశాను.

మానవుడి అడుగుజాడలకు ససేమిరా లొంగనని మొండికెత్తి నట్టున్న నల్లటి యెనుబోతులాంటి జావా మోటర్ బైక్ మా యింటికి వంద గజాల దూరంలో ఆగింది. దాన్ని అధిరోహించివున్న వ్యక్తి వేసుకొన్నది తెల్లటి బెల్‌బాటమ్ పాంటు తొడుక్కున్న నల్లటి కోటు షర్టును కనిపించనివ్వడం లేదు. కోటు మధ్యలో నుంచీ నల్లటి టై వయ్యారంగా ఎగురుతోంది. శుభ్రంగా గీక్కున్న గడ్డంపైన మీసాలు సైడ్‌లాక్స్‌తో కలిసిపోయినట్టుగా కనబడు తున్నాయి. ముఖంలోని భావాలు కనబడనివ్వకుండా కళ్ళకు నల్ల కళ్ళజోడు ... మోటర్‌బైక్ పైన ప్రయాణం చేయడంవల్ల రేగి పోయిన జుట్టు ... స్కూటర్‌ను ఆపుతూ క్రింద పెట్టిన కాలుకు నల్లటి 'షూ' కనబడుతోంది. అదిగో! అదేమిటి? చేతులకు గ్లవుసన్ గూడా తొడుక్కున్నట్టున్నాడే!

తెలుగు దేశంలో సినిమాల్లో తప్ప నిజ జీవితంలో అలాంటి దుస్తులెవరూ తొడుక్కోరన్న నమ్మకం నాకా క్షణంలో తొలగి పోయింది.

మోటర్‌బైక్ ఆగుతూనే వెనక సీట్లోంచి వొకస్త్రీ కిందికి గెంతింది. ఆమె యెవరోగానీ చూడ్డానికి సర్కస్ కంపెనీ వాళ్ల తాలూకులా కనిపించింది. వేసుకున్న డ్రస్సు అలాగే వుంది మరి! ముఖంలో బొట్టువున్న సూచనలేమీ కనిపించడంలేదు. మగరాయు డిలా వుంది ఆమె ఆకారం. ఆవిడ వేసుకున్న జడ — చిన్నతనంతో మా చెల్లెలికి తల స్నానం చేసిన రోజున మా అమ్మ అలాంటి జడే వేసేది; అదేమిటని అడిగితే మా చెల్లెలు 'పోనీటైల్' అంటూ కళ్ళు గుండ్రంగా తిప్పేది.

అతడిరాకను పదిమందికీ తెలియజేయడంకోసం గొంతుచించు కొని బరాబరులు పలుకుతున్న మోటర్‌బైక్ శబ్దానికి చుట్టు ప్రక్కల యిండ్లలోని మనుషులంతా బయటికొచ్చి చూస్తున్నారు.

"ఎవర్రా భాషా అతను?" అంటూ ప్రశ్నించాను.

ఆ ఆగంతకుడు మోటర్ బైక్‌కు స్టాండువేసి నిలబెట్టి యెదురుగావున్న మట్టిమిద్దెలోకి దూరి మాయమైపోయిన తరువాత "ఏమిట్రా అడిగావ్?" అంటూ నన్నే ప్రశ్నించాడు భాషా.

"అదేమిటి? అతడా యింట్లోకి వెడుతున్నాడేమిటి?" అని అడిగాను ఆశ్చర్యంగా.

"బలే బాగుందిలే! ఆయనగారి యిల్లే అది. అక్కడికి పోకుండా యింకెక్కడికి పోతాడు?" నవ్వేశాడు మూర్తి.

"అంటే..?"

"నాయనా రాజా! నువ్వు మనవూరొదిలిపెట్టి నాలుగయిదు సంవత్సరాలు కాలేజీ చదువులు వెలగబెట్టావే అనుకో — అంత మాత్రానికే మనవూరి మనుషుల్ని మరచిపొమ్మన్నారా చెప్పు?" నిల దీశాడు మూర్తి.

"అతగాడు మనవూరివాడా?" మళ్ళీ ఆశ్చర్యపడక తప్పలేదు.

"పూర్తిగా రాజుదే తప్పని చెప్పడానికి వీల్లేదురా మూర్తీ! ప్రస్తుతం ఆయనగారు వచ్చింది సరికొత్త వేషంలోగదా! అందుకే గుర్తుపట్టలేకపోయాడు." అంటూ మూర్తికి చెప్పి, తరువాత నావైపు తిరిగి "పోనీ నీకు ఆ యిల్లు యెవరిదో తెలుసట్రా రాజా?" అని అడిగాడు భాషా.

"నా డిగ్రీ చదువు మూలంగా అటు పుట్టికీ ఇటు స్వర్గా నికీ దూరమై యిలా తయారయ్యాననుకో — కానీ నన్ను ఈ విష యంలో పూర్తిగా తీసేయకురా భాషా! ఆ యిల్లు ఎవరిదో గూడా తెలియదని అనుకుంటున్నావా నాకు? అది శంకరయ్య యిల్లు..."

"శంకరయ్య కెందరు బిడ్డలో తెలుసా?"

"ఎందుకు తెలియదు? వీధిలో ఎప్పుడూ గోలీలాడుకుంటూ వుంటాడే — వాడి అసలు పేరేమిటో తెలియదు. వాణ్ణి అందరూ 'బుజ్జి' అని పిలుస్తూ వుంటారు, వాడొకడు. తరువాత సంతల వ్యాపారం చేస్తూ వుంటాడు చూడు, చంద్రం...ఆడపిల్లలెందరో అంతగా గుర్తు లేదు. ఎప్పుడూ లోటా వొకటి చేతబట్టుకుని మా యింటికి కూర కావాలంటూ వస్తూంటుంది వొకపిల్ల...సర్వ కాలాల్లోనూ మాసిపోయిన పూలపావడా, దానిపైన నల్ల రంగు జాకెట్టు వేసుకొని వుంటుంది. ఆ పిల్లకు యింకో జత బట్టలు గూడా లేవా—అని అనుకునేవాణ్ణి చూసినప్పుడల్లా. దానిపేరు..."

''మణి...'' భాషా గుర్తు చేశాడు.

''ఇంకా పెళ్ళయిపోయిన అమ్మాయొకతి వున్నట్టు జ్ఞాపకం. తరువాత ... అవును — వీళ్ళందరికీ పెద్దవాడు వొకతనున్నట్టు గుర్తు ... నిజమేనా ?'' అంటూ లెక్కలో నాకు సందేహం వచ్చిన చోట ఆగిపోయాను

''ఉన్నట్టుగాదురా రాజా ! ఉన్నాడు. అతడింకెవరో గాదు. ఇతడే ! ''

''ఎవరూ ? ఇతనేనా అతను ?'' ఆశ్చర్యపోతూ అన్నాను. ''ఇతగాడి గురించే గదూ — బెంగుళూరో, మదరాసో యెక్కడో వున్నట్టు చెబుతూ వుండేవాళ్ళు...''

''బెంగుళూరుగాదు, మదరాసే. వీడేవాడు—నరసింహులు...''

''నరసింహులు మనం హైస్కూల్లో చదివేటప్పుడను కుంటాను, సంతల్లో లంగరు పెట్టుకుంటూ తిరుగుతూ వుండే వాడు. ఒకసారెప్పుడో పోలీసులుపట్టుకెళ్లినట్టుగూడా జ్ఞాపకం...'' కొంచెం కొంచెంగా గుర్తుకు తెచ్చుకోసాగాను.

''ఫర్వాలేదురా రాజా ! నువ్వు మరీ మందమతి వేమీగాదు నీకు బాగ నే జ్ఞాపకముంది . '' మెచ్చికోలుగా చూశాడు భాషా.

''నేను కాలేజీకి వెళ్లిపోయినందువల్లనేమో — నాలుగైదు సంవత్సరాలుగా అతగాడినెప్పుడూ చూళ్లేదు. సెలవుల్లో వచ్చి నప్పుడు గూడా కనబడలేదు. ఎప్పుడో మీరే చెప్పారు — మదరాసు వెళ్లిపోయాడని. అది సరే, అతణ్ణి చూడగానే పేకముక్కల్నిగూడా విసిరిపారేశారు. అతడొచ్చినంత మాత్రాన మీకెందుకంత ఆనందం? వచ్చేశాడు వచ్చేశాడంటూ కేరింతలు కొట్టారెందుకు?...''

పేకముక్కల్ని సర్దిపెడుతూ ''ఇక మనకీ పేకాటెందుకురా రాజా ! కాలక్షేపం కోసం పేకాట యిక యెందుకూ పనికిరాదని నీ కర్థంగాలేదా యేమిటి?'' అంటూ నవ్వేశాడు మూర్తి.

''అంటే . ?''

''జీవంలేని పేకముక్కలతోనూ, చదరంగపు బంటులతోనూ అగచాట్లు పడాల్సిన కర్మ మనకింకేం పట్టింది ? నూరు సినిమాలకూ, వెయ్యిసర్కస్సులకూ ధీటు- నర్సింహు లొచ్చేశాడు మనకిక కాలక్షేపానికేం కొదవలేదు. పైపెచ్చు చూడనుచూడనూ కథ రస పాకాన పడ్తుంది. జరగను జరగనూ ఎంతో థ్రిల్లింగ్గా వుంటుంది'' పకపకా నవ్వసాగాడు భాషా.

''నర్సింహులు అంత బాగా కబుర్లు చెబుతాడా ?'' అని అడిగాను.

''కబుర్లా ? భలేవాడివే ! కాకరకాయ అనలేకపోయావు...'' నన్ను అమాయకుడిని చూసినట్టుగా చూస్తూ మరింత బిగ్గరగా నవ్వసాగాడు భాషా. మూర్తి కూడా శ్రుతి కలిపాడు.

''విషయమేమిటో చెప్పకుండా అలా నవ్వుతారెందుకు ?'' అంటూ విసుక్కొన్నాను.

''నీకు కోపం వచ్చినట్టుందే ! అయితే నీకు నర్సింహులు గురించి యేమీ తెలియదన్న మాట...'' నవ్వడం ఆపేసి బుద్ధిమంతుడిలా అడిగాడు మూర్తి.

''తెలియదనే చెబుతున్నాను. మీకు తెలిసిందేమిటో చెప్పి యేడవగూడదూ ?''

''అలా కసురుకోకురా బాబూ ! అయితే నీకు చెప్పాల్సిన విషయాలు చాలా వున్నాయి. ముందు కాస్సేపాగు. సిగరెట్టు వెలిగించుకోనీ '' అంటూ జేబులోంచి సిగరెట్టు ప్యాకెట్టు పైకితీసి తలా వొకటిచ్చి తానూ వొకటి తీసుకుని, అన్ని సిగరెట్లనూ తన సిజర్ లైటరుతోనే వెలిగించాడు మూర్తి.

మావూరు పల్లెటూరూగాదు. పట్నమూగాదు. ఆరెండింటి లక్షణాలూ వున్నపేట. దాదాపు అయిదు వందల యిళ్లుంటాయి. అందులో నాలుగోవంతు ముస్లిములు. మిగిలినవాళ్లంతా హిందువులే!

మాది అసలు సిసలయిన రైతుకుటుంబం. పది పదిహేను మడకల సేద్యం. తొలికోడి కూసినప్పుడు పొలానికివెడితే, మానాన్నగారు తిరిగి యింటికి రావడానికి రాత్రి యెనిమిది గంటలు దాటుతుంది. నేనొక్కణ్ణే మగసంతానం. పైరుకు సమయానికి యెరువెయ్యడ మెంత ముఖ్యమో, నెల నెలా నాకు డబ్బులు పంపడం గూడా అంతే ముఖ్యమనుకున్నారు ఆయన. నేను చదువుతున్న చదువేమిటో ఆయనకు స్పష్టంగా తెలియదు. ఏదో చదువుతున్నానని మాత్రం తెలుసు. ఎరువేస్తే పైరు మంచి ప్రతిఫల మిస్తుంది. అలాగే నేనూ తగిన ప్రతి ఫలాన్ని యివ్వవలసివుంది. అయినా డిగ్రీ వెలిగించిన నాకు వుద్యోగం దొరకలేదు. 'రాకుంటే పోయింది. ఉద్యోగం లేకుంటే మనకు జరగకపోతుందా ?' అన్నదే మా నాన్నగారి వాదం. కానీ నా ప్రయత్నాలు నేను మానలేదు. ప్రస్తుతం గిరికీలు కొడుతున్న నిరుద్యోగ పర్వంలో నాకు యీ మిత్రులిద్దరూ తోడయ్యారు.

మూర్తిదిగూడా రైతు కుటుంబమే ! నలుగురైదుగురు అన్న తమ్ముళ్లమధ్య ముద్దుగా పెరిగినవాడు. పొలం పనులు అతడికేమాత్రమూ కాబట్టలేదు. చదువొంటబట్టలేదు. ఊళ్ళోవున్న హైస్కూల్లోఎస్సెస్సీ పరీక్షపైన రెండుసార్లు దండయాత్రచేసి ఇక లాభంలేదనుకొని మానేశాడు. ఊరంతా బలాదూర్లు కొడుతూ తిరగడం అతడి దినచర్య.

భాషా తండ్రి సీజనల్ మర్చెంటు. మామిడికాయల కాలంలో మామిడికాయల వ్యాపారం, చింతకాయల కాలంలో చింతకాయల వ్యాపారం, యిలా ఆయనకు నాలుగైదు రకాల వ్యాపారాలున్నాయి. పనిలోకి దిగకపోతే సోమరిలా తిరుగుతూనే వుండడం, దిగాడంటే దున్నపోతులా అదే లోకమనుకోవడం భాషా స్వభావం. ఎస్సెస్సీ పాస

య్యాక చదువుకోక నమస్కారం పెట్టేశాడు. వ్యాపారానికి సంబంధించిన లెక్కలన్నీ నోటితోనే చేసేయగలడు.

ఈ మిత్రులిద్దరూ చిన్నతనంలో నాతోనే చదువుకున్నారు. సెలవుల్లో వచ్చినప్పుడు నాకు కంపెనీ యిచ్చేవాళ్ళు.

మా యింటి మిద్దెపైన యేకాకిలా కనిపించే గది మా క్లబ్బు. అందులో సిగరెట్లు కాల్చుకున్నా, పేకాటసాగించినా మమ్మల్ని గమనించే వాళ్లెవరూ వుండరు.

తాపీగా సిగరెట్టు త్రాగుతూ, పొగ రింగులు రింగులుగా వయ్యారాలుపోతూ వుండగా చెప్పసాగాడు మూర్తి— "సంతలకు తిరుగుతూ వొకటయినా బాకీ లేకుండా అన్ని దురలవాట్లూ నేర్చుకున్నాడు నర్సింహులు. అతణ్ణి బాగుపరచాలంటే ముకుదాడొకటి తగిలించాల్సిందే ననుకున్నాడు వాడినాన్న శంకరయ్య. మన దేశంలో ఆడపిల్లలకు కరువా ? ఓ దౌర్భాగ్యురాలితో వాడి పెళ్లి జరిగింది. పిల్లలుగూడా పుట్టారు. బహుశా నువ్వూ చూసేవుంటావు. వీధిలో చొక్కా నిక్కరు లేకుండా దిగంబరంగా తిరుగుతూవుండే అయిదారేళ్ల అబ్బాయి, అమ్మాయి ఎదురయితే వాళ్లు తప్పకుండా నర్సింహులు కొడుకూ, కూతురే అయివుంటారు. పెళ్లిచేసినందువల్ల అదనంగా యింకా వొకరిద్దరిని పోషించాల్సిన బాధ్యత మాత్రమే శంకరయ్యకు కలిగినమేలు. ఎక్కడికిపోతాడో, యెప్పుడు పోతాడో వరసగా రెండుమూడురోజులు అయిపులేకుండా పోతాడు. వచ్చాడో యింట్లో అబ్బాకొడుకులమధ్య జగడాలు ప్రారంభమవుతాయి. ఓసారి పెద్ద తగాదా జరిగింది. అతడిలో చలనం వచ్చింది. ఉన్నట్టుండి మాయమైపోయాడు. పోవడం పోవడం సంవత్సరం వరకూ పత్తాలేకుండా పోయాడు. తరువాత వొకనాడు యిలాగే అనుకోకుండా వూడిపడ్డాడు. ఎలావచ్చాడంటావు ? ఫారిన్ దొరలాగ వచ్చాడు. పెద్ద సూట్‌కేసు. దాన్నిండా రేడియోలు, ట్రాన్సిస్టర్లు — లాంటి ఖరీదయిన వస్తువులు. చివరకు తేలిన విషయమేమంటే యిన్నాళ్లూ మదరాసులోనే వున్నాడట ! పెద్ద మెకానిక్ దగ్గర అసిస్టెంటుగా చేరాడట ! తరువాత తానే ప్రత్యేకంగా వొక వర్క్‌షాపు పెట్టుకున్నాడట ! ఆమాట లెవరూ నమ్మలేదనుకో. ఇంకా యిలాంటి విషయాలే చాలా చెప్పాడు. ఎవరో సినిమా యాక్టరు చెల్లెల్ని పెళ్లాడాననిగూడా చెప్పాడు. అలా అతగాడు వచ్చినరోజు సాయంత్రమే మొదటి ప్రదర్శనం ప్రదర్శించబడిపోయింది.''

''ప్రదర్శనమా ? అంటే ..'' అంటూ అడ్డుతగిలాను.

''మరేంలేదు. నర్సింహులు తాగుతాడు...''

''తాగితే ఎవరికేం నష్టం? వాడి ఆరోగ్యమే పాడవుతుంది.''

''కేవలం తాగినంత మాత్రాన నర్సింహులుకు తృప్తికలగదు. గొంతులో చుక్క పడగానే అల్లరి చేయడం మొదలుపెడతాడు. ఎదుటివ్యక్తి యెంత మర్యాదస్తుడయినా అతడికప్పుడు భయం వుండదు. కనిపించిన ఆడదానితోనల్లా సరాగాలు పోతాడు. ఎదురైన మగవాడినల్లా కౌగిలించుకోబోతాడు. చుట్టూ జనం పెరిగేసరికి అతగాడి కుత్సాహమూ పెరిగిపోతుంది. వాళ్లు నవ్వుతూ వుంటే తన గొప్పతనంచూసే నవ్వుతూ వున్నారని అనుకుంటాడు. ఒకసారేమైందో తెలుసా ? బజారు వీధిలో రామలింగం వున్నాడు చూశావూ '' మూర్తి నవ్వసాగాడు. భాషకుకూడా ఆ సంఘటన గుర్తుకొచ్చినట్టుంది. తానూ పకపకా నవ్వసాగాడు.

''చెప్పయినా నవ్వండి లేకపోతే నవ్వయినా చెప్పండి.. '' అన్నాను విసుగ్గా.

రెండు మూడు నిముషాలు అదేపనిగా నవ్వి ఆ తరువాత తమాయించుకోగలిగారు. మూర్తి మళ్లీ చెప్పసాగాడు — ''రామలింగాన్ని తెలుసా నీకు ? లావుగా, పొట్టిగా చిన్నసైజు యేనుగులా వుంటాడు. బొట్టలాంటి కడుపుంటుంది. వడ్డీవ్యాపారం చేస్తూ వుంటాడు. ఒకనాడు పూటుగా తాగి వాగుతున్న నర్సింహులు చుట్టూ నలుగురైదుగురు పనీపాటా లేనివాళ్లు చేరారు తాను చేయలేని పనేమీ లేదని అన్నాడట నర్సింహులు. అయితే రామలింగం పంచె పెరికి పారేయమన్నారు వాళ్లు. 'ఓస్... అదెంతపని...' అంటూ తూలుతూ తూలుతూ రామలింగం దగ్గరికి చేరాడు నర్సింహులు. వాసన తగలగానే రామలింగం భయపడుతూ దూర దూరంగా వెనక్కి నడవసాగాడు. అయినా వీడూరుకున్నాడా? పులిలా దూకేశాడు. జరగాల్సినపని జరగనే జరిగింది. డ్రాయరే లేకపోతే వస్త్రాపహరణం పూర్తిగ జరిగేదే ! పంచెపోతే పోయింది లెమ్మని దూరంగా పరిగెత్తసాగాడు రామలింగం. ఆ సీను చూసి తీరాల్సిందేరా రాజూ ! కిరసనాయిలు డమ్ము దొర్లిస్తూ వుంటారే — అలాగుంది అతగాడు పరిగెడుతుంటే ... రొప్పుతూ, సోలుతూ యింట్లోకి వెళ్లి తలుపేసుకున్నాడు. నర్సింహులు అంతటితో వూరుకున్నాడనుకుంటున్నావా ? ఆ గ్లాస్కోరు పంచెను తీసుకెళ్లి వో ముష్టివాడి చేతిలో పెటి కట్టుకోమన్నాడు. గంట తరువాత మరో పంచెను కట్టుకొని వచ్చి 'నా పంచెను నాకు తెచ్చిపెట్టరాకూసీ' అంటూ కూర్చున్నాడు రామలింగం. నర్సింహులుకు కొంచెం నిషా తగ్గినట్టుగా తోచిందేమో — అప్పటికప్పుడు ప్రక్కనేవున్న వో వ్యక్తికి చేతివాచీని మూడ్రూపాయిలకు అమ్మేశాడు. అడ్వాన్సుగా అతడిచ్చింది పదిరూపాయలే ! ఆ పది రూపాయలూ చేత బుచ్చుకొని సారాయంగడిలోకి దూరేశాడు. రావడం రావడమే యీ పంచెగూడ లాగి పారేస్తానంటూ రామలింగంపైన పడ్డాడు. మళ్లీ మొదలయ్యింది పరుగుపందెం. రోడ్డు రోలరులా దొర్లుతూ రామలింగం ...వెనక పడుతూ లేస్తూ నర్సింహులు...అబ్బబ్బ ! ... ఆ దృశ్యం చూసి తీరాల్సిందేగానీ చెప్పలేం . '' మూర్తి నవ్వసాగాడు.

''మొత్తానికి రామలింగానికి వొక పంచె లాసన్నమాట '' అన్నాను.

''ఊహూ ! రామలింగం తక్కువ తిన్నాడనుకున్నావా ? వాళ్లింటికి వెళ్లి శంకరయ్యను పట్టుకున్నాడు. అతగాడెక్కడి నుంచీ తెచ్చిపెడతాడు ? నర్సింహులు వాచీ అమ్మేశాడు చూడు— వాడి పేరు రహీం. వాడి నడిగి మిగిలిన తొంభై రూపాయలూ

తీసుకొచ్చి రామలింగాని కియ్యవలసింది యిచ్చేశాడు. నర్సింహులు వూరుకున్నాడా ? నా డబ్బు మా నాయన కెందుకిచ్చావని రహీం వెంట పడ్డాడు. అంటే యేమిటి ? ఇంకో ప్రదర్శన మొదలయిందన్నమాట !...''

కాస్సేపు ఆగి తరువాత మళ్లీ చెప్పసాగాడు మూర్తి—''ఇలా చెబుతూపోతే వొకటా, రెండా ? నీకు వినే వోపికే వుండాలిగానీ—యెన్నయినా చెప్పగలను. అయినా వింటే యేమొస్తుంది, చూడాలిగానీ. వచ్చేశాడుగిదా ! చూస్తూండు, సాయంత్రానికంతా మొదటి ప్రదర్శనం ప్రారంభంగాకపోతే అప్పుడడుగు...''

''అదిసరేరా మూర్తీ ! అతడివెనక కూర్చుని వచ్చిందే—సర్కస్‌పిల్ల—అదెవరు ?'' అని అడిగాను.

''అదా ? ఎవరో కొత్తపిట్టయివుంటుంది. నర్సింహులును అడిగావనుకో— 'ఫలానా హిందీ సినిమాలో హీరోయిన్‌గా నటించిన అమ్మాయికి స్వయానా చెల్లెలు' అనేస్తాడు. నువ్వు 'ఆ సినిమా చూశాను. ఆ హీరోయిన్‌కూ, యీావిడకూ పోలికలేవీ లేవే !' అని అంటా వనుకో. 'బహుశా నువ్వు చూసేసరికి ఫిల్మంతా పాడయిపోయి వుంటుంది. గజానికోసారి ఫిల్మ కట్టయిపోయి వుంటుంది' అంటూ మదరాసులోని సినిమా థియేటర్ల గురించీ, అక్కడ సినిమాలకు వచ్చే ఫారిన్ లేడీలను గురించీ వుపన్యాసం మొదలు పెడతాడు.'' అంటూ జవాబిచ్చాడు భాషా.

''మత్తు దిగేదాకా అలా ఆడుతూనే వుంటాడా నర్సింహులు ?'' మళ్లీ వో సందేహాన్ని వెలిబుచ్చాను.

''మత్తు దిగడమా ? ఆ ప్రశ్నేలేదు. నర్సింహులు అన్నం తింటాడనుకున్నావా ? ఊహూఁ ! తిండీ నీళ్లూ అంతా మందే ! డబ్బు లెక్కువగా వున్నంతవరకూ బ్రాందీలు, విస్కీలు; అయిపోగానే సారాయీా కల్లూ ! తీసుకొచ్చిన వస్తువులను కనాకష్టం ధరలకు అమ్మేస్తాడు. చివరకు బట్టలుగూడా పరాయివాళ్ల సొత్తయిపోతాయి ఇక యింట్లోని వస్తువులపైన పడతాడు. నర్సింహులు తమ్ముడున్నాడు చూడు — చంద్రం — వాడు యింటి ముందు ఘూర్కాలా కాపలాకాయడం మొదలు పెడతాడు. ఇంట్లోకి రానివ్వకుండా వీధిలోకి తోయడం మొదలు పెడతాడు. 'నన్ను తోయడానికి నువ్వెవడ్రా?' అంటూ బూతులు తిడుతూ వాడిపైన పడతాడు నర్సింహులు క్రమక్రమంగా వీధిలోని అందరూ గుంపు చేరిపోతారు. శంకరయ్య, చంద్రం, యింకా యింట్లోని అందరూ వొక పార్టీ – నర్సింహులు వొకడే వొక పార్టీ – యుద్ధం ప్రారంభమవుతుంది. ఇక చూస్కో నాసామిరంగా ! వేడుకంటే వేడుకగాదు. డిటెక్టివ్ సినిమా అయినా అంత యింట్రెస్టుగా వుండదు .''

మూర్తి ఆపగానే భాషా అందుకున్నాడు— ''ఈ రంపు ముగియాలంటే రెండే దారులున్నాయిరా రాజా ! ఒకటి — ఇంకొంచెంపోసి నర్సింహులును వొళ్లు తెలియకుండా పడిపోయేలా చేయాలి. రెండు — సున్నంలోకి యెముక లేకుండా వొళ్లు హూనం చెయ్యాలి. మొదటి మార్గం కొంచెం కష్టం. రెండోది చాలా సులభం...ఊళ్లో అతణ్ణి తన్ననివాడు పాపాత్ముడు .''

''మాట్లాడుతూ కూచుంటే సమయమే తెలియలేదురా భాషా ! ఒకటిన్నరయింది గంట. భోజనానికింకా రాలేదేమంటూ యింట్లో కంగారుపడుతూ వుంటారు. నేను వెళ్లాలి...''అన్నాడు మూర్తి.

''అవునవును. నేనూ వెడతాను యింటికి ...'' అంటూ తానూ పైకి లేచాడు భాషా.

*　　　*　　　*

చిన్న చిన్న సందుగొందుల్ని మినహాయిస్తే మావూళ్లోవున్న పెద్ద వీధులు మూడు. ఆ మూడు వీధులూ కలిసేచోట తూర్పు దిక్కుకు అభిముఖంగా రాముడి గుడి వుంది. కన్నబిడ్డలు, దగ్గిరి బంధువులూ లేని వొక ముసలి రైతు చనిపోయేముందు తన ఆస్తి నంతటినీ వెచ్చించి ఆ గుడి కట్టిపోయాడు. ఇప్పటికీ గుడిలో ఆయన లైఫ్‌సైజు ఫోటో వ్రేలాడుతూ వుంది.

సాయంకాలం కాను కానూ గుడిమెట్లపైకి మెల్ల మెల్లగా నీడ పరచుకుంటుంది. ముందున్న స్థలంలో చిన్న పిల్లలు గోళీలు, జిల్లాకోడీ లాంటి ఆటలు ఆడుకుంటూ వుంటారు. మాలాంటి నిరుద్యోగ యువకుల కందరికీ సాయంకాలపు సమావేశ స్థలం ఆ గుడిమెట్లే! మేం ముగ్గురమేకాక యింకా వొకరిద్దరు మా సమవయస్కులు అక్కడ రోజూ కలుసుకోవడం కద్దు. యథాప్రకారం సాయంకాలానికల్లా అక్కడికి చేరుకున్నాము ఆరోజు మా కబుర్లలో ఎక్కువ శాతం నర్సింహులును గురించిన ముచ్చట్లేనని చెప్పవలసిన అవసరం లేదు.

ఇంతలో ''అదిగో నర్సింహులు ... ఇటే వస్తున్నాడు .. అంటూ ప్రకటించాడు భాషా. అందరి ముఖాలూ అటువైపుకు తిరిగాయి.

ఉదయం వేసుకొచ్చిన కోటు తీసేసినట్టున్నాడు. తెల్లటి షర్టుపైన టై మాత్రం అతడిని వదిలించుకోవడం కోసమన్నట్టుగా విలవిలలాడుతూ ముందు కెగురుతోంది. కోటు తీసేశాక మనిషి చాలా సన్నగా జండాకొయ్యలా కనిపిస్తున్నాడు.

రావడం రావడమే సుడిగాలిలా వచ్చాడు నర్సింహులు. కోడిపిల్లల్ని అదునుచూసి తన్నుకపోయే గ్రద్దలా, వొళ్లు మరచిపోయి ఆడుకుంటున్న పిల్లలపైన పడ్డాడు. వాళ్ల చేతుల్లోని జిల్లాకోడీ వూడలాక్కున్నాడు. దొరికిన గోలీలను దొరికినట్టే బండపైకి విసిరి పగలగొట్టేశాడు. చేతికి దొరికిన పిల్లల చెవులు పిండేశాడు. వాళ్లు కుయ్యో మొర్రో అని అరుస్తున్న అరుపులు చిన్న సైజు తుఫానును గుర్తు చేస్తున్నాయి. చిట్టచివరికి అతడి చేతిలో చిక్కి బిక్కరిస్తూ నిలుచుండిపోయినవాడు బుజ్జిగాడు. వాణ్ణి పారిపోనీకుండా వొక చెయ్యి మెలితిప్పి పట్టుకుని చచ్చేదీ, బ్రతికేదీ తెలియ

కుండా చావబాదేశాడు నర్సింహులు. విశ్వప్రయత్నంమీద వాడు వదిలించుకుని కాలువిరిగిన కుక్కపిల్లలా గొల్లు మంటూ దౌడు తీశాడు.

అందరూ వెళ్లిపోయిన తరువాత అతడికి తీరిక చిక్కినట్టుంది. ' ఫూల్సు...యిడియట్సు...రోగ్సులు...''అంటూ తిట్ట సాగాడు.

ఇదంతా చూస్తూ వూరుకోలేక ''అదేంటయ్యా నర్సింహులూ! వాళ్ల పైన పడ్డావేమిటి ? వాళ్లు నిన్నేం చేశారయ్యా బాబూ ?'' అంటూ ఆక్రోశించాడు భాషా.

''అసలు ఆ పిల్ల వెధవల్ని గాదు తిట్టాల్సింది, మిమ్మల్ని'' అంటూ మా వైపుకు తిరిగాడు అతను.

తామరాకు మీద నీటిబొట్టు లాంటివాడు భాషా. నర్సింహులుతో ఎలా మాటాడాలో అతడికి బాగా తెలుసు – ''అరరే! అలా కోప్పడుతావేమయ్యా! నిజమే! పొరబాటు మాదేననుకో! అంత మాత్రానికే యింత కోపమా ? మేము చిన్నవాళ్లం. నువ్వు పెద్దవాడివి. ఏం చెయ్యాలో చెప్పడం నీ వంతు. వినకపోతే అప్పుడడుగు...'' అంట్టూ అతడి ముందరికాళ్లకు బంధం వేసేశాడు.

''మీరంతా యంగ్ యువకులు. ఇట్టా వూరికే యెట్లా కూచుంటారు ? పిల్లకాయల్నంతా పాడుగానీకుండా చూడాల్నా వన్లేదా? డబ్బులు కలెక్టు చేసి వొకలైబ్రరీ పెట్టకూడదా? అందర్నీ కూచోబెట్టి చదివిస్తే యెలా వుంటుంది ? అట్లా చెయ్యకుండా లగేజీగా తయారవుతారా?...'' మా దగ్గరికి నడుస్తూ అన్నాడు నర్సింహులు.

''నిజమేనయ్యా! మేమూ యెంతో కాలంగా వొక లైబ్రరీ పెట్టాలని అనుకుంటున్నాం. కానీ డబ్బులిచ్చేవాళ్లు యేరీ ? పోనీ వొకపని చెయ్యి. ముందుగా నువ్వే బోణీ చెయ్యి. నీ ఆంతస్తుకు తగ్గట్టుగా నూట పదహార్లు మా మొహాన పడెయ్యి ...'' అని అడిగాడు భాషా.

''సర్టెన్‌గా యిస్తాను. పర్సు యింట్లో వుంది. తరువాత తెచ్చిస్తాను. మంచిపనికి నేనెప్పుడే ఫ్రంటే! .''

''అదిసరే నర్సింహులూ, ఉదయం వేసుకొచ్చావే కోటు – చాలా బావుంది. ఎక్కడ కొన్నావు? అదసలు చూడ్డానికి మన దేశానిదిలా కనబడ్డం లేదు. నాకు తెలుసు – అది తప్పకుండా ఫారిన్‌దే అయివుంటుంది. అవునా ?'' అంటూ సంభాషణను మరోవైపుకు మళ్లించాడు భాషా.

నర్సింహులువి అసలే పెద్దకళ్లు. అవి మరింత పెద్దవిగా వ్యాకోచిస్తుండగా నవ్వుతూ ''అవునవును. దాన్ని మా ఫాదరిన్‌లా తీసుకొచ్చాడు. అంటే మా థర్డ్ వైఫ్ ఫాదరన్నమాట! థార్డ్ వైఫంటే ఎవరనుకున్నావు? ఎప్పుడొచ్చినా దాన్ని తీసుక రాలేదేమని మా యింట్లో పెద్ద గలాటా ... అందుకే యీసారి ఐకప్ విత్ హర్. అసలు నిజానికి యీ కోట్లూ, టైలూ నాకు సరిపడవ్. మా వైపుందే – వేసుకోకపోతే చాలా ఫీలయిపోతుంది. ఆల్‌మోస్టు వీసింగ్ అనుకో...అందుకే వేసుకుంటాను...''

''అలాగామరి మీ వైఫ్ వుద్యోగం చేస్తున్నారా?...''

''యస్ డి. యస్. టైర్ల కంపెనీ తెలుసా ? మీకెలా తెలుస్తుంది? మాలాంటి మెకానిక్‌ల కయితే తెలుస్తుంది. ఆ కంపెనీ జనరల్ మేనేజరుకు పియ్యే మంత్లీ థౌజండ్ డ్రాయింగ్ చేస్తుంది. వాళ్ల నాన్న – అంటే మా ఫాదరిన్‌లా యే బిగ్ ప్రొఫెసరు ?''

''ఫారిన్ రిటర్నడా ? '' అతడి వొకటి సగం యింగ్లీషు పరిజ్ఞానానికి వస్తున్న నవ్వు నాపుకుంటూ అడిగాను.

''ఫారిన్‌గాదు...జర్మనీ వెళ్లొచ్చాడు.. ''

''అలాగా! అయినా నర్సింహులూ! నిల్చునే మాట్లాడుతున్నావేమిటి? ఇలా కూర్చో! నువ్వు చెప్పే కబుర్లు వినాలని యెన్నో రోజులుగా యెదురు చూస్తున్నాం...'' అన్నాడు భాషా.

''ఊహూ! కూర్చునేటంత టైంలేదు అర్జెంటు పని పడింది. ఒన్ వీక్ వుంటాన్లే .. లీజర్‌గా వుండేటప్పుడు కనిపిస్తాను .'' అంటూ అతడు తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు.

నర్సింహులు దూరంగా వెళ్లిపోయాక 'అంత అర్జెంటు పనేమై వుంటుం'దన్న సందేహాన్ని వెలిబుచ్చాను.

---


# భారతి

## చందా వివరములు

| | ఏజంటుద్వారా | పోస్టులో |
|---|---|---|
| విడి ప్రతి | రు. 1-50 | - |
| 6మాసములచందా | రు. 9-00 | 9-60 |
| సంవత్సరచందా | రు. 18-00 | 19-20 |

ఒకేసారి ఆంధ్రపత్రిక ఆఫీసుకు నేరుగా చెల్లిస్తే సంవత్సరచందా 12-00

మేనేజరు
భారతి

''అయ్యో పిచ్చివాడా ! అతడేవైపుకు వెళ్తున్నాడో చూడు అటువెళ్తే వాళ్ల ఇల్లురాదు. బ్రాందీషాపు మాత్రం వస్తుంది.'' అన్నాడు మూర్తి.

మా భాషా పరిభాషలో చెప్పాలంటే నర్సింహులు తన ప్రదర్శనల్ని మరునాటి సాయంకాలానికిగానీ మొదలు పెట్టలేదు. మొదలు పెట్టినప్పటినుంచీ యెక్కడ పడితే అక్కడ వినోదం వీధిలో యెప్పుడు పడితే అప్పుడు దొరుకుతోంది. మా పేకముక్కలపైన, చెస్ బోర్డుపైన దుమ్ము పేరుకపోయి వుంటుంది.

నర్సింహులు ప్రదర్శనాల్ని రెండు రకాలుగా విభజించవచ్చు. ఒక రంగం తరువాత మరొక రంగంలా మధ్య మధ్య విరామాన్ని కల్పిస్తూ సాగిపోయే ప్రదర్శనాలు మొదటి రకం. ఆ విరామ సమయంలో ప్రేక్షకుల్ని యెంటర్‌టెయిన్ చేయడంకోసం తయారు చేయబడిన 'టిట్ బిట్స్' లాంటి ప్రదర్శనలు రెండో రకం.

ఓరోజు వొకప్పుడు బాగా బ్రతికి ప్రస్తుతం అపూట కాపూటకుకూడా తడుముకోవలసి వస్తున్న మావూరి మాజీ ప్రెసిడెంటు యింటిముందు తిష్టవేసేశాడు. వాళ్లింట్లో పాడైపోయిన ట్రాన్సిస్టరొకటి వుందని చెప్పారట ఎవరో—తెచ్చిస్తే అక్కడికక్కడే అలా వీధిలో కూర్చునే రిపేరు చేసిస్తానని గోలచేయసాగాడు. తాగుబోతుకిస్తే బాగుచేయడంమానె, యే పార్టుకాపార్టు వూడబెరికి కుప్పతొట్టిలోకిమాత్రం అలంకారంగా తయారు చెయ్యగలడని యెవరికి తెలియదు? ఇవ్వనంటే అతడూరుకున్నాడా ? తెచ్చుకున్న డబ్బులయిపోయాయి, ఓ పది పారేస్తే వెడతానన్నాడు. చివరకు వో అయిదు చదివించుకున్న తరువాతగానీ ఆయన వూపిరి పీల్చుకోలేకపోయాడు.

గుడిలోకి నీళ్లు తెచ్చిపోయడానికి రంగమ్మంటూ వొకావిడ వుంది. ఓసారి నర్సింహులు తాగి తూలుతూ వెళ్లి ఆమె మీదపడి తీసుకొస్తున్న కుండకాస్తా పగలగొట్టేశాడు. బంగారంలాంటి కుండ పోయిందని ఆమె నోరు జారిందట ! ఇంట్లోవున్న కుండల్ని కూడా పగలగొట్టేస్తానని ఆవిడ యింటిపైకి వెళ్ళాడు నర్సింహులు. తలుపు గడియవేసుకుని గుడిసె లోపల రంగమ్మ—బయట తలుపు పగలగొట్టేస్తానంటూ అతగు—చివరకు ఎక్కడో పనిమీద బయటికెళ్లిన ఆమె మొగుడొచ్చేదాకా వినోద ప్రదర్శనం నిరాఘాటంగా సాగిపోయింది. అతడొచ్చి నర్సింహుల్ని వీధిలో పార్లించి పార్లించి చావగొట్టాడు. చివరకు స్పృహతప్పి వీధిలోనే పడిపోయిన నర్సింహుల్ని చంద్రంవచ్చి యింటికి మోసుకెళ్లాడు.

నాలుగురోజుల తరువాత వొకనాటి వుదయం నర్సింహులు తాజా భార్య పలాయనం చిత్తగించిందన్న సరికొత్త వార్తనుమోసుకొచ్చాడు భాషా. ఇంట్లోనే జరిగినందువల్ల అది శ్రవ్యరూపకం మాత్రమే ! నర్సింహులు ఆమెనేదోఅడిగాడు. ఆవిడేమో అంది. ఆమె వీపు పగిలిపోయింది. ఇంట్లో వాళ్లకూ, బయటి వాళ్లకూ అర్థంగాని సరిక్రొత్త భాషలో ఆమె చచ్చిన కాకినిచూసి గొంతు చించుకునే తోటి కాకిలా రోదనచేస్తూ తనపెట్టాబేడా చేతబట్టుకుని బస్సెక్కేసింది. తెల్లవారిజామున బస్సెక్కినప్పుడు చూసినవాడు ఆమె పొనిటెయిల్లో సగం చిక్కిపోయి వుందని చెప్పాడట ! బహుశా అందుకు కారణం నర్సింహులే అయివుంటాడని మా భాషా వూహ !

నర్సింహులు వూరికివచ్చి వారంరోజులు కావస్తున్నాయి.

ఇప్పుడు అతడి ఆకారం వచ్చినప్పుడున్న ఆకారానికి పూర్తిగా విరుద్ధంగావుంది. తీసుకొచ్చిన బట్టల్నికూడా అమ్మేసినట్టున్నాడు. వచ్చినప్పుడు తొడుక్కున్న బట్టలే మసిగుడ్డల్లా వ్రేలాడుతున్నాయి. షర్టు సగానికి సగం చినిగిపోయింది. పాంటుకు మోకాళ్లవద్ద అయిదారు అంగుళాల మేరకు రంధ్రాలు యేర్పడ్డాయి. క్రింది భాగాన పోగులు పోగులుగా వ్రేలాడుతోంది. తార్రోడ్డు పనిచేసే కూలివాళ్ళు తొడుక్కునే తోలు చెప్పుల్లా తయారయ్యాయి బూట్లు. సాక్సులున్న సూచనయినాలేదు టై యేమయిపోయిందో యేమో ! పిచ్చుకగూడులాంటి తలవెంట్రుకలు... బహుశా ఆదిమ మానవుడు అలా వుండేవాడేమో ! లేకుంటే సంవత్సరాల తరబడీ నిద్రపోయి లేచిన రిప్‌వాన్‌వింకుల్ యిలా తయారై వుంటాడు.

ఆకారం అలా రూపొందేసరికి అతడి ప్రదర్శనలు మరింత రసవంతంగా కొనసాగుతున్నాయి వీధిలోకొచ్చి నిలుచుంటేవాలు — ఎక్కడో కొద్దిగా అలజడి వినిపిస్తుంది. క్రమంగా పెరిగి పెద్దదవుతుంది. వెళ్లి చూడ్డానికి నిలుచుంటే చాలు — ఎంతసేపయినా బోరన్న ప్రశ్నేలేదు.

ఒకనాడు సుప్రభాతంలా తెల్లవారిజామున నాలుగు గంటల ప్రాంతంలోనే మొదలయింది నర్సింహులు ప్రదర్శన. అలజడికి మెలకువ వచ్చేసింది. వీధిలోకి వచ్చి చూశాను. ఈ ప్రదర్శనలో పరాయివాళ్లతో అతడు చెలగాట మాడడంలేదు. ఏకంగా తల్లితండ్రులపైన్నే యుద్ధం ప్రకటించాడు. నర్సింహులు మొదటి భార్య నిన్నసాయంకాల మెప్పుడో పుట్టింటికి వుడాయించేసిందట ! తన భార్యని తన అనుమతి లేకుండా వూరికెవరు పంపమన్నారని అతడి ఫిర్యాదు. నిజానికి పెళ్ళాడడం, బిడ్డల్ని కనడం మినహా భర్తగా నర్సింహులు భార్యకు వొరగబెట్టిందేమీలేదు. అందువల్ల చెప్పాల్సిన అవసరమేమీలేదని శంకరయ్యావాదన ... తాగుబోతుతో నీకెందు కొచ్చిన గొడవలెమ్మంది శంకరయ్యభార్య. తల్లిదండ్రులిద్దర్నీ యింగితా యింగితాలు లేకుండా కాస్సేపు తెగ బూతులు తిట్టాడు నర్సింహులు. తరువాత 'నా పెళ్లాన్ని నాకు కానీకుండా చేస్తున్నారు బాబో' అంటూ యేడవబోయాడు. ఓపికున్నంత వరకూ ఆగి, తరువాత గూబ గుయ్యిమనేటట్టుగా నాలుగిచ్చుకున్నాడు శంకరయ్య. దాంతో అతగాడి ఆగడం మరింత యెక్కువయింది. చివరికో నిర్ణయాని కొచ్చిన శంకరయ్య సుపుత్రుణ్ణి కరెంటు స్థంబానికి కట్టిపారేశాడు మాటాడనివ్వకుండా నోటి నిండా పాతగుడ్డ దోపేశాడు. అంతటితో ప్రదర్శన ముగిసింది.

ఇంటికొచ్చి ముఖం కడుక్కున్నాను. టిఫెనుకు కూచోబోతుండగా 'అయ్యగారు కొడవళ్లు తెమ్మన్నా' రంటూ వచ్చాడు

పాలేరు. వాటిని తీసివ్వడంకోసం పనిముట్లన్నీ పెట్టుకునే గది వైపు నడచాను.

. గదికి బీగం వేయలేదు గడియమాత్రం వేసివుంది. తెరిచి లోపలికి అడుగుబెట్టబోయినవాడినల్లా అలాగే దిగ్భ్రాంతుడినై పోయాను. ఎదురుగా వొకస్త్రీ ... మోకాళ్లు గుండెలకు దగ్గరగా పెట్టుకుని కూర్చోవడంవల్ల యెంత పొడుగో తెలియడంలేదు. కట్టుకున్న నీలంరంగుచీర అక్కడక్కడా రంగు పోగొట్టుకునివుంది. ఎర్రటి జాకెట్టు ఆ చీరకేమాత్రమూ మాచింగ్ కాలేదు. నెరవని వెంట్రుకలు, మిగిలిన శరీరం వయస్సు పాతికేళ్లని చెబుతున్నా, ముఖంలో అప్పుడే వృద్ధాప్యం కనబడుతోంది. టార్చిలైటు వెలుతురు ముఖాన పడగానే యిక కదలలేక భూమిపైకి అణిగిపోయి, స్థాణువులా మారిపోయే కుందేలులా ఆమె ... గ్రద్దబారినుంచీ తప్పించుకోవడం కోసం పెట్టరెక్కలక్రింద నక్కిపోయే కోడిపిల్లలా ఆమె కిరువైపులా యిద్దరు పిల్లలు...

నేను లోపలికి అడుగుపెట్టగానే ఆమె సర్దుకుని కూర్చుంది. నాకేం చేయాలో తోచలేదు. మౌనంగా కొడవళ్లు తీసుకొని బయటికొచ్చేశాను. మామూలుగా గడియ వేసేశాను.

కొడవళ్లు తీసుకొని పాలేరు వెళ్లిపోయినతరువాత ''మూల గదిలో యెవరో వున్నారమ్మా!'' అంటూ కంగారుగా మా అమ్మకు చెప్పాను. రహస్యం చెప్పబోతున్నట్టుగా ఆమె దగ్గరగావచ్చి ''ఎవరికీ చెప్పొద్దురా తండ్రీ! ఆ తాగుబోతు వెధవకు తెలిసిందంటే మన పైకొచ్చినా వస్తాడు జగడానికి...'' అంది.

''అంటే... అంటే ?''

''అదే... శంకరయ్య కోడలు... దాని చెవుల్లోవీ, మెడలోవీ —అన్ని నగలూ యేటిపాలు చేసేశాడు ఆ నర్సింహులు మిగిలిందొకటే...నల్లపూసల బంగారు గొలుసు... దాన్నివ్వమంటూ కూచున్నాడట . ఇవ్వకపోతే తన్ని తగలేస్తాడు. ఎలాగైనా యింట్లో దాచిపెట్టమని తీసుకొచ్చి అప్పగించి పోయింది శంకరయ్యపెళ్లాం... బయట యెవరికీ చెప్పొద్దు .'' అంటూ అమ్మ వెళ్లిపోయింది.

దట్టంగా పరుచుకున్న మేఘాల కవతల యేదో నక్షత్రం మినుకు మినుకుమంటూ మెరిసినట్టుగా అంతవరకు అవగతంగాని సత్యం వొకటి స్ఫురించింది. హృదయంలో యేమూలో మెల్లగా కలుక్కు మన్నట్టుగా తోచింది. టిఫెను రుచించలేదు. వీధిలో కెళ్లలేకపోయాను. ఇంట్లో నిలువలేకపోయాను.

''అలా కాలుగాలిన పిల్లిలా తిరగకపోతే పొలానికెళ్లి మీ నాన్న కేమయినా సాయం చేయరాదేమిట్రా?'' అంటూ కసిరింది అమ్మ.

ప్రస్తుతానికి అదే మంచి పనిలా తోచింది. పొలానికెళ్ళేసరికి సూర్యుడి ప్రతాపాన్ని సాకు చేయమన్నట్టుగా కోతపనిలో మునిగిపోయిన కూలీలు కనిపించారు.

''ఇదేమిట్రా, యిలా వచ్చావు ?'' అన్నారు యజమాయిషీ చేస్తున్న నాన్న.

''ఊరికేనే! ..'' అంటూ చూస్తూ నిల్చున్నాను.

కాసేపు గడచిన తరువాత నేనూ కోయగలనేమోనని ప్రయత్నంచేశాను. అయిదు నిముషాలు కాకముందే చేతులు నొప్పెట్టాయి గట్టుపైనకూచున్నాను. మధ్యాహ్నం అక్కడికే భోజనం వచ్చింది.

సాయంకాలం అయిదు గంటల ప్రాంతంలో ''నువ్వింటి కెళ్లరా బాబూ! ఇంతసేపున్నది చాలుగానీ...''అన్నారు నాన్న.

పొలం పనుల్లో కొంచెం ఆనందం చేకూరింది. ఇంటికి బయల్దేరాను. ఆలోచించుకుంటూ గట్టుపైన నడుస్తున్నాను.

డబ్ . డబ్ మంటూ శబ్దం వినిపించింది. ఏమిటోనని మొదట పట్టించుకోలేదు. అలాంటి శబ్దమే మళ్లీ మళ్లీ వినిపించింది నిలుచున్నచోటునే ఆగిపోయి చుట్టూచూశాను.

అక్కడో పాడుబడిన బావి వుంది. ఒకప్పుడు దానికి మిషెన్ సెట్టు గూడా వుండేది పైప్ నుంచీ వచ్చేనీళ్లు మొదట తొట్టిలోకి వచ్చిపడి ఆ తరువాత బయటికొచ్చేవి. ఆ మిషన్ సెట్టు, పైపులు లేకపోయినా ఆ తొట్టి మాత్రం యింకా అలాగే వుంది. పైనమాత్రం వొకటి రెండు వరుసల రాళ్లు పడిపోయాయి. అందులోంచీ వస్తోంది శబ్దం.

దగ్గరికి వెళ్లి తొంగి చూశాను.

వెంటనే ముక్కు మూసుకున్నాను.

లోపల కుళ్లిపోయిన ఆకులు, రకరకాల రాళ్లు, గోడలపైన మొలిచిన గడ్డి–గడ్డినీ, రాళ్లనూ వొకవైపుకు తోసిపారేసి, వీలయినంత ఖాళీ స్థలాన్ని యేర్పరచుకొని కూర్చొనివున్నాడు వో పదేళ్ల కుర్రాడు. బయటి ప్రపంచాన్ని పూర్తిగా మరచిపోయి ఆ కాస్త స్థలంలోనే వొక్కడే గోలీలాడుకుంటున్నాడు ..

''ఎవర్రా నువ్వు ?''

వాడు తలెత్తి చూశాడు

''రేయ్ బుజ్జీ! ఇక్కడేం చేస్తున్నావురా ?'' అంటూ ఆక్రోశించాను.

''గోలీలు...గోలీలు . '' గోలీలు చూపెడుతూ బిక్కమొహం పెట్టాడు వాడు.

''గోలీలాడుకోడం యిక్కడేనా? బయటెక్కడా స్థలందొరక లేదా నీకు ? ''

''బయట ఆడుకుంటే, మా అన్న చూసాడంటే చావగొడతాడు.''

''ఎవరూ ? నర్సింహులేనా ?''

''అవును.. ''

సమాధానం విన్న తరువాత నా ప్రశ్నెంత అసంగతంగా వుందో బోధపడింది.

''కొడితేమాత్రం అక్కడా ఆడుకోవడం ? బయటికిరా ... నీకు యింకెక్కడయినా మంచి చోటు చూపెడతాను'' అన్నాను.

''ఒద్దొద్దు . నా కిక్కడే బాగుంది ... ఇంకెక్కడయినా అయితే మా అన్నకు తెలిసిపోతుంది...''

నేను సందేహించడం చూసి ''నే నింకెక్కడికీ రాను ... ఇక్కడే వుంటాను. ఇక్కడే బాగుంది.. '' అన్నాడు వాడు మళ్లీ.

నాకేం చెయ్యాలో పాలుపోలేదు. మౌనంగా వెనక్కు వచ్చి దారివెంట నడవసాగాను. మళ్లీ మామూలుగా గోలీల శబ్దం వినిపించసాగింది. ఆశబ్దం రెట్టింపై, భరించలేనంత శబ్దంగా మారినట్టు తోచి కలవరపడసాగాను.

తగిలిన కాలికే మళ్లీ తగిలినట్టుగా వుదయం జరిగిన సంఘనకు తోడు యీ సంఘటన...మనసంతా కెలికినట్టుగా వుంది...

ఇంటికెళ్లబోతుండగా వీధిలో యెదురైన భాషా ''అరరే ! ఎక్కడికెళ్లావు యీ రోజంతా ! ఈరోజేం జరిగిందనుకున్నావు ? నర్సింహులు చూపులు యీసారి మన రంగనాథంపైన పడ్డాయి... అసలు'' అంటూ యేదో చెప్పబోయాడు.

''సారీ భాషా! ఎందుకో చీకాకుగా వుంది. తలకూడా నొప్పొంది ఇంటికెళ్లి కాఫీ త్రాగి వస్తాను...'' అని సమాధానం చెప్పి యింటికొచ్చేశాను.

కాఫీ త్రాగి యీజీ చేర్లో వాలిపోయాను.

అలా యెంతసేపు కూచున్నానో నాకే తెలియదు.

''ఈ కొడవళ్లు, కత్తులు ఇవంతా గదిలో పెట్టాలండీ!'' అంటున్న పాలేరు మాటలు విని వులిక్కిపడి పైకి లేచాను. వాటిని అందుకొని గదివైపుకు నడచాను.

గది తెరవగానే మళ్లీ వులిక్కిపడ్డాను.

ప్రొద్దున చూసిన దృశ్యం అలాగే యెదురయింది.

ఆమెలో మళ్లీ అదే తడబాటు

సామాన్లన్నీ నేలపైన పారేసి ''ప్రొద్దున్నుంచీ యిక్కడే వున్నావా ?'' అంటూ ఆక్రోశించాను.

నా ఆక్రోశం ఆమెకు మరోలా అర్థమయినట్టుంది. ''ఈ రాత్రి కెట్లయినా యీడ్నే తలదాచుకుంటాను. ఎల్లిపొమ్మనొద్దు సామీ ! చచ్చి నీ కడుపులో పుడతా'' జీరవోయిన గొంతుకతో వేడుకొంది ఆమె.

''అదిగాదు . అదిగాదు ... మరి అన్నం ... అంటే భోంచేశావా ?...''

''ఊహూ! తిన్లేదు...ఒద్దు నాకాకిలిగా లేదు . ఒకనాటికే తిండిలేకపోతే సచ్చిపోతానా, యేమయినానా?...'' పైకి పెగల్చుకొని వస్తున్న యేడుపునాపుకుంటూ అంది.

''అదిసరే...మరి పిల్లలు ..''

''వాళ్లకూ వొద్దులెండి...''

''వాళ్లనయినా యింటికి పంపకపోయావా ? వాళ్లను కూడా కొడతాడా యేమిటి ? వాళ్లేం పాపం చేశారు ?''

''ఎవరు మాత్రం యేం పాపం చేసినారు సామీ ! కనిందే ఆ అమ్మా – అయ్యా చేసిన పాపమా ? కూడా పుట్టిందే చంద్రయ్య జేసిన పాపమా ? కట్టుకునిందే నేన్జేసిన పాపమా ? నా కడుపులో పుట్టిందే యీ పసికూనల పాపమా ? ఎవురేం పాపం చేసినారు ? ఎందుకయ్యా మాకీ శిక్ష ?''

''అతణ్ణి తాగకుండా చూడ్డానికి మరేమీ దోవలేదా?'' అని ప్రశ్నించాను.

''దోవా ? చచ్చిపోయే దొకటే దోవ ... యేమో. ఆయనో యెవరో వొకరు చచ్చిపోతే పీడాపోతుంది. బొమ్మరిల్లు మాదిరిగా సక్కనైన కాపరం. పోతే పోయినాడు, వుండి యేం వుద్ధరించినాడు ? – అనుకోని వుండేందీ, లేదీ సరిజేసుకోని కొంచెం సంతోషంగా బతకతా వుందామని అనుకునేటప్పుడు వస్తాడు పాపం మాదిరిగా ! అంతే ! కాపురం కుక్కలు చింపిన పుల్లిస్తరాకే ! మేమందురు మింగాలేక, కక్కాలేక తలెత్తుకోని తిరగలేక కుళ్లి కుళ్లి యేడస్తావుంటే వచ్చిన పని అయిపోయినట్టు పరారయి పోతాడు. మళ్లా ఆ అప్పులు తీర్చుకోని గడ్డకొచ్చేదానికి తాతముత్తాతలు దిగొస్తారు. ఆకాడికి మళ్లా వచ్చేస్తాడు '' ప్రొద్దున్నుంచీ దాచిపెట్టుకున్న యేడుపు జాలి చూపెట్టే ప్రాణి కనిపించేసరికి పెల్లుబుకుతోంది.

''సరే, నేనువెళ్లి పిల్లలకయినా అన్నం పంపమని చెబుతాను మా అమ్మతో . '' అంటూ వెనుదిరిగి బయటికి రాబోయాను.

''ఈ పూటకు పెడతారు, మాపిటికి పెడతారు. దినమూ పెడతారా? మా రెక్కల కష్టం మేం తినేదానికే దోవా తెన్నూ లేదు. పోతా పోతా వూరికా పోకుండా కొమ్మలించేసి పోయే దెయ్యం మాదిరిగా పోతాడు. అప్పులు కట్టలేక మామపడే బాధ లెవురికి తెలస్తాది ? వీదిలో తలెత్తుకోని తిరగలేకుండా మూర్ఛరోజులవాడు పోయినాడు చంద్రం. ఏడికి పోయినాడు, యేమో, అయిపు లేదు. బయటికిపోతే యేం చేస్తాడో యేం పాడోనని బయటికి పోకుండా, ఆకిలనయినా చెప్పకుండా వుండజాట్టుకోని పోతావుండారు ఈ పసికందులు. ఎందుకో మాకీ శిక్ష ?.. ''

వెనుదిరిగి ఆమె ముఖం చూసే సాహసం కలగలేదు.

అమ్మతోచెప్పి పిల్లలతోబాటూ ఆమెకూ అన్నం పంపించాను.

ఆరోజు రాత్రంతా సరిగ్గా నిద్రపట్టలేదు. ఏం చేశారని ఆ కుటుంబానికి ఆ శిక్ష? అర్థరాత్రి వరకూ మగత నిద్రయినా పట్టింది. అప్పుడు హఠాత్తుగా ఆమె ఆత్మహత్య చేసుకుంటుందేమో నన్న అనుమానం వచ్చింది. తాళ్లు . తాళ్లు ఒకటా రెండా...చాలాసామాన్లు వున్నాయి ఆగదిలో . చావాలని అనుకుంటే కావలసిన పరికరాలన్నీ అందుబాటులో వున్నట్టే లెక్క. ఆ ఆలోచన వచ్చిన తరువాత మగత నిద్రయినా నన్ను కనికరించలేదు. తెల్లవారు జామున యెప్పుడో ఆదమరచి నిద్రపోయాను.

నిద్ర లేచిన తరువాత మొహం కడుక్కుంటూ వుండగా కాలుతున్న కడుపులో పాలు పోసినట్టుగా తాజా వార్తను మోసు కొచ్చాడు మూర్తి. శంకరయ్య, చంద్రం—యింకా ముగ్గురు నలుగురు కలిసి యిక యిలా కుదరదని నర్సింహులు చేతులూ, కాళ్లూ కట్టి రైల్లో పడేశారట! చంద్రం మాత్రం టికెట్లుకొని రైలెక్కాడు. వెళ్లి మదరాసు సెంట్రల్ స్టేషన్లో తోసిపారేసి తిరిగొస్తాడట!

రాత్రంతా నిద్రలేక పోవడంవల్ల కలిగిన చీకాకంతా వొక్కసారిగా తీసిపారేసినట్టయింది. హాయిగా నిట్టూర్చాను.

వారం రోజులు గడచాయి.

పోతూ పోతూ నర్సింహులు చేసిపోయిన అప్పులన్నీ మెల్లమెల్లగా తీర్చుకుంటానని మొరబెట్టుకుని అందరినీ వొప్పించాడు శంకరయ్య.

చంద్రం గూడా వీధిలో ధైర్యంగా తలెత్తుకుని తిరుగుతున్నాడు.

అన్నబిడ్డలిద్దరూ అంగరక్షకుల్లా దిగంబరంగా తనవెంట తిరుగుతూ వుండగా బుజ్జిగాడు గూడా వీధిలోనే గోలీలాడు కుంటున్నాడు.

నెల రోజులు గడచాయి.

ఒకనాడు నేను, భాషా, మూర్తీ, మా యింటిలో మేడమీది గదిలో కూర్చుని పేకాడుకుంటున్నాం.

ఉన్నట్టుండి కిటికీలోంచి తొంగిచూసి ''వచ్చేశాడు'' అన్నాడు మూర్తి ఆనందంగా.

''అవునవును...మళ్లీ వచ్చేశాడు . ఇక కాలక్షేపానికి కొదవే లేదు'' అంటూ కేకేశాడు భాషా.

నేనూ తొంగి చూశాను.

ఉన్నట్టుండి భయంతో కంపించిపోయాను.

నా కళ్ల కెదురుగా కుళ్లిన ఆకులమధ్య దుర్వాసనలో గోలీ లాడుకుంటున్న బుజ్జిగాడు కనిపిస్తున్నాడు. మానవుడికి కావలసిన ప్రాథమిక అవసరం — స్వేచ్ఛను కూడా కోల్పోయి, కన్నబిడ్డలకు వేళకింత తిండయినా పెట్టలేక యేడుస్తూ కూచున్న నిస్సహాయురాలు యెందుకీ శిక్షని ప్రశ్నిస్తోంది. ఊళ్లో తలెత్తుకుని తిరగలేక పలాయనం చిత్తగించిన చంద్రం కనిపిస్తున్నాడు. పరిస్థితులు స్థాణువుల్లా తయారుచేసిన తల్లిదండ్రులు కనిపిస్తున్నారు.

అవును ... వచ్చేశాడు.

నర్సింహులు మళ్లీ వచ్చేశాడు.

---

# నా లో నీ వు...

### సా రా

నా యెదలోతులు తడిమిన
  నీవు
గుర్తుకు వచ్చినపుడు,
గుండె లయ తప్పడం, నీరవడం.
ఈక్షణం ...
భవిష్యత్తుకు తావులేని వర్తమానం
వర్తమానం నిండా ఆవరించిన గతం
ఆ గతంలో నీవు నేను ...
నేను
నా హృదయంలో
గత అనుభవాలు
దాగిన చోటు వెదుక్కొంటూ...!



# మృత్యు సూక్తం

శ్రీ జి. ఉమాపతి

దేహానికి తృప్తి లేదు;
 మనసా, మనమాట వినదు;
ఆత్మంటావా, కనబడిచావదు;
ఏముందీ జీవితంలో! కోర్కెల కంపు తప్ప!
బ్రతుకంటే నిర్వచనం భ్రాంతుల తోరణమేగా!

దాచికొట్టే జ్ఞాపకాలూ,
చలే మేలనిపించే గతస్మృతులూ,
చెవ చావని మధురోహలూ,
మొదలంట నఱికినా
మొలుచుకొచ్చే వాంఛలూ,
పొమ్మన్నా పోవుగదా, పోనేపోవు.

నేను ఆడలేను బాబూ!
 ప్రకృతితో యీ దాగుడుమూతలాట!
నేను వేయలేను బాబూ!
 కాలంపాడే వికృత గీతానికి తాళం!
నేను చూడలేను బాబూ!
 ఆధునిక నాగరికతా పైశాచికనృత్యం!

నీకంటే ముదుసలి నీవే!
నిన్ను తెలియని వారు లేరు;
నిన్ను చూచినవారు లేరు.

ఇన్ని శకాలుగ, ఇన్ని యుగాలుగ,
ఈ చీకటి గుయ్యారంలో
త్రుళ్ళిపడే జీవులను,
సంకల్ప వికల్పాల మధ్య
గుడుసుళ్ళుపడే ప్రాణులను
ఆ నక్షత్రాల ప్రహరీగోడ దాటించి
ఏ స్వాప్నిక సీమలకు నిర్విరామంగ చేరవేస్తున్నదో,
ఆ నీ అదృశ్యహస్త స్పర్శకోసం;
ఈ మట్టిబెడ్డను మంచుముక్కలా
గడ్డకట్టించే సుముహూర్తంకోసం
ఉవ్విళ్ళూరుతున్నా డీజీవుడు.

తొందరిస్తున్నా నంటావా నేస్తం!
నీకోసం నిరీక్షిస్తూ,
నీలోకపు కాంతులకోసం,
కళ్ళు తెరచే కలలు కంటూ;
ఈ లోకానికి పెడమొగమై
నాలోకే చూచుకుంటూ,
నిర్భయంగ, నిర్వికారంగ
శేషజీవితం గడిపేస్తా!

మృత్యుశక్తీ! నీ కెల్లప్పుడు సుస్వాగతం!
శూన్యమూర్తీ! నీ కిదే నా ఆహ్వానం!



కీ. శే. వేలూరి శివరామశాస్త్రి

# అక్షర తత్త్వము - బ్రహ్మము

ఉపనిషత్తులును బ్రహ్మసూత్రములును పరమాత్మనే అక్షరుని గను బ్రహ్మమునుగను చెప్పును. గీతలలో ఈ విషయమున రెండు విరుద్ధ మతములు **చూ**పట్టును.

గీతాకారుఁడు ఉపనిషదాదుల మత**ము**ను **గూ**డఁ గైకొనెను. కాని అతఁడు కొన్ని కొన్ని చోటుల అక్షరునకును బ్రహ్మమునకును రెండవ స్థాన మిచ్చెను. గీతాకారుని మతము నీ దిగువఁ గనుఁ గొందము.

## అక్షర

ఎనిమిదవ అధ్యాయమున అక్షరతత్త్వము చెప్పఁబడినది. ఈ దిగువ ఈ తత్త్వమును విడఁబఱచుచున్నాను.

(క) ''అక్షరం బ్రహ్మ పరమమ్''—అని **మూ**డవశ్లోకము. అక్షరము పరబ్రహ్మము (అనగా ఈ రెండును ఒకటి).

నశించు స్వభావము కలదిగాని మాఱు స్వభావము కలదిగాని క్షరమనఁబడును. క్షరముకాని దక్షరము అక్షరమనగా అవ్యయము, అవినాశి. (మాఱనిది, నశింపనిది).

(ఖ) పదునొకటవ శ్లోకము అక్షర పరము. ఈ శ్లోకము తెలిసికొనుటకు దీని వెనుకటి మూఁడు శ్లోకములును తెలిసికొన వలసి యుండును. ఇవి :

యోగయుక్తమును చెదరనిదియును అగు మనస్సుచే ధ్యానించుచు పరమ పురుషుని పొందును. (పరమం పురుషం దివ్యమ్) (౮–౮)

చీకటి కావలనున్న వానిని సూర్యప్రకాశుని అచింత్యరూపుని జగచ్ఛాసకుని అణువుకంటె అణువైన వానిని కర్మఫల జాతమును విధించువానిని పురాణుని సర్వజ్ఞుని ఎవడు స్మరించునో, అతఁడు పరమ పురుషుని పొందును. (౯)

'ఎవఁడు ప్రయాణకాలమునందు చలింపనిచిత్తముతో భక్తి కలిగి యోగబలముచే కనుబొమల నడుమ ప్రాణమును లెస్సగా చొప్పించునో అతఁడు ఆ పరమ పురుషుని పొందును.' (పరమం పురుష ముపైతి దివ్యమ్). (౧౦)

ఈ **మూ**డు శ్లోకములలోను పరమపురుషుని సంగతి కలదు. ఈ పరమ పురుషుని కంటె దొడ్డవాడింకొకఁడు లేఁడని చెప్పఁబని లేదు.

(గ) వీని పై శ్లోకమే అక్షరవిషయమును చెప్పు శ్లోకము. దానికి తెలుఁగిది :

వేదవేత్తలు దేనిని అక్షరమని యందురో, వీతరాగులగు సన్యాసు లెందు జొత్తురో, దేనినికోరుచు (బ్రహ్మచారులు) బ్రహ్మచర్యము నడపుదురో, ఆ పదమును నీకు నేను సంక్షేపముగా చెప్పుదును. (౧౧)

ఎనిమిది తొమ్మిది పదవ శ్లోకములలో ఏది చెప్పఁబడె**నో** పదునొకండవ శ్లోకమునఁ **గూ**డ అదియే చెప్పఁబడెను. వెనుకటి మూఁడు శ్లోకములలోని పరమ పురుషుఁడే పదునొకండవ శ్లోకము నందలి అక్షరుఁడు.

వేదవేత్తలు దేనిని అక్షరమని అందురు ? యతు లెందు జొత్తురు? బ్రహ్మచారులెవని గూర్చి బ్రహ్మచర్యము నడుపుదురు? అతఁడెవఁడు? పరమ పురుషుఁడు కాక మఱెవరు? అతనికన్న దొడ్డ వాఁడింకొకఁ డెవడు? కావున ఈ పరమ పురుషుఁడు అక్షరుఁడు.

(ఘ) **ఈ** పరమ పురుషుని పొందుటకు యోగధారణ ఒక ఉపాయము. పండ్రెండవ శ్లోకమున ఈ విషయముకలదు. దానిపై శ్లోక మిది :

బ్రహ్మమును చెప్పు 'ఓమ్' అను అక్షరమును ఉచ్చరించుచు నన్ను స్మరించుచు దేహమును విడుచువాఁడు పరమగతిని పొందును. (౮–౧౩)

ఇచట శ్రీకృష్ణుఁడు వక్త. తాను పరమాత్మగా పై ఉపదేశము లొనరించెను. కావున మరణ సమయమున ఎవఁడు 'ఓమ్' అనుచు పరమాత్మను స్మరించునో అతఁడు పరమగతిని పొందునని పదమూడవ శ్లోకమునఁ జెప్పఁబడినది.

'నే నక్షరప్రాప్తి కుపాయము తెలిపెద' నని పదునొకండవ శ్లోకమున భగవంతుఁ డనెను. అటు పిమ్మట రెండు శ్లోకముల**లో** పరమాత్మనుపొందు నుపాయము చెప్పఁబడెను. కావున పరమాత్మయే అక్షరుఁడని స్పష్టము.

అటుపై **మూ**డు శ్లోకములు :

''అనన్యచిత్తులై యెపుడును ఎవరు నన్నుఁ దలతురో నిత్యయుక్తులగు ఆ యోగులకు నేను సులభుఁడను.''

''మహాత్ములు నన్ను పొంది పరమసిద్ధిని పొందుదురు. వారు మరల దుఃఖపూర్ణ**ము**ను అశాశ్వతమునగు జన్మ పొందరు.''

"బ్రహ్మలోకము వఱకునుగల లోకము లన్నియు పునరావృత్తిని చెందును. ఓయి కౌంతేయా! నన్ను పడయుచో మఱి పుట్టువు ఉండదు."

పదునొకండవ శ్లోకమున దేనికి'అక్షరము'అని నామకరణము చేయఁబడెనో పదవటి మూఁడు శ్లోకము లందును దానిని పొందుటను గూర్చియే చెప్పఁబడెను. ఎవనిని పొందుచో మరల జన్మ ముండదో (౮–౧౪,౧౫) అతఁడే పరమాత్మ–పరమ పురుషుఁడు. అతఁడే అక్షరుఁడు.

(జ) పదునేడు పదునెనిమిది పందొమ్మిది శ్లోకములందు బ్రహ్మము యొక్క దినమును, రాత్రిని గుఱించియు, సృష్టిని ప్రళయమును గుఱించియు తెలుపఁబడెను. ప్రళయ కాలమున సమస్తమును అవ్యక్తమున లీనమగును. ఈ అవ్యక్తము ప్రకృతికే మఱొక పేరు. పై శ్లోక మిది :

'ఈ అవ్యక్తము కంటె దొడ్డదగు ఏ మఱొక అవ్యక్త సనాతన భావము కలదో అది ఈ భూతము లన్నియు నశించినను నశింపదు.' (౮ – ౨౦)

'ఈ అవ్యక్తమే అక్షరము. దానినే పరమగతి యందురు. దానిని పొందుచో తిరిగి జన్మలేదు. అదియే నా పరమ ధామము.' (౮ – ౨౧)

అక్షరప్రాప్తి కలుగుచో పునరావృత్తి లేదు కావున అక్షరుఁడే పరమాత్మ.

పదునొకండవ శ్లోకమునఁగల అక్షరుఁడే ఈ శ్లోకమునఁగల అక్షరుఁడును. ఈ అక్షరుఁడే పరమగతి. కావున అక్షరుని కంటె పైమెట్టులేదు.

ఈ ప్రసంగమునందే ఈ వయి శ్లోకమున పర పురుషుని ప్రశంస కలదు : 'ఓ పార్థా! భూతము లన్నియు ఎవరిలో నున్నవో, ఎవనిచే నిదియంతయునిండెనో ఆ పరపురుషుఁడు (పురుషః పరః) అనన్య భక్తిచేతనే పొందఁదగినవాఁడు. (౨)

ఇచటగూడ అక్షరు నుపలక్షించియే పరపురుష పదము వ్యవహరింపఁబడినది. ఈయధ్యాయమున ఈ శ్లోకముతోడనే అక్షర తత్త్వము ముగింపఁబడెను. దీని నాలోచింపగా ఈ సిద్ధాంతము లేర్పడును :

౧. అక్షరుని పొందుచో తిరిగి పుట్టుక లేదు.

౨. అక్షరుఁడే పరమగతి.

౩. అక్షరుఁడే పరబ్రహ్మము, పరపురుషుఁడు.

# అ క్ష ర త త్త్వ ము - ౨

౧౧వ అధ్యాయమున అక్షర విషయమున రెండు శ్లోకము లున్నవి. అర్జునుఁడు కృష్ణరూపియగు భగవంతుని ఇటులు మొదటి శ్లోకముచే సంబోధించుచున్నాఁడు– 'తెలిసికొనఁదగిన పరమాక్షరుఁడవు నీవు; నీవు ఈ జగతి కాశ్రయుఁడవు; నీవు అవ్యయుఁడవు; నిత్యమగు ధర్మమునకు రక్షకుఁడవు; నీవు సనాతనుఁడవగు పురుషుడవని నా అభిప్రాయము. (౧౮)

'ఎవఁడు పరమాత్మయో అతఁడే అక్షరుఁడు.'

ఈ అధ్యాయమునందే ౩౭వ శ్లోకమున – 'ఓ యనంతా! ఓ దేవేశా! ఓ జగన్నివాసా! నీవు సదసత్తులకు పరుఁడవగు అక్షరుఁడవు.'

సత్=వ్యక్తము, అసత్=అవ్యక్తము. అక్షరుఁడు సత్తు కంటెను అసత్తు కంటెను శ్రేష్ఠుఁడు. కావున ఈ అక్షరుఁడే పరమాత్మ.

## 3

౧౨ వ అధ్యాయమున అక్షరోపాసన చెప్పఁబడినది. అర్జునుడు కృష్ణు నిటు లడిగెను– 'సతతయుక్తులగు భక్తులు నిన్నుపాసింతురు. మఱొక రకపు సాధకులు అవ్యక్తబ్రహ్మము నుపాసింతురు. ఈ యిరువురలో ఎవరు దొడ్డవారు?' (౧౨–౧)

కృష్ణు డిటులు ప్రత్యుత్తరించెను –

'నాయందు మనస్సును చొప్పించి నిత్యయుక్తులై మిగుల శ్రద్ధతో ఎవరు నన్ను ఉపాసింతురో వారు యుక్తతములు.'అని నా అభిప్రాయము. (౨)

అయినను, ఎవరు సమబుద్ధికలవారై ఇంద్రియముల వరికట్టి సర్వ భూతములందును రతులైయుండి అనిర్దేశ్యుదును, అవ్యక్తుఁడును, సర్వత్రగుఁడును, అచింత్యుఁడును, కూటస్థుఁడును అచలుఁడును, ధ్రువుఁడును,అగు అక్షరు నుపాసింతురో వారు నన్నే పొందుదురు. (౧౨–౩, ౪)

ఆ అవ్యక్తము నెడల ఆసక్తిగొన్నవారికి కష్టము మెండు. ఏలనఁగా మిగుల కష్టపడియే అవ్యక్తమును పొందఁజెల్లును. (౫)

అక్షరుఁడే ఇచట అనిర్దేశ్యుఁడు ఇత్యాదిగా చెప్పఁబడియె. ఈ విశేషణము లన్నియు పరమాత్మకుఁ గాని, పరబ్రహ్మమునకుఁ గాని చెల్లునుగాన అక్షరుఁడే పరమాత్మ యనియు, పరబ్రహ్మమనియు నిర్వివాదముః

కొన్ని శ్లోకములలో జ్ఞాన యోగముతో భక్తియోగము తావేజా వేయఁబడెను. జ్ఞానయోగమున కష్టము మెండు. కాని భక్తియోగము సహజమార్గము. భక్తిమార్గము అవలంబించువారి లక్ష్యము సగుణబ్రహ్మము. జ్ఞానమార్గము వారి లక్ష్యము అక్షర బ్రహ్మము. భక్తి మార్గము సహజమార్గ మగుచో కావచ్చునుగాని 'నిర్గుణ బ్రహ్మము కంటె సగుణ బ్రహ్మము శ్రేష్ఠము' అని సిద్ధాంతము చేయఁదగిన విషయ మిచట నేమియులేదు. ఇంతియ

కాక ఈ రెండును ఒకటి యనియే యిచట కలదు. ''ఎవ రక్షర మునుపాసింతురో వారు నన్నే పొందుదురు''రని కృష్ణరూపియగు భగవంతుఁడనును. అక్షరోపాసన చేయుచో భగవల్లబ్ధియగు ననఁగా అక్షరుఁడును భగవంతుఁడును ఒకటియే కదా! 'ఎవ రెవరి నుపాసింతురో వారు వారినే పొందుదురు.' అను మత మొకటి గీతలలో విశేషము. 'దేవతలను పూజించువారు దేవతలనే పొందుదురు, నన్ను భజించువారు నన్నే పొందుదురు.' (౭.౨౩) అని కృష్ణుఁడనును. మఱొకచో 'దేవతల నారాధించువారు దేవతలను, భూతములఁ గొలుచువారు భూతములను, పితరులఁ బూజించువారు పితరులను, నన్నుభజించువారు నన్నును పొందుదురు.'(౯—౨౫)అని యనును. కావున 'అక్షరోపాసకులు భగవంతుని పొందుదురు' (౧౨-౩, ౪) అని యనుచో అక్షరుఁడును భగవంతుఁడును ఒకటి అయినట్లేకదా!

అచట నచటఁగల అక్షర విషయమును చర్చచేసి ''ఎవఁడక్షరుఁడో ఆతఁడే పరమాత్మ, అతఁడే పరబ్రహ్మము''ను సిద్ధాంతము నకు వత్తుము.

## అక్షరునకు క్రింద మెట్టు

౧౫ వ అధ్యాయమున మూఁడు శ్లోకములలో అక్షరునకు క్రిందమెట్టు ఈయఁబడినది

'లోకమునందు క్షరుఁడనియు. అక్షరుఁడనియు ఇరువురు పురుషులు కలరు. భూతములన్నియు క్షరుఁడు. కూటస్థుఁడు అక్షరుఁడు.' (౧౫—౧౬)

'ఉత్తమపురుషుఁడని మఱియొకఁడు కలఁడు. అతఁడు పరమాత్మ. అతఁడవ్యయుఁ డీశ్వరుఁడు. అతఁడు లోపల ఉండి లోకత్రయమును భరించును.' — (౧౭)

'నేను క్షరున కతీతుఁడ నగుటవలనను అక్షరునికంటెను ఉత్తముఁడవగుటవలనను లోకమునందుమ వేదమువందును పురుషోత్తముఁడనాఁబరఁగుదును.' (౧౮)

ఈయంశ మద్వైదాంతికము. అటులయ్యును ఇది గీత కంగీభూతము. వ్యాఖ్యాతలు దీనికి వేదాంతపరముగా వ్యాఖ్యానము చేయఁబోయి దీనిని దుర్బోధము చేసివైచిరి. ఈ మూఁడు శ్లోకముల అర్థమునుగూర్చి నా యుద్దేశ్యమిది :—

౧ ఏది నశించునో ఏది మాఱునో అదియే క్షరము. జడ ప్రకృతిని క్షరమననగును. అదియే ఇచటి క్షరము. వేదాంతము నందును, సాంఖ్యమునందును, గీతలలో నచటనచటను పురుషుఁడు అక్షరుఁడని కలదు అక్షరుఁడనఁగా నశింపనివాఁడు మార్పు చెందనివాఁడు. ఇఁక ఇచటి విశేషమేమనఁగా క్షరపురుషుఁడు. (క్షరము క్షరపురుషుఁడుగా వాడఁబడెను.

౨ కూటస్థుఁడు అక్షరుఁడని చెప్పఁబడెను. కూటశబ్దమున నకు పెక్కర్థములు కలవు.

(క) కూట=కొండ, శిఖరము, అన్నిటికంటె శ్రేష్ఠమగు స్థానము. స్థావము. కావున శిఖరమువలె అచలమును, స్థావము వలె స్థిరమయినదియును అని కూటశబ్దమునకు తాత్పర్యము.

గీతలలో మఱి రెండుచోట్ల కూటస్థశబ్ద ముపయోగింప బడినది. 'యుక్తుఁడగు యోగి కూటస్థుఁడు.' అని (౬—౮) శ్లోకమున గలదు.

౧౨—౩ శ్లోకమున అక్షరుఁడు కూటస్థుఁడని కలదు. ఈ రెండు చోటులను కూటస్థుఁడనఁగా 'అచలుఁడు.'

అచలమును నిర్వికారమును స్థిరమును అగు వస్తువు కూటస్థము—అని పాళీ గ్రంథములందు కలదు. (దీఘ—౧—౧౪—౧—౨౬ చూ); మజ్ఝిమ్ ౧—౨౧౭; సంయుక్త ౩—౨౧౧ (ఇంగ్లండ్ సంస్కరణ) టీకాకారులును అనువాదకులును శిఖరము వలె అచలము అని అర్థము చెప్పిరి

(ఖ) కూట=మాయ, వంచన, జిహ్మత, కుటిలత; అని శంకరాచార్యులవారర్థము చెప్పిరి. కాఁగా ఎవఁడు మాయ యందుండెనో, మాయ యెవని యుపాధియో, లేక ఎవఁడు మాయ కీశ్వరుఁడో అతఁడే కూటస్థుఁడు.

గీతలలో ఇతరేతరాంశములందు 'అక్షరబ్రహ్మ పరబ్రహ్మ పరమాత్మ పరమపురుష' ఈ మొదలగునవి ఏకార్థ సూచకములు. ఈపదములలో అర్థమునెడల పార్థక్యము చూపఁబడలేదు. కూటస్థ


ఆంధ్రగ్రంథమాల ప్రచురణలు

పండితారాధ్య చరిత్ర

డాక్టరు తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు వ్రాసిన పీఠికతో అమ్మకానికి సిద్ధంగావుంది. వెల రు. 15-00

ఆంధ్రపత్రిక ఏజెంట్లద్వారా కూడా తెప్పించుకోవచ్చు.

.......... ప్రతులకు ..........

మేనేజరు

ఆంధ్రపత్రిక, గాంధీనగర్,

విజయవాడ-3.

శబ్దమునకు తొలియర్థము చెప్పచో అక్షరుఁడు పరమాత్మ పరమ పురుషుడు—అని అర్థము చెప్పవలయును. అటులగుచో ఇతనికన్న వేఱు పురుషోత్తముని కల్పనచేయుట అనర్థకమగును కాని గీతలలో పురుషోత్తముఁడను మూడవ పురుషుఁడొకఁడు కల్పింపఁబడెను. (౧౫–౧౮) అసలు కూటస్థుఁడగు అక్షరుఁడే పురుషోత్తముఁడు. గీతలలో అక్షరుని క్రింది మెట్టునకు దింపి క్రొత్త పురుషోత్తమ వాదమును లేవనెత్తుటకు కారణవిశేషము కలదు.

కూటస్థ శబ్దమునకు రెండవ యర్థము గ్రహించుచో అన్ని అంశములకును అర్థసంగతి కలుగును. కూటస్థుఁడు మాయా యుక్తుఁడగు ఈశ్వరుఁడగునెడల, పురుషోత్తముఁడు మాయాతీతమగు తురీయబ్రహ్మమగును. కాని ఇట్టి యర్థము అప్రచలితము.

3 పదునెనిమిదవ శ్లోకమున 'నేను వేదమునందును పురుషోత్తముఁడనాఁబరగుదును.' అని కృష్ణుఁడనుట సరికాదు. ఏ వేదమునఁగాని ఏ శాఖయందుఁగాని ఈ మాట లేదు. ప్రధానములును ప్రాచీనములును అగు ఉపనిషత్తులు పంద్రెండు. వీనిలో నెచటను పరమాత్మగాని మఱొకరుగాని పురుషోత్తముఁడని చెప్పఁబడలేదు. 'పురుషోత్తమ' శబ్దమే లేదు.

''ఉత్తమః పురుషః'' — అని ఛాందోగ్యమునందొకట గలదు. కాని ఆ ఉత్తమ పురుషుఁడు పరమాత్మ కాడు. శరీరియగు ఆత్మ దేహమునుండి లేచి పరమజ్యోతిగా నగునెడల నతఁడుత్తమ పురుషుఁడగునని అచట చెప్పఁబడినది.

ఇఁక ప్రకృతము — పురుషోత్తముఁడనునది శ్రీకృష్ణున కొక విశేష నామధేయము. వైష్ణవ సంప్రదాయమునందీపేరునకు చాల ప్రసిద్ధి కలదు. పురుషోత్తముఁడనఁగనే శ్రీకృష్ణుఁడు గోవిందుఁడు వాసుదేవుఁడు—అని ఈ మొదలుగా వైష్ణవు లెఱుగుదురు. వైష్ణవ గ్రంథములలో దీనికి బహుళప్రచారము కలదు. వైష్ణవపురాణములందును తత్సాంప్రదాయికములగు ఉపనిషత్తు లందును ఈ పదమునకు వ్యవహారము చూపట్టును.

గీతలయందలి 'పురుషోత్తమ వాదము' ఒక వైష్ణవ మతము; ఇది వేదాంతములకుఅనఁగా ఉపనిషత్తులకు సంబంధించిన మతముకాదు.

## క్షరాక్షర వాదము

మహాభారతమున కొన్ని శ్లోకములలో క్షరాక్షరతత్త్వము కలదు —

''అక్షరం చ అక్షరం చైవ ద్వైధీభావోఽయ మాత్మనః
క్షర స్సర్వేషు భూతేషు దివి హ్యమృత మక్షరమ్''
(౨౩౮–౩౧)

క్షరమనియు అక్షరమనియు ఆత్మ ఇరుదెఱఁగులు. భూతము లందు క్షరము — దివ్యలోకమునఁ దక్షరము.

'నవద్వారం పురం గత్వా హంసోహి నియతో వశీ,
ఈశ స్సర్వస్య భూతస్య స్థావరస్య చరస్య చ' —

ఎవఁడు చరా చరములకు ప్రభువో, అచలుఁడో, వశియో అతఁడు తొమ్మిది గుమ్మములుగల నగరుచొచ్చి, అనఁగా మానవ దేహమున ప్రవేశించి హంసయను పేరు తాల్చును.

అజుఁడగు పరమేశ్వరుఁడేల హంస యని పేరు తాల్చెనో ఆ విషయము వర్ణింపబడినందువలన పదపటి శ్లోక ముదాహరింపఁ బడలేదు — దాని పై శ్లోకము :

''హంసోక్తం చాక్షరం చైవ కూటస్థం యత్త దక్షరమ్
తద్విద్యానక్షరం ప్రాప్య జహాతి ప్రాణ జన్మనీ''
(౨౩౮–౩౪)

ఎవఁడు హంస యనబడు అక్షరుఁడో అతఁడే కూటస్థుఁడగు అక్షరుఁడు. జ్ఞానవంతుఁడీ యక్షరుని బడసి ప్రాణజన్మములను ఉత్తరించును.

ఇచట కూటస్థుఁడు, అక్షరుఁడు, పరమాత్మయు నొక్కఁడే. ఈ యద్వైతవాద మౌపనిషదమే. ఈ మతమే లోగడ ప్రచార ములోనున్నది. ఈ మొదటి శ్లోకమే గీతలలో కొలది మార్పులతో నున్నది. క్షరాక్షర తత్త్వపుమార్పు మాత్రము దొడ్డది. శాంతి పర్వమునందలి క్షరాక్షర తత్త్వము అద్వైత తత్త్వము. ఇచ్చోట గీతలలో త్రిత్వావాదము నెలకొల్పఁబడినది. ఈ యంశమున క్షరాక్షర పురుషోత్తమ తత్త్వములు మూడును మూడు తత్త్వములు.

అసలు గీతలలో ఈ యంశము లేదని నేనూహింతును. ప్రాచీనకాలమునందే తమ సంప్రదాయమున కనుకూలముగా ఏ వైష్ణవుఁడో దీనిని ప్రవేశపెట్టియుండును. ఇందుకొఱకు చాల చోటుల క్రొత్త శ్లోకములఁగూడఁ గూర్పవలసి వచ్చెను. క్షరాక్షర సంక్రాంత శ్లోక సమూహ మీరకము లోనిదే ! వైష్ణవమత ప్రచా రముకొఱకవి ప్రక్షిప్తములయినవి. క్షరుఁడేకాక కూటస్థుఁడగు అక్షరుఁడుగూడ పురుషోత్తమునకు క్రింద నిలువఁబెట్టఁబడెను. అనఁగా వైష్ణవుల పురుషోత్తముఁడు ఔపనిషదమైన బ్రహ్మము కన్న దొడ్డ. ఈ యంశము ఎవరో యిందు కూర్చిరనుచో గీతల మూలమతమునకు వ్యత్యయము కలుగదు. ఈ యంశము తీసి వేయుచో గీత అంగహీనము కాదు. గీతలలోని ఏ ఇతర మతము నకును ఇది ఆధారముకాదు. గీతలలో మఱి యెచటఁగాని దీని కను రూపమగు మతములేదు. పైఁగా దీనికి విరుద్ధమగు మతములే ఉన్నవి. మఱియు దీని వెనుకటి శ్లోకములకును దీనికిని ఎట్టి సంపర్కములేదు. కావున ఈ యంశము ప్రక్షిప్తమని సిద్ధాంతము చేయవచ్చును.

## బ్రహ్మ తత్త్వము

ఆత్మతత్త్వము అక్షరతత్త్వమును ఆలోచించిన పిదప, బ్రహ్మతత్త్వమును గుఱించి యాలోచింపవలసిన పని యుండదు. ఏలనఁగా ఆత్మయు అక్షరుఁడును బ్రహ్మమును ఏకమే. కాని గీతలలో బ్రహ్మతత్త్వమునెడ మతభేదమున్నది. దానఁజేసియే విడిగా ఈ తత్త్వము విచారింపఁబడుచున్నది. బ్రహ్మ విషయమున ముఖ్యాంశము లివి :

"దేని దెలియుచో మోక్షము లభించునో దేని తెలిసికొన వలెనో దానిని గూర్చి చెప్పెదను. దానికి మొదలు లేదు. అది పర బ్రహ్మము; అది సత్తుకాదు. (సత్తనఁగా దేశకాలములందు వ్యక్త మగు వస్తువు) అసత్తునుకాదు. (అస్తిత్వము లేనిది–౧౩–౧౩)

"దాని కెట జూచినను కాలుసేతులు చెవులు కన్నులు మోము తలలు కలవు. అది యెల్లయు ఆవరించి లోకమధ్యమున నున్నది." (౧౩–౧౪)

"దానికి అన్ని యింద్రియ ధర్మముల ఆభాసము కలదు. అయినను అది సకలేంద్రియ వివర్జితము. అది అసక్తము, అన్ని టిని భరించును, అది నిర్గుణము, అయినను గుణములను భోగించును." (౧౩–౧౫)

"అది భూతముల లోపలను బయటను గలదు. అది అచర మును చరమును. అతి సూక్ష్మమగుటజేసి తెలియరానిది. అది దవ్వు లను దాపులను గలదు." (౧౩–౧౬)

"అది భూత గణముల నడుమ అవిభక్తముగా నున్నను విభక్తముగా నున్నటులు కన్పట్టును. తెలియఁదగిన ఆ వస్తువు భూతములను ఏలును; తినును. మఱియు దాని స్వభావము పుట్టుట." (౧౭)

ఇందలి ౧౪ వ శ్లోకము శ్వేతాశ్వతరమునుండి తీసికొన బడినది. (౩–౧౬) బ్రహ్మములేక పరమాత్మ దాని యుద్దేశ్యము. మహాభారతమున పలుతావుల ఇది గైకొనఁబడియె ననుచో భారత కర్త కది యెంత ప్రియమో గ్రహింపనగును. (చూ. శాంతి ౨౩౯–౨౯; ౩౧౨–౧౪; అను ౧౪–౪౧౯, ౪౧౬; అశ్వ ౪౦–౪ ఇత్యాది)

ఈపైని ౧౩, ౧౪ శ్లోకముల పూర్వార్ధములు గూడ శ్వేతాశ్వతరమునుండియే గైకొనఁబడినవి. (౩–౧౭)

ఈ పై నుదహరింపఁబడిన శ్లోకములు మిగుల ఉపాదేయములు. వీనిలో విశుద్ధ బ్రహ్మవాదమే కలదు. ఈ బ్రహ్మమే పరమసత్తు. దీనికంటె దొడ్డది మఱియొకటి ఉండబోదు.

## బ్రహ్మమే లక్ష్యము

చాల చోటులలో బ్రహ్మమే లక్ష్యమని కలదు. కొన్నిచోట్లు:

(క) యోగయుక్తుఁడగు ముని ఆలస్యములేక బ్రహ్మమును పొందును. (బహ్మ న చిరే ణాధి గచ్ఛతి) ౫–౬

(ఖ) 'చచ్చిన పిదప కొందరు దక్షిణాయన మార్గమునను, కొంతఱుత్తరాయణ మార్గమునను పోదురు. ఉత్తరాయణమే దొడ్డ బాట. ఈ బాటను వెళ్లువారికి మఱి పుట్టుకలేదు. ఆ మార్గమున అనఁగా ఉత్తరాయణ మార్గమున వెళ్లుచో బ్రహ్మవేదులు బ్రహ్మము నొందుదురు'. ౮–౨౪.

(గ) సిద్ధిపొందుట యనఁగా బ్రహ్మమును పొందుటయని. (బ్రహ్మ ఆప్నోతి) ౧౮–౫౦లో కలదు.

(ఘ) సాధకుఁ డెపుడు భూతముల వేఱిమిని ఒకనియందే చూచునో దానినే భూతముల యుత్పత్తిని చూచునో అపుడతఁడు బ్రహ్మమగును. (బ్రహ్మ సంపద్యతే) [౧౩–౩౦ శేక ౩౧]

'బ్రహ్మ సంపద్యతే' అను వాక్యము చాల ప్రసిద్ధిని సంపాదించుకొనినది. 'బ్రహ్మమగునని' బ్రహ్మలబ్ధి కలుగునని దీని యర్థము. భారతమున పలుతావుల నీ ప్రయోగము కలదు. శాంతి ౨౧–౫; ౨౬–౧౪–౧౫; ౬౬–౩౮; ౨౩౮–౨౧; ౨౬౧–౧౫; ౧౬; ౩౨౫–౩౩ ఈ మొ. చూచునది. బ్రహ్మమే పరమ వస్తువు కాన బ్రహ్మత్వలాభము లక్ష్యరూపముగా చెప్పఁబడెను.

(ఙ) గీతలలో బ్రహ్మభూత శబ్దము ముమ్మాఱు [౫–౨౪; ౬–౨౭, ౧౮–౫౪] బ్రహ్మ భూయ ఇనుమాఱు [౧౪–౨౬; ౧౮–౫౩] బ్రహ్మనిర్వాణ నలుమాఱు [౨–౭౨, ౫–౨౪, ౨౫, ౨౬] బ్రాహ్మీస్థితి ఒకమాఱు [ ౨–౭౨ ] వాడఁబడెను. వీని అన్నిటికిని బ్రహ్మస్వరూప ప్రాప్తి, బ్రహ్మమును జొచ్చి నిర్వాణము పొందుట, బ్రహ్మమునం దునికి గొనుట అని అర్థము. సాధన లన్నింటికిని బ్రహ్మత్వప్రాప్తియే లక్ష్యము దీనియందేసాధనలన్నింటికిని ముగింపు. దీనికంటె వేఱొక దొడ్డయవస్థలేదు. కాఁగా బ్రహ్మముకన్న దొడ్డది మఱియొకటిలేదు. బ్రహ్మమే పరమవస్తువు. కానినే బ్రహ్మత్వ లబ్ధికే ఇన్ని సాధనలును.

## బ్రహ్మము - శ్రీకృష్ణుఁడు

అంతటను బ్రహ్మమునకే ప్రథమస్థాన మీఁబడెను గాని ఒక చోట మాత్రములేదు. –'నేను అమృతమును అవ్యయమును అను బ్రహ్మమునకు పునాదిని. (బ్రహ్మణోహి ప్రతిష్ఠాహమ్) మఱియు నేను శాశ్వత ధర్మమునకును పరమ సుఖమునకును పునాదిని.

౧౪–౨౭

కొందఱీ ప్రథమాంశమున కిటు లర్థము చెప్పుదురు :

'నేను బ్రహ్మమునకును అవ్యయమగు అమృతమునకును అనఁగా మోక్షమునకును పునాదిని.'

ఈ యంశమున శ్రీ కృష్ణుఁడు వక్త. కావున ఇచట కృష్ణుఁడు బ్రహ్మమునకును ఆశ్రయభూమిగ చెప్పఁబడెను. ఎవరో వైష్ణవ పండితుఁడీ శ్లోకమిచట ప్రక్షేపించెనని నేననుకొందును. ఇటులు చెప్పుటకుఁగల కారణము లివి :

(౧) గీతలలో నెచటనేని కృష్ణునికన్న బ్రహ్మము హీనమని చెప్పఁబడి యుండలేదు. పెక్కు తావుల కృష్ణుఁడును తనను బ్రహ్మ స్థానమున నిలువఁబెట్టుకొనెను. ౧౧-౧౪లో కృష్ణుఁడు పరబ్రహ్మముగా చెప్పఁబడెను. అంతియకానికృష్ణుఁడు బ్రహ్మము కన్న మిన్నయని చెప్పఁబడలేదు.

గీతలలో విభిన్న విభక్త్యంతములలో బ్రహ్మశబ్ద మిరువది యెనిమిది మాఱులు ప్రయోగింపఁబడెను. వీనిలో మూఁడుచోట్ల పుంలింగ బ్రహ్మార్థమునను, రెండుచోట్ల వేదమను నర్థమునను, ఒకచోట 'ఓమ్' అను అర్థమునను ప్రయోగింపఁబడినది. ఒకచోట వేదమని చెప్పినను చెప్పవచ్చును లేక బ్రహ్మయని చెప్పినను చెప్ప వచ్చును. మిగిలిన ఇరువదియొక్క చోటులను గల ఈ బ్రహ్మ వేదాంతుల బ్రహ్మము. అనఁగా పరమాత్మ. ఈ స్థలము లన్నియు పరిశీలించుచో బ్రహ్మము కృష్ణునికన్న హీనమని తోఁపదు.

(౨) ప్రకృతాలోచనమునకు విషయమైన శ్లోకమునకు వెనుకనున్న శ్లోకము లివి :

ఎవఁడు చలనములేని భక్తిచే నన్నుఁగొలుచునో, అతఁడు గుణములను దాటి బ్రహ్మత్వమునకు యోగ్యుఁడగును. (బ్రహ్మ భూయాయ కల్పతే) ౧౪-౨౬

ఇచట కృష్ణుఁడే వక్త. కృష్ణుని గొలుచుచో బ్రహ్మత్వము కలుగునని చెప్పినటులయినది. ఇచట కృష్ణునకు బ్రహ్మమునకును ఏకత్వము చెప్పఁబడినదని స్పష్టము.

ఇయ్యెడ లోతుగా పరికించినచో కృష్ణత్వముకన్న బ్రహ్మత్వము మిన్నయని చక్కగా తేలును. బ్రహ్మత్వప్రాప్తియే లక్ష్యమని ఈ శ్లోకము చెప్పును. దీనికుపాయము కృష్ణునెడల భక్తి. లక్ష్యము దొడ్డది. లక్ష్యముకన్న దానిఁ జూపుదారి దొడ్డది కానేరదు.

'కృష్ణుని గొలుచుచో బ్రహ్మముమ బడయనగును' అనుచో బ్రహ్మమునకే శ్రేష్ఠత్వము చెప్పబడినటులగును. 'పరబ్రహ్మము నుపాసింపుము; నీవు ఆ పరబ్రహ్మముమ పడయఁగలవు.' అని ఎవరును చెప్పరు. ఇటులు చెప్పకపోవుట అటుండగా 'ఓయీ! అపర బ్రహ్మము నుపాసింపుము, అటు లుపాసించితివేని నీవు పరబ్రహ్మముమ పడయగలవు.' అని చెప్పుదురు. కొలఁది ఉపాయముచే గొప్ప వస్తువును పొందుట కుపదేశింపనగును గాని గొప్ప ఉపాయముచే కొలఁది వస్తువును పొందుమని ఉపదేశింపఁదగదుగదా!

ఈ శ్లోకమున బ్రహ్మభావము దొడ్డదని చెప్పఁబడెననుటలో సందియ మింతయులేదు. కాని ఇది వైష్ణవ సాధకుల కింపితము కాలేదు. బ్రహ్మమును నీచపఱచి కృష్ణుని గొప్పచేయుట వారి కావశ్యకము. దానఁజేసి వైష్ణవ పండితుఁ డెవఁడో 'బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమ్'' ఈ మొదలగు అంశమును ఇందు కూర్చెను.

ఈ శ్లోకమునందలి బ్రహ్మపదము అపరబ్రహ్మమును చెప్పనని కొందఱందురు. ఇది యుక్తియుక్తము కాదు. ఏల యనిన 'కృష్ణుఁ డపరబ్రహ్మకంటె గొప్పవాఁడని చెప్పినందువలన ఏమియు సార్థకత లేకపోవుట మొదటికారణము. ఇందలి 'అవ్యయ, అమృత' పదములు బ్రహ్మమునకు విశేషితము లయినేని ఆ బ్రహ్మము పర బ్రహ్మమే యగుననుట రెండవకారణము. దీని వెనుకటి శ్లోకము నందలి (౧౪-౨౬) బ్రహ్మభూయ శబ్దముతో ఈ బ్రహ్మ శబ్దమునకు (౧౪-౨౭) సంబంధ ముండుట మూడవ కారణము. వెనుకటి శ్లోకమున 'భక్తిచే బ్రహ్మమును పొందును' అని కలదు. పదపటిఁగు ఈ శ్లోకమున 'కృష్ణుఁడు ఆ బ్రహ్మముకన్న మిన్న' అని చెప్పఁబడినది. ఇచట బ్రహ్మ భూయ శబ్దార్థ మెటులును అపరబ్రహ్మ ప్రాప్తి విషయక మగుటకు వీలులేదు. ఈ ప్రాప్తి పర బ్రహ్మ ప్రాప్తి. పరబ్రహ్మమును లక్షించి బ్రహ్మభూయ శబ్దముప యోగింపబడినపుడు శేష శ్లోకమునందలి బ్రహ్మము కూడ పర బ్రహ్మ మనియే సిద్ధాంతము చేయవలెను. కృష్ణభక్తి కంటె పర బ్రహ్మప్రాప్తి యెక్కువ అయినది అని చెప్పనిష్టములేక వైష్ణవుఁ డెవఁడో 'బ్రహ్మమునకు నేనే ఆధారము' అను నర్థముకల 'బ్రహ్మణో హి' అను శ్లోకమిందు పడవయిచెను.

పరబ్రహ్మముకన్న శ్రీకృష్ణుడు మిన్న అని తలచు వైష్ణవు లిపుడును గలరు. వారి మతమున కృష్ణుఁడు, గోవిందుఁడు, వాసుదేవుఁడే పరమస్థితి. అతఁడే పురుషోత్తముఁడు. ఉపనిషత్తుల బ్రహ్మము ఆ పురుషోత్తముని 'తను భా' అని అనఁగా శరీరకాంతి యని వారందురు ప్రాచీనకాలము నందును ఇటులనువారికి కొఱత లేదు. గీతలలో పూర్వోక్త శ్లోకమే దానికి ప్రమాణము.

## ఉ ప సం హా ర ము

అక్షర-బ్రహ్మ విచారణమువలన తేలిన సంగతులివి.

౧ అక్షర, బ్రహ్మ, పరమాత్మ, పరమ పురుష—ఈ మొదలగునవి ఏకార్థములు, ఒకనికే పేరులు.

౨ క్షరాక్షర సంబంధమగు శ్లోకములు (౧౫-౧౬, ౧౮)ను, ౧౪-౨౭ శ్లోకమును ప్రక్షిప్తములు. ఈ రెండు సంగతులును ప్రక్షిప్తములని అననిచో గీతలో ఆత్మవిరోధము కలదనవలయును.

# కలగూరగంప

## పోప్పర్ సిద్ధాంతం పరిశీలన

తెలుగు రచయితల్లో ముఖ్యంగా లోపించిన లక్షణాలు స్వవిమర్శ, సమన్వయ విమర్శ లేకపోవడమే. నేడు ఉత్పత్తి అవుతున్న సాహిత్యముపై కొందరికి సదభిప్రాయం ఏర్పడక పోవడానికి ఇది కారణమైనా కావచ్చు. కోకొల్లలుగా చెత్త రచనలు వెలువడుతుండడం ఇందువల్లనే. తమ రచనలపై తీర్పునిచ్చే న్యాయస్థానాలుగా పత్రికల్నే స్వీకరించినంతకాలం నేటి రచయితలు ఇలా కూరుకపోకతప్పదు. పత్రికా సంస్థలు వ్యాపార లక్షణాల్ని అనుసరించేవి. లాభాల్ని కూడగట్టుకోవడమే వాటి ఏకైక లక్ష్యంగా తయారైనాయి. సాహిత్యాన్ని అసలే గుర్తించని పత్రికలు కూడా మనకున్నాయంటే అది ఎవరికి గర్వకారణమో ? ఎవరికి తెలియాలి. వంటింటి రచనలకు అధిక ప్రాముఖ్యత నివ్వడం చూస్తే ఇది వ్యాపార లక్షణం అని కాదనగల తాహతు ఎవరికీ ఉండదనుకుంటా.

నేడు పత్రికారంగంలో విమర్శకూడా నామమాత్రంగా, ఏదో చేస్తున్నాంలే అన్నట్లు తయారౌతుంది. పుస్తకాన్ని విమర్శించడాన్ని మించి తమ భావాల్ని అందులో ఇరికించడం కొందరికి అలవాటై పోయింది. ఇదొక దురదలాంటి పాడులక్షణమన్నా వారు వినరు. ఈ పద్ధతి కొనసాగినంతకాలం సరియైన, సామాజిక లక్షణాల్ని ప్రతిబింబిస్తూ, సరిదిద్దుతూ వచ్చే రచనలు నామమాత్రంగా తయారౌతాయని చెప్పక తప్పదు. వివేక విశిష్టమైన విమర్శ ఈనాటి విమర్శక శిఖామణులకు కొరవడడం శోచనీయం.

కార్ల్ పాప్పర్ ''సైన్స్, కళలో సృజనాత్మకమైన స్వయం విమర్శ'' అను వ్యాసం (ఎన్‌కవుంటర్) లోని కొన్ని విషయములు ముఖ్యంగా ఈనాటి రచయితలందరు గమనింపదగినవి. ఈ వ్యాసం బీథోవెన్‌యొక్క ఆకర్షణీయమైన చిత్రాల పుస్తకం ఆధారంగా, హేడెన్, మోట్‌సార్‌ట్ ప్రభావంవల్ల రాయబడినది.

నా దృష్టిలో సైన్స్ ఎదుగుదలకు ప్రారంభము పద్య రచన మరియు మత సంబంధిత పురాణాలలోను కలదు. మానవుని హేతువాదయుత ఊహాధోరణి ఇందులనే పురికొల్పినది. వివేక విశిష్టమైన విమర్శనాధారము చేసుకొని పురాణముల నుండి సైన్స్ అభివృద్ధి చెందినది. ఒక క్రమపద్ధతి గల విమర్శ సత్యమును కనుగొనగల ధోరణిని కనిపెట్టినది దీనిలోని నిజానిజాల్ని కనుగొనుటకు ఆధారభూతంగా రెండు ప్రశ్నలు కలవు. ఇది నిజమౌనా ?, ఇది నిజమా ? అనునవి. నేను ధృవీకరించునదేమనగా పద్య రచన, సైన్స్ రెండింటికీ మూలాధారములైనవి పురాణములని.

2) మనము రెండురకాలైన విమర్శలను గమనింపవచ్చును. ఒకటి సాహిత్య అభిరుచుల మరియు సహజమైన ఆలోచనలతో కూడినది. రెండవది వివేక విశిష్టమైన తులనాత్మక అభిరుచులకు కారణభూతమైనది. మొదటి రకమైన విమర్శను ఆధారముగా చేసుకొని పద్య రచన అభివృద్ధికిని, రెండవ రకమైన విమర్శ ఆధారముగా సైన్స్‌యొక్క పురోగతికి పురాణములు దోహదము చేసినవనుట నిశ్చయము.

మొదటి కోవకు చెందిన విమర్శ భాష దాని గొప్పదనము, మరియు వికాసముయొక్క విలువను గుర్తించును. వివేక విశిష్టమైన విమర్శ పురాణ సంబంధిత భావాలు నిజమా ?, కాదా ? అని ప్రశ్నిస్తుంది. ఈ పశ్నాపరంపర శాస్త్రీయ జ్ఞానానికి, ప్రపంచానికి సంబంధించినదై ''కాస్మాలజీ''గా మార్పు చెందును. ఈ శాస్త్రము క్రమేపి ప్రకృతి శాస్త్రంగా రూపొందును.

నా మూడవ సిద్ధాంతమేమనగా పద్యరచన మరియు సంగీతము ఒకేదాని నుండి జనించినవని చెప్పవచ్చును, మరియు విశ్వనిర్మాణ శాస్త్రము మరొకవైపునకు. నా అభిప్రాయము ప్రకారం పద్యరచన యంతయు పురాణముల నుంచి ఉద్భవించినదనిగాని, లేదా విజ్ఞాన శాస్త్రమంతయు విశ్వ నిర్మాణ శాస్త్రమనిగాని చెప్పుటలేదు.

పురాణములు కేవలం మనఊహాశక్తియొక్క గొప్ప ఉత్పత్తులని నా అభిప్రాయం. పద్య రచన మరియు సైన్స్‌యొక్క ముఖ్య పాత్ర ఏమనగా మనకు ప్రపంచము గురించి విపులీకరించుట. ఈ విధముగా పద్య రచన, సైన్స్ మరియు సంగీతము పరస్పర సంబంధముగల రక్త సంబంధితాలు. ఇది మానవుని యొక్కయు, ప్రపంచముయొక్కయు స్థితిగతుల నవగాహన చేసుకొనుటకు ఆధారభూతములు.

సైన్స్ మరియు కళలో కొన్ని ముఖ్యభేదములున్నవి. సైన్స్ నిజాన్ని పరిశోధిస్తుంది. అట్లే కళలో కూడా అనేకమైన ఉద్దేశ్యములు కలవు. నిరంతరముగా కృషిసల్పినచో ఈ రంగములో కూడా అభివృద్ధి కాంచనగును. నిరంతర కృషివలన రంగుల అలంకరణలో గణనీయమైన అభివృద్ధి కనబడుచున్నది. ఎలాంటిరంగులను ఎట్లు రుద్దవలెనను భావము ఇక్కడ క్రోడీకరించవచ్చును.

ఆస్కార్‌వైల్డ్ అను మహాకవి అభిప్రాయము ప్రకారం ''అనుభవమనగా పొరపాట్లను సరిచేసుకొనుట.'' అందుకే జాన్ ఆర్చిబాల్డ్ అను భౌతికశాస్త్రవేత్త ''మనము ఎంత వేగముగా తప్పులు చేయడమనేది మన ముఖ్య సమస్య'' అంటాడు.

కనుక మనము తప్పులను తెలుసుకొనడం, దాని నుండి అనుభవం గడించడం అవసరం. 'మొజార్ట్' కూడ తన కళాఖండాలకు తన జీవితపు ఆఖరి దశాబ్దంలో స్వయం విమర్శ ద్వారా సరిదిద్దుకొని ఎన్నో మార్పులు చేశాడు. అప్పుడే ఆయన గొప్ప కళాకారుడుగా రాణించాడు.

బీథోవెన్ స్కెచ్ పుస్తకాలు నిజంగా సృజనాత్మక స్వయం విమర్శ, సర్వదా పునః పరిశీలించు ఆలోచనల మరియు తరచుగా వాని శుద్ధపరచు భావములను ప్రదర్శించు ప్రతిఫలకములు.

ప్రపంచములో పలువిధములైన కళాకారులు కలరు. లోపాలు సవరించుకొని ముందు ముందు ఏ ప్రయత్నం లేకుండా ఒక పనిని పరిపూర్ణముగా చేయగలిగేవారు కొందరు. 'బెర్ట్రాండ్ రస్సెల్' అను తత్వశాస్త్రవేత్త ఈ కోవకు చెందినవాడు. ఇతరులు ఇందుకు భిన్నంగా ప్రవర్తిస్తారు. వారొక పనిని చేసిన తర్వాత, దానిని పరిష్కృత పరచుట వారి ముఖ్యఉద్దేశ్యము చాలా సరిదిద్దిన తర్వాతనే వారి రచనలు పూర్తి అవుతాయి. ఈ కోవకు చెందిన పద్ధతి మిక్కిలి శ్రద్ధగా గోచరించును. కళాకారునికి గూడ పూర్తి సంతృప్తి నొసగును.

కళారంగంలో స్వయంవిమర్శ అవసరం కాని, సైన్స్‌లో స్వయంవిమర్శయే కాకుండా సహకార విమర్శ కూడా అవసరం. ఒక శాస్త్రజ్ఞుడు పొరపాటున గాని దాచియుంచిన తప్పును ఇతర శాస్త్రవేత్తలు సవరిస్తారు. ఎందుకనగా సైన్స్ స్వవిమర్శతో కూడిన సమన్వయ విమర్శ. ఈ విమర్శ కనుగొన్న వాస్తవాలను న్యాయంగా నిర్ధారణ చేస్తుంది.

సృజనాత్మకమైన స్వయంవిమర్శ, సహకార విమర్శ, సమన్వయ విమర్శ కొనసాగితే మన సాహిత్యంలోనూ నూతనోత్తేజం ఉదయించగలదని చెప్పక తప్పదు.

**శ్రీ కె. అంజయ్య**

# 'నా వి' శ బ్ద ము

చిన్నయసూరి బాలవ్యాకరణంలో "నౌ శబ్దంబునకు నావ యగు" అని సూత్రించి, "కొందఱు నావి యనియు నాదేశంబగు నందురు" అని వృత్తిని వ్రాసాడు. (తత్సమ సూ.63) అలా చెప్పిన ఆ "కొందఱు" ఎవరన్న విషయాన్ని సూరి స్పష్టపరచలేదు. ఆ "కొందఱి"లో రావిపాటి గురుమూర్తిశాస్త్రి ఒకడని మాత్రమే ఇప్పటివరకు గుర్తింపబడినది (చూ. శ్రీ రావూరి దొరసామిశర్మ, "సూరి బాలవ్యాకరణ రచన – సాహితి 1964. మార్చి పు. 16-17)

గురుమూర్తిశాస్త్రి తన "తెనుఁగు వ్యాకరణము"లో (1836) "ఔకారాంతమైన నౌ శబ్దమునకు తెలుఁగులో ప్ర-ఏ॥ నావ—నావి" (పు. 58) అని రెండు రూపాలను చూపాడు.

కాని గురుమూర్తి శాస్త్రికన్న పూర్వమే రచింపబడిన ఏ.డి. క్యాంబెల్ (A. D. Campbell) వ్యాకరణంలో విశేష రూపాలలో 'నావి' శబ్దం పేర్కొనబడినది.

"Exceptions : రై... . ...రో
గో.........గోవు
నౌ........ నావ లేక నావి
గ్లౌ.........గ్లో"

[A Grammar of the Telugu Language - Rule 216. 1816 to 1820] క్యాంబెల్‌కు వ్యాకరణ రచనలో తోడ్పడిన పట్టాభిరామశాస్త్రి తన వ్యాకరణంలోను ఈ రూపాన్ని గుర్తించి ఉంటాడు. కాని మనకు లభిస్తున్న పట్టాభిరామ పండితీయం అసమగ్రం.

గురుమూర్తిశాస్త్రిపై క్యాంబెల్ వ్యాకరణాన్ని, పట్టాభిరామ పండితీయాన్ని సంప్రతించి తన వ్యాకరణాన్ని వ్రాసాడు. "తెనుఁగు వ్యాకరణము" "ఏ. డి కేమిల్ దొరగారి పేర నంకితము." "పట్టాభిరామీయా"న్ని సంప్రతించినట్లు గురుమూర్తి శాస్త్రి పీఠికలో పేర్కొన్నాడు.

అయితే, 'నౌ'కు 'నావి'ని ఆదేశించిన ఆద్యలాక్షణికుడు పుష్పదంతుడని మండలక్ష్మీనరసింహకవి తేటపరచి, 'నావి' ఆదేశమగునన్న లక్షణాన్ని లక్ష్యసమన్వితంగ తన త్రిలింగ శబ్దాను శాసనంలో ప్రదర్శించాడు. [త్రిలింగ శబ్దాను శాసనం అముద్రిత గ్రంధం. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో డి. 1223. నెం. "ఆంధ్రకౌముదికే త్రిలింగ శబ్దాను శాసనమని నామాంతరమ"ని శ్రీ గంటి సోమయాజిగారు తమ ఆంధ్ర భాషా వికాసంలో (పు. 165) పేర్కొన్నారు.]

"సూ. నావి పుష్పదంతస్య॥

వృ. నౌ శబ్దస్య సంస్కృత సప్తమ్యేక వచన వద్రూపం స్యాత్పుష్ప దంతస్యమతే॥

ఉదా. నావి॥ నావిచేత॥ నావిఁదెచ్చె॥ నావియెక్కి॥ ఆధర్వణ భారతే॥ ఆరణ్య పర్వణి॥

క. నయమార రాఘవుఁడు నా
వి యెక్కి వడిఁదాఁటె జాహ్నవీ శైవలినిన్
జయ జయయని వినువీధుల
వియచ్చరులు సన్నుతింప వేడుకతోడన్"

ఇచట 'నావి' యతిస్థానస్థిత నిర్ధారక ప్రయోగము.

కాబట్టి సూరి పేర్కొన్న 'కొందఱి'లో ఇప్పటికి ఆద్యుడు పుష్పదంతుడు. ద్వితీయుడు మండ లక్ష్మీనరసింహకవి. తృతీయుడు విదేశీయుడైన ఏ. డి. క్యాంబెల్. పట్టాభిరామశాస్త్రిని చెప్పడానికి ఇప్పటికి ఆధారంలేదు. వీరి తరువాతనే రావిపాటి గురుమూర్తి శాస్త్రి. సూరికి పూర్వం ఇందరు వ్యాకర్తలీ 'నావి' శబ్దాన్ని ప్రస్తావించారు.

# 'రై' శ బ్ద ము

సంస్కృత ఐకారాంత శబ్దాలలో 'రై' శబ్దమొక్కటే తెలుగులో గ్రహింపబడింది. ఆంధ్ర శబ్దచింతామణి "స్తో వా హో రై నావోః" అజంతము. సూ. 63) అని సూత్రించి, యీ రై శబ్దా

నికి 'రో' అన్నదానిని రూపాంతరంగ సాధించింది. అథర్వణుని వికృతి వివేకము

''స్యాద్వక్రతమ యుగ్మస్య! వక్రవర్ణో ద్వితీయకః
ఐకారాన్తం స్వరూపేణ! మతేభవతి ధౌర్వహే॥''
—అజంతము 45,46

అని ఆంధ్ర శబ్ద చింతామణిని పూరించింది. చింతామణి సూత్రం వల్ల 'రో గ్లౌ' అన్నరూపాలు మాత్రం సిద్ధిస్తుండగా 'రై—గ్నో' అన్న పాక్షికరూపాలను ధూర్వహుని మతంగ అధర్వణుడు సాధించాడు. 'రై—రో' అన్న తత్సరు రూపాలు సర్వలాక్షణిక సమ్మతాలు.

గణపవరపు వేంకటకవి (17వ. శ.) తన ఆంధ్రకౌముదిలో రై శబ్దానికి 'రా' అనే మరొక వినూత్న తత్సమరూపాన్ని ప్రదర్శించాడు.

సీ. ''పరఁగు నేకాక్షర పదములఁ దక్కఁగ శబ్దాంత దీర్ఘముల్
చనుఁ దెనుఁగున
శ్రీయన హ్రీయన ధీయన క్ష్మాయవ జ్యాయన రాయన
మాయనంగ''
(పు. 8)

వ్యవహారంలో ''నాలుగురాళ్ళ చేతిలో మన్నవి'' అని ''ధనార్థమున 'రా' ఉపయోగింపఁబడుచున్నది'' అని ఆంధ్రకౌముది పరిష్కర్తలు సూచించారు.

'రా'కు కవి ప్రయోగం లేదు కనుక, లేని దానిని వేంకటకవి సాధించి ఉండడని, ఇక్కడ 'రా' కాక 'రై' అన్నదే వేంకటకవి అభిప్రాయమవి కొందరి భావన. కాని వేంకటకవి ఏకాక్షర పదాలకు హ్రస్వం రాదనే సందర్భంలో 'రా' పదాన్నే తత్సమంగ పేర్కొన్నాడు. 'రై' శబ్దానికి హ్రస్వరూపం లేదు గనుక దానినిక్కడ పరిగ్రహింపలేము.

''రా. సం. వి. ఆ స్త్రీ. బంగారము. ధనము'' అని సూర్యరాయాంధ్ర నిఘంటువు ధనార్థంలో 'రా' అనే తత్సమ రూపాన్నిచ్చింది కాని ప్రయోగాన్ని చూపలేదు ఈ పదం ఇతర ద్రావిడ భాషల్లో ఉన్నదేమో తెలియదు. ఉంటే అప్పుడిది తత్సమం కానేరదు.

మండ లక్ష్మీనరసింహ కవి తన త్రిలింగ శబ్దాను శాసనంలో ఈ రై శబ్దాన్ని గూర్చి మరికొన్ని విశేషాలను ప్రదర్శించాడు:

''అధర్వణ వ్యాకరణే॥ ఐదంతా నామదంతవదితి॥ రావణీయ సూత్రే అధర్వణా చార్యేణోక్తత్వాత్॥

రయి॥ రయిని॥ రయిచేత॥ రయికొఱకు॥ రయివల్ల॥ రయికి॥ రయియందు॥ ఇత్యేవం రూపసిద్దేస్సు ప్రయోగ వివరయిశబ్దః''

రై శబ్దానికి 'రయి' అన్నది రూపాంతరంగ ఇక్కడ చెప్పబడింది. ''వాయిరవుర్వ్య క్రతమౌ'' (అజంతము సూ. 66) అన్న ఆంధ్రశబ్ద చింతామణి సూత్రం ఐకారానికి 'అయి'; ఔకారానికి 'అవు' అన్న ఆదేశాలను వికల్పంగా విధిస్తుంది. ఈ కార్యం అచ్చి కాలకా, తత్సమాలకా అన్న వివక్ష ఆంధ్రశబ్ద చింతామణిలో లేదు. అహోబలుడు ఇది వికృతి శబ్ద విషయమని తన కవిశిరోభూషణంలో తెలిపాడు (పు. 453) చిన్నయసూరి అహోబలుని అనుసరించి ''అచ్చికంబులందయి యవులకు వక్రతమంబులు బహుళంబుగానగు'' అని సూత్రించాడు. (బా. వ్యా. క్రియ సూ. 103) దీనినిబట్టి ఇది అచ్చిక శబ్దవిషయమని తెలుస్తున్నది. కాని త్రిలింగ శబ్దాను శాసనంలో 'రై' అన్న తత్సమానికి ఈ కార్యం జరుగుతుందన్న విషయం రావణమతంగ ఉద్ధరింపబడింది.

మండ లక్ష్మీనరసింహకవి ఇంకా ఇలా పేర్కొన్నాడు:

''సంస్కృతే రే శబ్ద రై శబ్దయో రపి ద్రవ్య వాచకత్వాదాంధ్రే తత్సతజ్ఞ దేశ్యేషపి
రే శబ్దస్యాపి ప్రయోగస్య విద్యమానత్వాత్॥
రేవా॥ రేవత॥ రేవతుఁడు॥ రేఁడు॥ ఇత్యేవం ప్రయోగస్య ప్రసిద్ధతయా॥
రే శబ్ద రై శబ్దయోర్నిత్యైక వచనాచ్చ॥
రే॥ రేను॥ రేచేత॥ రేకొఱకు॥ రేవలన॥ రేకు॥ రేయందు॥
రై॥ రైని॥ రైచేత॥ రైకొఱకు॥ రైవలన॥ రైకి॥ఇత్యేవం॥
రే శబ్ద రైశబ్దయోంపి రూపసిద్ధిరపి ఆంధ్రభాషాయామపి ప్రసిద్ధా॥
రేవేడు॥ రేయీవి॥ రేవెలఁది॥ రైవేటు॥ రైయీవి॥ రైవెలఁది॥
ఆంధ్రీయ రేశబ్దస్యాపి మహాకవి ప్రయోగస్య విద్యమానత్వాత్॥
రో శబ్ద రేశబ్ద రయి శబ్దాస్త్రయోపి రై శబ్దార్థకా పద॥
నాచన సోమయాజి కృతే కృష్ణవిలాసే రుక్మిణీ వాక్యమ్॥

క. నావంటి దానినెంచక
నే వంచన సేసిపోయి వృష్ణికులుఁడు స
త్యా వవిత యింట వరే!
రేవానలు గురిసెనఁట హరిణనయన వివవే॥''

పై విధంగా రై, రో, రే, రయి అను నాలుగు తత్సమ రూపాలను మండ లక్ష్మీనరసింహకవి చూపడం జిజ్ఞాసువులు గుర్తింపదగ్గ విశేషం.

ఆచార్య జి. లలిత

# పరిశోధనా పద్ధతి

కాలానుగుణంగా విద్యావంతుల సంఖ్య పెరగటం మాత్రమే కాకుండా, ఉన్నత విద్యపట్ల అభిలాష పెరగటం ఈనాటి ముఖ్య లక్షణం. ప్రస్తుత పరిస్థితులలో ఎమ్. ఎ., ఎమ్. ఎస్‌సి. లు సామాన్యమైన డిగ్రీలుగా పరిగణింపబడుతున్నాయంటే అతిశయోక్తి కాదు. ఎమ్.ఎ.,ఎమ్.ఎస్‌సి. తరువాత రిసెర్చిచేస్తే (Researchనే తెలుగులో పరిశోధన అన్నారు) ఉన్నతోద్యోగం లభిస్తుందనే ఆశ మాత్రమేకాక, అసలు ఉద్యోగం సులభంగా లభిస్తుందనే భావం ఈనాడు స్థిరపడిపోయింది. ఇంతకుపూర్వం విశ్వ విద్యాలయ పరిసరాలలో, విశ్వ విద్యాలయ ప్రాంగణంలో ఉద్యోగంచేసే తీరు, అందులోను ఇంకా కొన్ని సంవత్సరాలు కష్టపడి పనిచేయాలన్న అభిలాషగలవారు మాత్రమే పరిశోధకు ప్రయత్నించటం జరిగేది. అనేక మంది ఉద్యోగంలో స్థిరపడిపోయినందువలన, ఇతర కారణాల వలన పరిశోధనకు సమయాన్ని వెచ్చించలేకపోయినవారు కూడా ఉన్నారు. అయితే ఈనాడు పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి.

విద్యార్థులలో విద్యార్జనాభిలాష పెరుగుతోంది. దేశంలోని అన్ని విశ్వ విద్యాలయాలు పరిశోధకులకు అనేక సౌకర్యాలు కల్పించటానికి అనుక్షణం ప్రయత్నిస్తున్నాయి. పరిశోధన స్థాయికి చేరిన ఏ భాషా సాహిత్యమైనా, ఏ శాస్త్ర విషయమైనా ఒకే ఒక విశ్వ విద్యాలయ ప్రాంగణానికి ముడిపడి ఉండటం అసాధ్యం. పరస్పర సంబంధాలు, ప్రత్యక్ష, పరోక్ష సహకారాలవలన విశ్వ విద్యాలయాల మధ్య సాన్నిహిత్యం మరింతగా పెరిగింది, పెరుగుతోంది. అంతేకాక 'పరిశోధన' అనేది విద్యార్థిలో తాను అభ్యసించిన విషయం ఆధారంగా మరికొంత పరిశ్రమచేసి ఒక క్రొత్త విషయాన్ని కనుగొనాలనే ఆసక్తికి ప్రాణం పోస్తుంది. విద్యార్థి ఆలోచనా పరిధి విస్తృతం కావటానికి సాహిత్య, శాస్త్ర విజ్ఞానాలు బహుముఖాలుగా విస్తరిల్ల గలందుకు పరిశోధన ముఖ్యాధారం.

''పరిశోధన అంటే పాతసమాధులు తవ్వి కొత్తవికట్టడం'' అనే నిర్వచనం విన్నప్పుడు, ''పిహెచ్. డి. కి లేదా ఎమ్ ఫిల్. కి ఎన్ని పేజీలు రాయాలి'' అనే ప్రశ్నను ఎదుర్కొన్నప్పుడు, ''పరిశోధన అంటే ఏమిటి'' అనే సందేహం రాకమానదు. 'పరిశోధన' అంటే, అది కేవలం ఒక అంశాన్ని తీసుకొని, దానిగురించి ఇంతకు ముందు ఎవరైనా చర్చించి వుంటే వారి భావాలు, మన స్వంత అభిప్రాయాలు కలిపి గుచ్చెత్తటము, పేజీలు నింపటం మాత్రమేనా అనిపించకపోదు, పై ప్రశ్నలు విన్నప్పుడు. అయితే 'పరిశోధన'అన్నది అంతసులభంగా నిర్వచించి, ఒక్క మాటతో చెప్పదగ్గ విషయం కాదు. ఈ పరిశోధనకు ఒక క్రమం, పద్ధతి, కొన్ని నియమాలు ఉన్నాయి.

పరిశోధన చేయదలచుకొన్నవారు వాటిని పాటించవలసిన అవసరం ఎంతైనా వున్నది. ఈ పరిశోధనాపద్ధతి, లేదా పరిశోధనా విధానాన్ని పాశ్చాత్యులు ''రిసర్చి మెథడాలజీ'' అన్నారు. ఇది పరిశోధనా పద్ధతిని నిర్వచించే ఒక అంశంగానేకాక, ఒక ప్రత్యేకశాస్త్రమై విస్తరిల్లినది. పరిశోధన చేయువారు పాటించవలసిన సామాన్య నియమాలు మాత్రమేకాక, వివిధ విషయాలలో పరిశోధన చేయు వారు అవలంబించవలసిన విధి విధానాలు ఒక్కొక్క శాఖగా చర్చింపబడి రిసర్చి మెథడాలజీ అనే ఒక ప్రత్యేక శాస్త్రంగా విస్తరింప చేశాయి. సాహిత్య రంగంలోను పరిశోధన బహుముఖాలై వ్యాపిస్తున్న తరుణంలో సాహిత్య పరిశోధనా పద్ధతిని గురించి కొన్ని అంశాలను గమనించినట్లైన పరిశోధకుల పని కొంత సుకరంగా సాగేఅవకాశం ఎంతైనా ఉన్నది. అటువంటి సౌకర్యార్థం చేసే ప్రయత్నమే ఈ వ్యాసాల ముఖ్యోద్దేశం. ఈవ్యాసాలలో వివరింపబడు కొన్ని ముఖ్యాంశాలు (1) పరిశోధన ఎప్పుడు, ఎలా మొదలు పెట్టాలి; (2) పరిశోధనాంశమును ఏ విధంగా ఎన్నుకొనాలి; (3) పరిశోధనా పద్ధతులు; (4) విషయసేకరణ; (5) సేకరింపబడిన విషయము నుండి సిద్ధాంత ప్రతిపాదనకు అనువైన వివరములను గ్రహించుట; (6) సిద్ధాంత వ్యాస రచన; (7) గ్రంథసూచి, అధోజ్ఞాపికల ప్రయోజనము, మొదలైనవి.

## 1. పరిశోధన ఎప్పుడు చేయాలి, ఎలా మొదలు పెట్టాలి ?

'పరిశోధన ఎప్పుడు చేయాలి?' ఈ ప్రశ్న కొంత అసహజం గాను, పరిహాసపూర్వకమైనదిగాను ధ్వనించవచ్చు. ఎవరైనా సరే ఈ ప్రశ్న విన్న వెంటనే ''ఎమ్. ఎ., లేదా ఎమ్. ఎస్‌సి పూర్తి కాగానే పరిశోధన చేయగలందుకు అర్హత కలుగుతుందని'' సమాధానం ఇస్తారు. ఆ సమాధానం కొంతవరకు సరైనదే. కాని పూర్తిగా సరికాదు అని చెప్పాల్సి వుంటుంది. విశ్వవిద్యాలయాలు పరిశోధన చేయగలందుకు విధించిన కనీసార్హత విశ్వవిద్యాలయ పట్టభద్రులై ఉండాలనే రూలు ప్రకారం సరైనదే, అయితే పూర్తిగా సరికాదు అని చెప్పడానికిగల కారణం ఒకటుంది. అది — పరిశోధనకు ముందుగా విద్యార్థి కొంత కృషిచేసి ఉండాలనే అనుభవజ్ఞుల సలహా. ఒక రకంగా ఈ కృషిని పరిశోధనకు పూర్వరంగం లేదా నాంది అని చెప్పాలి. ఈ పరిశోధన లేకపోయినట్లైతే 'పరిశోధన' విద్యార్థికి ఒక పరిశ్రమగాను, అంధకారంలోచేసే ప్రయాణంలా పరిణమించే ప్రమాదం వుంది.

మరి ఈ పూర్వరంగ నిర్మాణానికి విద్యార్థి ఏం చేయాలి ?

ఎమ్. ఎ. లేక ఎమ్. ఎస్‌సి. చదివేటప్పుడు ప్రతి విద్యార్థి ఒక నియమితపరిధిలో తన జ్ఞానాన్ని వృద్ధిపరచుకుంటాడు. ఇతర గ్రంథాల నుంచి విషయగ్రహణ చేసినప్పటికి అది ప్రధానంగా పరీక్ష దృష్టితో చేసినదిగానే వుంటుంది. పరిశోధన స్థాయికి చేరదలచిన విద్యార్థి దృక్పథం మరింత విశాలం కావాలి పరీక్ష దృష్టిని దాటి ముందుకు పోవాలి అందుకు అవసరమైన మార్గము విస్తృత గ్రంథ పఠనము వివిధ విషయాలకు సంబంధించిన అనేక పుస్తకాలను చదవటం వలన కేవలం పరీక్ష కోసం చదివిన దానికన్నా ఎక్కువ విషయాలను విద్యార్థి గ్రహించగల అవకాశం లభిస్తుంది.

అప్పుడు విద్యార్థి తన అభిరుచి ఏమిటి, తానే అంశాన్ని గురించి పరిశోధన చేయాలి అనే విషయాన్ని గురించి ఒక క్రమంలో ఆలోచించగలుగుతాడు. పరిశోధన సాహిత్యంలో నైనప్పటికి, ఇతర శాస్త్ర గ్రంథ పఠనం వలన ఆయా శాస్త్రాలకు, సాహిత్యానికి గల సంబంధం, పరస్పర ప్రభావం విద్యార్థి అవగాహన చేసుకునే అవకాశం లభిస్తుంది. 'తనది' అనే ఒక స్వంత అభిప్రాయం ఏర్పడే వీలు కలుగుతుంది. ఒకవేళ ఆ అభిప్రాయము సరైనదిగాని, సమగ్రమైనదిగాని కాకపోయినప్పటికి ఇతరులతో చర్చించటంవలన ఆలోచన మరొక మార్గంలో సాగే అవకాశం ఏర్పడుతుంది. అప్పుడు విద్యార్థి పరిశోధనను గురించి ఆలోచించగల స్థాయికి చేరాడని చెప్పవచ్చును.

ఇక పరిశోధన ఎలా చేయాలి? ఇది కూడా కొంతవరకు పూర్వరంగంలోని భాగమే అని చెప్పాలి. ఎందుకంటే ఇంతవరకు పరిశోధన చేయాలనే సంకల్పానికి పునాది మాత్రమే నిర్మితమైంది. ఒకరకంగా పరిశోధన చేయటం ఇల్లుకట్టడం వంటిదే, అయితే ఇల్లు కట్టేటప్పుడు ముందు ప్లాను వేసుకుని పునాది నిర్మిస్తే, పరిశోధనకు ముందు గట్టి పునాది ఏర్పడిన తరువాత ప్లాను వేసుకోవాలి. ఈ ప్లానులో ప్రధానాంశం పరిశోధనాంశాన్ని ఎన్నుకొనడం. ఈ విషయం ప్రస్తావిస్తూ ప్రొ. విలియమ్ మల్డర్ అనే అమెరికన్ ఆచార్యుడిలా అంటారు

"The woods are full of subjects for research to the mind which has explored far enough to come to the cutting edge of knowledge"[1]. పరిశోధనాంశాల కోసం వెతుక్కునే వారికి ఇది ఒక ఆశాదీపం వంటిది. అనేకమైన విషయాలతో సాహిత్యం అనే అరణ్యం నిండి వుందట; అయితే ఇందులో ఒక హెచ్చరిక కూడా వుంది. పరిశోధనాంశములతో దట్టంగావున్న అడవిలోకి చొచ్చుకొని పోగలశక్తి కావాలంటే ముందుగా బుద్ధి, లేదా మేధకు ఆ అడవిలోకి చొచ్చుకొని పోగల చాతుర్యము, ఆ అడవిలో తనకొక దారి నిర్మించుకొనగల నేర్పు అవసరము అంటారాయన. ఆ నేర్పు, చాతుర్యము ఎలావస్తాయి? అవి విస్తృత గ్రంథపఠనమువలన; ఆచార్యులతోను, ఇతర పరిశోధకులు, విద్యార్థులతో చేసే చర్చల వలన లభిస్తాయి. అభిమాన విషయం, లేదా పరిశోధనకు అనువైన నూతన విషయం అనే వాటిని గురించి ఒక అభిప్రాయం ఇస్తాయి. అప్పుడు విద్యార్థి ఆ అరణ్యంలో ప్రవేశింపగలుగుతాడు. కాని అంతటితో తీరిపోదు, పరిశోధనకై నిర్దేశాంశాన్ని ఎన్నుకోవాలి. ప్రొ. మల్డర్ (Prof.Mulder) ఈ సందర్భంలో మరొక మాట అంటారు,

"In scholarship as in marriage a man should know his mind"[2] పరిశోధనాంశాన్ని ఎన్నుకొనడం, జీవిత భాగస్వామిని ఎన్నుకోవడం రెండూ కష్టమైన పనులే. ఏమాత్రం తొందరపాటు చూపినా, ఏ తప్పటడుగు వేసినా బాధలు తప్పవు. ఒకసారి వేసిన అడుగు వెనక్కి తీసుకోగలగటం అంత సులభంకాదు. తాత్కాలికమైన అభిమానమో, ఆవేశమో పరిశోధనాంశాన్ని ఎన్నుకొనటానికి కారణం కారాదు

ఒక విషయంపై విద్యార్థి తనకు అభిమానం ఏర్పడిందని భావిస్తే, ఆ అభిమానం ఎందుకు కలిగింది అని తనను తాము ప్రశ్నించుకోవాలి. ఆ విషయాన్ని పరిశోధనకు తీసుకునే అవకాశం వున్నదా అని పరిశీలించాలి. ఇవే ప్రశ్నలు వేరొకరినుంచి వచ్చినప్పుడు తన సమాధానాలు వారిని సంతృప్తిపరచి అంగీకరింపచేయగలవా అని విమర్శించుకొనాలి. అంతేతప్ప 'ఈ విషయం నాకు నచ్చింది, పరిశోధన చేస్తున్నాను' అంటే ఆ సమాధానంవలెనే ఆ సిద్ధాంత వ్యాసం కూడా అయోమయంగా తయారయ్యే ప్రమాదం వుంది.

అలాకాక ఒక విద్యార్థికి రెండు మూడు అంశాలపై సమానమైన అభిమానం ఏర్పడినట్లు తోచి, ఏది పరిశోధనాంశంగా గ్రహించాలి అనే సందేహం కలిగితే ఆ యా విషయాలలో నిష్ణాతులైన వారితో చర్చించాలి. ఆ యా అంశాలపై ఇంతకుముందు జరిగిన పరిశీలన వ్యాసాలు గాని, పరిశోధన వ్యాసాలు గాని, సిద్ధాంత గ్రంథాలు గాని వెలువడినట్లైతే వానిని నిశితంగా పరిశీలించటం అవసరం. అంతేగాక ఆ యా అంశాలపై చర్చలు, విమర్శాగోష్ఠులు జరిగినట్లైతే ఆ వివరములను గ్రహించటం అవసరం, ఏ అంశం గ్రహించినా ఒక క్రొత్త మార్గంలో, క్రొత్త సిద్ధాంత ప్రతిపాదనకు అవకాశం ఎంతవరకు ఉన్నదో తెలిసికొనటం చాలా ముఖ్యం. రెండు మూడు అంశాలలో ఏది ఎన్నుకొనాలి అనే సమస్య లేకపోయినప్పటికి ఈ విధమైన పరిశీలన చేయకుండా పరిశోధనకు పూనుకొనటం శ్రేయస్కరంగాదు. ఇంత పరిశ్రమ చేసిన తరువాత గాని ఏ అంశం ఎన్నుకుంటే పరిశోధనకు సమగ్రమైన అవకాశం ఉన్నదో గ్రహించటం సాధ్యంకాదు. అటుపిమ్మటనే విద్యార్థి తనకు సిద్ధాంత ప్రతిపాదనకు అనువైన క్రొత్త అంశాన్ని స్వీకరించడం ఉత్తమం.

ఇక్కడితో పరిశోధనాంశమును ఎన్నుకొనటంతో పరిశోధనకు పూర్వరంగం సిద్ధమైనట్లే. ఇక ఆచార్యుల ఆమోదంపొంది విశ్వవిద్యాలయ ప్రవేశం చేసి పరిశోధనకు ఆయతం కావడంనుంచి ఉత్తరరంగం ప్రారంభమౌతుంది.

---

1 Search and Research – Prof. Mulder, William Fundamentals of Research.

2 Search and Research Prof. Mulder, William– 'Fundamentals oi Research' A. S. R. C. Hyd.

**కుమారి డి. విద్యేశ్వరి**

# దాశరథి కవిత - సామాజిక దృక్పథం

"చారిత్రిక విభాత సంధ్యల
మానవ కథ వికాస మెట్టిది ?

ఏ దేశం ఏ కాలంలో
సాధించిన దేశమార్గం?''
— శ్రీశ్రీ

ఈ ఆలోచనా సరళి ఆధునికాంధ్ర కవిత్వానికి ఊపిరి. సంప్రదాయంనుండి వేరుపడిన అభ్యుదయ కవిత్వ తత్వమిది. మార్క్స్ సిద్ధాంతాల ప్రేరణతో, శ్రీశ్రీ ప్రభృతుల నాయకత్వాన కవిత్వం సామాజిక ప్రయోజనకారిగా కూడా తెలుగులో స్థిరపడింది. ప్రకృతి వనరులను అనుభవించడంలోను, సామాజిక ఫలితాలను పొందడంలోను మానవులంతా సమానమనే సహజ సిద్ధాంతానికి విరుద్ధంగా సమాజంలో కొందరు ధనికులు మరికొందరు బీదలు, కొందరు అధికారులు, మరి కొందరు సేవకులు, ఒకరిపట్ల అన్యాయమే ఒకరికి ధర్మం అనే వ్యత్యాసాలు సమాజాన్ని అనాదినుండి పట్టి పీడిస్తున్నాయి. ఈ సాంఘిక సమస్యల సంఘర్షణలో నలిగే దీనుల ఆర్తనాదాలు అభ్యుదయ కవుల కావ్యవస్తువు. వీరికి సర్వ కావ్యసామాగ్రి సమాజమే.

ఈ కాలంలో కలంపట్టిన ప్రతీ కవీ సమాజ ప్రభావానికి లోను కావలసిందే. పూర్వ మహాకావ్యాలకు ఇతివృత్తం, కావ్య సామాగ్రి, ప్రయోజనం వేరైనా కవి హృదయంపై పడిన ఒకానొక సూక్ష్మమైన సామాజిక సన్నివేశం అత్యల్పంగా కావ్యంలో చోటు చేసుకొనేది. ఆ సన్నివేశానికి కవి హృదయంలో కలిగిన వేదన, భావతరంగాలు ప్రేరణగా కావ్యం ఉద్భవిస్తుంది. వేదన లేక కావ్యం వెలువడదు. 'నిషాధుడు శరప్రయోగం చేయడం, మగపక్షి నేలకొరగడం, అంతట ఆడపక్షి విలపించడం' — ఈ దృశ్యం వాల్మీకి హృదయంలో కారుణ్యాన్ని ద్రవింపజేసింది. చెరగని ముద్ర వేసి ఆతనిని ఆదికవిగా ప్రతిష్ఠాపితం చేసింది. ఇంతవరకే సంప్రదాయం. అభ్యుదయ కవిత్వంలో కావ్యవస్తువు, కావ్యసామాగ్రి, కావ్యప్రయోజనం సర్వమూ సమాజమే. ఇలా అన్నిటా అభ్యుదయ కవిత్వం నవ్యతను సంతరించుకొన్నది.

నిజాం పాలనలోని తుది ఘడియల్లో తలెత్తిన రజాకార్ల రాక్షస కలాపాలు దేశాన్నంతనూ కలచివేశాయి. తెలంగాణమంతా అట్టుడికినట్లుడికిపోయింది. మానభంగాలు, ప్రాణహరణాలు, గృహదహనాలు వంటివి సర్వసామాన్యమై సామాన్యునికి నిలువనీడ లేకుండ పోయింది. ప్రజాహృదయాలు తూట్లు పడ్డాయి. కవి హృదయాలు క్షోభించాయి. ఒక సామాన్యునికి అతులితమైన హృదయావేదన కలిగింది. వెంటనే విరాట్పురుషునిలా విజృంభించి 'అగ్నిధార'ను కురిపించారు. వారే మన కవితా శరథి దాశరథి. ఆనాటి ప్రజల కష్టనష్టాలే దాశరథి లేఖినికి ఊపిరిపోసాయి. అప్పటికే శ్రీశ్రీ అభ్యుదయ ప్రభలు తెలుగు దేశమంతా ప్రకాశిస్తున్నాయి. దానికి తెలంగాణా సాంఘిక విప్లవం తోడై దాశరథిని మహాకవిగా మలచాయి.

నిజాం నిరంకుశ పాలనకు కనలిపోయిన కవిహృదయం అభ్యుదయ కవితను ఆహ్వానించింది. నాటి సంఘాన్ని చిత్రించి చైతన్య సందేశాత్మకమైన 'అగ్నిధార'ను సమాజాని కందించింది. ఇది ఖండకావ్యముల సంపుటి. సామాజిక స్పృహలేని ఖండిక యిందు లేదని చెప్పవచ్చు. అక్కడక్కడ ప్రబంధ ఫక్కీలో నడచిన పద్యాలు కనిపిస్తాయి. చక్కనైన ప్రకృతి చిత్రణలతో, వర్ణనలతో, వివిధ రస భావాలకు ఆలవాలంగా కవిప్రతిష్ఠకు మెరుగులు దిద్దుతోంది. తరువాత పుంఖాను పుంఖంగా రచనలెన్నో చేసారు. రుద్రవీణ, మహాంధ్రోదయం, పునర్నవం, అమృతాభిషేకం, కవితా పుష్పకం, దాశరథీ శతకం మొదలైనవెన్నో కావ్యాలను వెలయించారు. వీరి 'తిమిరంలో సమరం' కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి నందుకొంది. వీరి రచనల్లో సామాజిక దృక్పధంగల తావులు సామాన్యంగా కొట్టవచ్చినట్లు కనబడతాయి.

నిజాం వ్యతిరేక పోరాటంలో హృదయ విదారకమైన ప్రజా జీవితాలను ప్రత్యక్షంగా చూచి, కలతచెంది, ''ప్రాణములొడ్డి ఘోర గహనాటవులన్ బడగొట్టి .. ... . ............ . ...... ........... ...... .................. తెలంగాణము రైతుదే, ముసలి నక్కకు రాచరికంబు దక్కునే!

ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్ను బోలినరాజు మా కెన్నడేని,
తీగెలను తెంపి, అగ్నిలో దింపినావు
నా తెలంగాణ, కోటి రత్నాల వీణ.''

అని వీరశంఖాన్ని పూరించారు. నాటి సాంఘిక పరిస్థితిని విమర్శించి కలాన్నే ఖడ్గంగా ఝళిపించి నిజాం ప్రభువునే భయపెట్టారు. పీడిత ప్రజలకు సానుభూతిగా ''బ్రతుకులు దీర్ఘరాత్రముల భీతి చరింప, విషాద సంద్రష్టలన్ చితికి, విశాలమౌ ప్రకృతి నింపిన సంపదలెల్ల వీడి, దుర్గతిఁబడి కుందు మానవులకై కవితా మదిరాను పానమే అతులిత మోహనౌషధము ...... . ..... ...'' అని పలికినారు.

జైలులో గడపిన దుర్భర జీవితాన్ని 'జైల్లో' అనే ఖండికలో వివరించినతీరు కళ్ళకు కట్టినట్లు ఉంటుంది. దాశరథి సునిశిత కవితా హృదయానికి సామాజిక పరిస్థితులు తోడై ఉగా కవితలో చక్కని రూపచిత్రణ చేయడం జరిగింది. జీవితానుభవాల్ని ప్రతిబింబిస్తూ ''జైలులో పాడినాడ వాడిపోనున్న పూమొగ్గపైన పాట'' వంటి ధ్వని గంభీరమైన వాక్యాలు చెప్పడం యిందులోని విశిష్టత.

''ఆయాసపడు జైలులో యెన్ని ప్రజా రా
జ్యములున్నవో! యని యరసినాను!
నిరుపేదవాని నెత్తురు చుక్కలో నెన్ని
విప్లవాలో! యని వెదకినాను.

నీళ్ళలో నిప్పుమాదిరి, నిప్పులోన
నీళ్ళమాదిరి, కష్టాల నీడలందు
సుఖము నివసించునంట! ఉస్సురను వేడి
ఊర్పులోన పరీమళాలున్నవంట''

అనే పద్య యుగళంలో దాశరథి, వ్యంగ్య కవితాగళం ధ్వనిస్తోంది. ఆనాటి నిజాం దమనకాండకు ఆహుతియైన ప్రజలకోసం "ఈ కాలని కీలికా వితతిలో ఏ యిల్లు! యే యూరు! యే లోకం బాగుసు? ఎందరెందరు దరిద్రుల్ చచ్చిరో! ఏ సతీ శోకం బాకస మంటుచున్ననో! సుతుల్ చుట్టాలు చల్లారిరో!" అని కవి హృదయం ఆక్రోశించింది.

"వెన్నెలలు లేవు, పున్నమ కన్నెలేదు,
పైడి వన్నెల నెలవంక జాడలేదు,
చుక్కలే లేవు, ఆకాశ శోకవీధి
ధూమ ధామమ్ము, దుఃఖ సంగ్రామ భూమి."

అంటూ జైలులో గడిపిన తన జీవితంతో నాటి జన జీవనాన్ని జత చేసి వ్యంగ్యవైభవంగా వ్యాఖ్యానించిన తీర వంటి కవితా సన్నివేశాలు ఈయన కావ్యాల్లో చాలచోట్ల కనబడతాయి. "పరుల హింసించు వారలు బాగుపడెడిమాట వట్టిది. నశియించు మాట నిజము." అని రజాకార్ మూకలు గ్రామాలు దోచుకునే ఘట్టాన్ని స్ఫురింప జేసి, 'హింస నాశనకారి' అనే జగతి సత్యాన్ని ప్రబోధించి, నాటి పరిస్థితికి జోస్యము చెప్పినారు.

చార్మినార్ సమీపాన ఎత్తైన భవనాల నిర్మాణంలో కూలీల శ్రమైక జీవనం చూసిన కవి కన్నులు చెమ్మగిల్లాయి. వారల నిట్టూర్పులకు హృదయం ద్రవించి 'ఉస్సురనెదవు!' అనే కవితా ఖండిక వెలువడింది. దుర్భర జీవితాన్ననుభవిస్తూ అరుణోదయం నుండే "మంటి తట్టి నెత్తిన బెట్టి ..." శక్తిని ధారబోసి ధనవంతులకోసం రాతి కట్టడాలు కట్టడం కవి హృదయాన్ని కలచి వేసిన తీరు ఈ ఖండికలో కనబడుతుంది

నవాబు దురంతాలు — దానికి ప్రతిగా తెలంగాణాలో జరిగిన తిరుగుబాటుమ 'పదే పదే అనేస్తా' వన్నారు. ప్రజా విప్లవానికి హృదయ ముప్పొంగగా 'వీర తెలంగాణము' వెలిసింది. కవితల నన్నిం టిని పరిశీలిస్తే సమాజంలో పరిణామం తప్పదని – నవ్యత నాహ్వా నించాలనేది దాశరథి భావనగా తెలుస్తుంది.

అభ్యుదయ కవిత్వతత్త్వము మూర్తీభవించిన కవితా ఖండిక 'మళ్ళించు, రథము' దోపిడీ సమాజానికి బలి అయిన నిరుపేదలకు చైతన్యాన్ని ప్రబోధించడం ఇందులో ప్రధానోద్దేశ్యం. ధనపతుల దౌర్జన్యాలను, శ్రామిక వర్గం తిరుగుబాటును వర్ణించే 'రుధిర పకులు', 'కవాటం' వంటివి లెక్క కందని వెన్నో వీరి అభ్యుదయ కవితా ఖండికలు.

పడమటి సంపన్న దేశాలు అణుబాంబులు తయారు చేయ డాన్ని శాంతి కాముక దేశాలు నిరసించినప్పుడు శాంతి కపోతాన్ని పురికొల్పి

"కాస్త పశ్చిమాద్రి కడగేగి నాబంధు
జాలమునకు గూడ శాంతి నేర్పి
ఇలను కాచుమోయి ఈ అణుప్రోద్గత
ప్రళయ వహ్ని నుండి, పక్షి రాజ్ఞి!"

అని శాంతి సందేశాన్ని ప్రబోధించారు.

విశాలాంధ్రను ఆవాహన చేసిన కవిపుంగవుల్లో దాశరథి అగ్ర గణ్యులు. రాజకీయ పరిణామాలవల్ల ఆంధ్రదేశం ఎప్పుడూ ఒకే రాజ్యంగా లేదు. ఈ కొరతను దీర్చి, ఆంధ్రదేశాన్నంతా ఒకేవిల్లిడి లోకి తేవాలని, ఈ శతాబ్ది తొలినాళ్ళలో తెలుగు వారిలో ప్రత్యేక రాష్ట్రాభిమానం పెల్లుబికింది. త్యాగశీలుర కృషి ఫలితంగా విశా లాంధ్ర ఏర్పడే తరుణంలో

"ముక్కలైన మాతృమూర్తి గేహమ్మును
కూర్చి కట్టుడోయి కొమరులార,
మనము మనము కలహమున మునింగినయెడ
మన మహాంధ్ర లక్ష్మి మనకు రాదు."

అంటూ బాధ్యతాయుతంగా 'మహాంధ్రోదయాన్ని' ఆహ్వానించారు. విశాలాంధ్రను వ్యతిరేకించినవారు కూడా ఉన్నారనే సామాజిక సత్యం యిందులో మనకు తెలుస్తోంది.

ఈతని కవితా ప్రేరణకి, సామాజిక దృక్పథానికి రజాకార్ల దుశ్చర్యలు, తెలంగాణా స్వాతంత్ర్య పోరాటం ముఖ్య కారణాలు. ఒక వేళ యీ సామాజిక ప్రభావానికి లోనుకాకుండినట్లయితే మన దాశరథి ఒక మహా ప్రబంధకవి అయివుండేవారు. తత్సమ శబ్ద సందోహంతో దీర్ఘసమాస ఘటితమైనట్టివి, శృంగార వీర రస భరితమైనట్టివి, ఎన్నో కవితలు వీరి కావ్యాల్లో కనబడతాయి. పద్య శిల్పాన్ని అనల్పంగా పోషించిన ఆధునికుల్లో తొలి వరుస వారి యన. కవితావేశంగల దాశరథికి స్వయంగా తెలంగాణా విముక్తి పోరాటంలో పాల్గోవడం, కారాగారవాస క్లేశం అనుభవించడం వంటివి కవిత్వానికి మంచి పదును పెట్టి సామాజిక ముద్ర గాఢంగా పడేటట్లు చేసాయి. సంస్కృతాంధ్రాలతోబాటు ఉర్దూ కవితా రీతుల్ని జీర్ణించుకున్న కవి కావడంచేత, యీతని కవిత ఓ ప్రత్యేకతని సంతరించుకుంది. అన్నిటినీ మించి అభ్యుదయ భావ పరంపరలు, సామ్యవాద ధోరణులు, సామాజిక రూపచిత్రణలు, ఈయన కవితల నిండా చోటుచేసుకున్నాయి. ఈయన కవిత్వంలోని సామాజిక దృక్ప థాన్ని సూచనామాత్రంగా చెప్పడాని కిదొక ప్రయత్నం మాత్రమే. సునిశిత పరిశోధనచేసి ఎంతైనా వ్రాయవచ్చు

**శ్రీ నడుపల్లి శ్రీరామరాజు**

---

## రచయితలకి మనవి

రచనలలో ఇంగ్లీషు లిపి అధికంగా ఉంటే అచ్చు కూర్పుకి ఇబ్బందిగా ఉంటుంది కనుక 'భారతి'కి తమ రచనలు పంపేవారందరూ వీలయినంత వరకు తెలుగు లిపినే వాడాలని మనవి చేసు కుంటున్నాము.

సంపాదకుడు.

# ప్రాకృత వాఙ్మయం - రేఖా మా త్ర పరిచయం

అమదం ప్పాకద కవ్వం
పఢిదుం స్సోదుం జ ణ జాణంతి
కామస్స తత్తవత్తం కువ్వంతి
తే కధం ణ లజ్జింది!

అన్నాడు రసజ్ఞుడు అగు అజ్ఞాత ప్రాకృత మహాకవి. నిజము. శృంగార మధుకోశములు అగు రససముంచిత రచనలు ఎన్నియో కాల గర్భములో కలసిపోయినవి. భరత ఖండమున ప్రాకృతభాష చిరన్తన కాలము నుండి ఎంతో వివిధముగను, విస్తారముగను వెలసినది.

ప్రాకృతములు పలురకములు. షడ్విధములని ఆర్యుల అను శాసనము. ప్రధానంగా శౌరసేనీ, మాగధి, పైశాచీ, అపభ్రంశములే ప్రాకృత వ్యాకర్తలు పేర్కొన్నారు. కాలక్రమేణ ప్రాన్త, జాతీయ విభజన ప్రాకృతములలో ఏర్పడి, ప్రాకృత భేదములు ఇరువది ఏడుగ 'ప్రాకృత చన్ద్రికా' పేర్కొనినది.

ఇంత విరివి, విలువ వైవిధ్యముగల ప్రాకృత వాఙ్మయమున ఎంతో విస్తారమయిన రచనలు ఉండుట సుగ్రహమైన మాట. కాని నేడు మన పాలిటికి మిగిలిన సారస్వతము మిక్కిలి తక్కువ. ముద్రిత సారస్వతము ఇంకను తక్కువ.

ముద్రితమయిన ప్రాకృత వాఙ్మయమును అవలోడించితిమేని వాఙ్మయమందలి వైవిధ్యము సంస్కృతమునకు ఏ మాత్రము తీసిపోదు.

బాణభట్టుచేత భూషించబడిన మహోన్నత కథా ప్రబంధము 'బృహత్కథా ''[1] ఉదయన మహారాజు తనయుడు నరవాహన దత్తుడు, మదన మంజూషా అను లోకోత్తర సౌందర్యరాశిని వివాహ మాడుట, ఆ పిదప ఇరువదిఆరుగురు కన్యలను పెండ్లిచేసికొనుట – బృహత్కథలోని ఇతివృత్తము. నూరు లంభములు, లక్ష గాథల తోను నిర్మింపబడినది. పూర్తిరచన నష్టమయినను, బృహత్కథ మంగళగాధ మాత్రము మనకు మిగిలింది.

పణమత పనయ కుపిత
గోరిచలనగ్గ లగ్గ పతి బింబం!
దససు నహ దప్ప నేసు
ఏగాదస తనుధలం లుద్దం॥

బృహత్కథ నాయిక ''మదన మంజూషా'' నామముతో ప్రాచీన నాటకము ఒకటి కలదు. నేడది అలబ్ధము.

పైశాచీ ప్రాకృతములో వ్రాయబడిన బృహత్కథను, సంఘ దాసగణి విక్రమశకం ఆరవశతకములో జైనమత ప్రచారముకొరకు మార్పులు, చేర్పులుచేసి 'వసుదేవ హిండి' అను పేరుతో శౌరసేనీ భాషలో వ్రాశాడు. ఇందు భారత, రామాయణ, హరివంశ కథలు, జైనతీర్థంకరుల వృత్తాంతములు చోటుచేసికొన్నవి. ౧౦౦ లంభ ములు, ౧౨౦౦౦ గాథలు కలది నేడు కొంత అసమగ్రముగ లభ్య మయినది. ఆరు అ ధి కా ర ము లు గ వింగడించబడినది. అవి ౧. కథోత్పత్తి, ౨. పీఠిక, ౩. ముఖ, ౪. ప్రతిముఖ, ౫. శరీరము, ౬ ఉపసంహారము.

ఈ వసుదేవహిండికి, బుధస్వామికృత బృహత్కథా శ్లోక సంగ్రహమునకు సాదృశ్యము పెక్కుచోట్ల కనపడుటచేత, మూల బృహత్కథను కొంతకు కొంత అవగాహన చేసికొనవీలగుచున్నది.[2]

విమలసూరి ప్రణీత 'పఉమ చరియ' విక్రమ శకం ౧౦౦ సం॥ ప్రాంతమునాటి చక్కని రచన. శౌరసేనీ ప్రాకృతంలో వ్రాయ బడినది. ౧౧౮ ఉద్దేశ్యములతోను, ౮౬౫౧ గాథలు గల పెద్ద రచన. రామాయణ కథ ఇందలి ఇతివృత్తము. చక్కని సూక్తులు, చొక్కపు వర్ణనలు కలిగి ప్రౌఢ గంభీరంగా సాగిన ఉదాత్తకావ్యము. కవి జైనమతస్థుడైనందున వాల్మీకికథను అటనట మార్చివైచెను.

శ్రీపాద లిప్తాచార్య సహకారంతో ఆన్ధ్రరాజు సంతరించిన సంచితకృతి ''గాథాకోసం.''[3] ఏడుకోట్ల గాథల నుంచి ఏడునూర్లు ఏరుకొని శృంగారభరిత ధ్వని రచనగ కైసేసినాడు. సాహితీ సమ రాంగణ సార్వభౌముడు భోజదేవుడు శృఙ్గార ప్రకాశములో ''గాథా కోసం''ను పూర్తిగ ఉదహరించెను.[4]

ప్రవరసేన నిర్మిత ''దస ముహవహో'' పదునైదు ఆశ్వాస కముల కావ్యం. ఈకావ్యం సుగ్రీవ పట్టాభిషేకంపిదప శ్రీరాముడు కిష్కింధలో ఉన్నప్పుడు వర్షర్తువు వెళ్ళి శరత్తు రావడంతో మొద లయి, రావణవధతో పూర్తి అవుతుంది. వర్ణనలు ఎంతో సహజము లయి, జీవకళతో తొణికిసలాడుతవి. భారవి ప్రవరసేన కృతిని పెక్కు చోటుల అనుసరించినట్లు విమర్శకులు నిరూపించారు. ప్రసన్న గంభీరమయిన మహాకావ్యము ''దస ముహవహో.''[5]

కుతూహలుని 'లీలావదీ' దాదాపు ౧౩౨౦ గాథల సమాహార మహాకావ్యం. విభజన పద్ధతి లేక కులక పద్ధతిలో రచన సాగింది. తండ్రి భూషణభట్టు, తాతబహుళాదిత్యుడు. ప్రాతఃస్మరణీయుడు శ్రీకవిగారి మాటలలో ''మధురమై, ప్రసన్న గంభీరమై, భావగర్భ మయిన లీలావతి సహృదయ హృదయాహ్లాదకరమగు మంచి ప్రాకృత కావ్యము.'' కుతూహలుడు విక్రమ సం. ఏడవ శతకము నాటివాడు. హాలుడు లీలావతిని పెండ్లి చేసికొనుట ఇందలి కథావస్తువు.

ప్రారంభ గాథ ఇది –

ణమద సరోస సుదరిసణ
సచ్చపిదం కరరుహావలీ జాగలం!
హిరణక్కస విగడోరత్థల త్థి
దల గబ్భిణం హరిణో॥

ఎనిమిదవ శతక కాలమునాటి వాక్పతిరాజు ''గఉడవహో'' రచించెను. ప్రక్షిప్తములు పరిహరించగ ౧౨౦౦ గాథలు ఈ లలిత ప్రాకృత కావ్యములోకలవు. నైసర్గిక కవితా రామణీయకత, సహజ

సుకుమార వర్ణనా బంధురత, గంభీర పద్యప్రయోగ దక్షత—గఉడ వహో కవ్యమును విశిష్టకృతిగ తీర్చిదిద్దినవి. కొందరు విమర్శకులు ఈ కృతిని విస్తృత మహాకావ్యమునకు "పీఠిక"గ తలచిరి.

హరిభద్రసూరి "సమరాఇచ్చకహ" గొప్ప ప్రాకృత కథా కావ్యము. మహత్త్వపూర్ణము, ఆద్యంతము రమణీయగా సాగినది. జైనమత సంబంధి విషయములను ఆవలకునెట్టి, మిగత రచనను పరిశీలించితిమేని బాణభట్టు కాదమ్బరీ మహాకావ్యమును పోలి, కొన్ని విషయములలో మించునట్లు విమర్శకులు గుర్తించగలరు. ఈ హరి భద్ర సూరి ఇతర విశిష్ట కృతి "ధూర్తాఖ్యానము" మహోన్నత అధిక్షేప కావ్యము. అర్ధమాగధిలో వ్రాయబడిన ప్రహసనము హిందూ పురాణములలోని అతిశయోక్తులను, అశ్లీలములను సునిశిత ముగను, సుతారముగను అవహేళన చేయుట జరిగినది. కథానిర్మాణ ములో ఇట్టి ప్రహసనము ప్రపంచ వాఙ్మయములోనే అరుదేమో.[6]

ఈ హరిభద్రసూరికి తగిన శిష్యుడు "దాక్షిణ్యచిహ్న" బిరు దాంచితుడు ఉద్ద్యోతన సూరి. ఇతని చమత్కార కావ్యము "కువ లయ మాలా." గురువుగారి రచనను తలదన్నునట్లు పూనికవహించి రచించినట్లు — కువలయమాలాను చదివినవారికి తప్పక తోచును. ఎక్కువపాలు శౌరసేనీ భాషను వాడినను, అటనట సంస్కృతమును, అపభ్రంశమును, పైశాచిని వాడెను. ఉద్ద్యోతన సూరి ఆన్ధ్ర ప్రశంస ఇది

పియ మహిళ సంగమమ్మి
సందరగత్తే య భోజణే రోద్దే।
'అది' 'పాండి' 'రండి' భణంతి
అంధకుమారో పలోగది॥

ఆచార్య ఆదినాథ ఉపాధ్యేగారు ౧౯౫౫ లో సుసంస్కృత ముగ పరిష్కరించి సింఘీ జైన గ్రన్థమాలాలో నలుబది యైదవ పుష్పముగ బొంబాయి నుంచి వెలువరించిరి. ప్రాకృత సారస్వతాభి మానులు తప్పక చదువవలసిన ఉదాత్త రమ్యకృతి.

ఆచార్య జినేశ్వర సూరి "కథాకోశప్రకరణము"లో ముప్పది ఆఱు ప్రధాన కథలు, ౧౩౭ చిన్న కథలున్నవి. కథానకపద్ధతి ఇందు పరమోత్కృష్టత పొందినది. సరళత, సహజత, సన్దర్భశుద్ధి — ముప్పేటగ అల్లుకొని అద్భుతముగ రచింపబడిన చొక్కపు కథా మంజరి. సోమచన్ద్రకృత 'కథామహోదధి', మహేశ్వరసూరి ప్రణీత 'జ్ఞానపఞ్చమీ కహా', అజ్ఞాత కవి నిర్మిత 'మలయ సున్దరీ కహా', సాధారణ కవి కృత 'విలాసవతీ', జినభద్రసూరి 'మదన రేఖా', స్వయమ్భూ రచన 'ప ఉమ చరిఉ', అద్దహమాణుని 'సందేశ రా సక', పుష్పదంతుని 'జసహర చరిఉ' — మున్నగునవి ప్రాకృత సార స్వతమునకు పుష్టిని తుష్టిని చేకూర్చు రచనలు.

రూపకములుగూడ ప్రాకృతములోకలవు. రాజశేఖర మహాకవి ఉపజ్ఞ "కర్పూర మంజరీ." తొలి ప్రాకృత భాషా నిబద్ధ నాటిక. శౌరసేనీ ప్రాకృతములో సంతరించబడిన అపూర్వ నాటిక. పిదప నయచన్ద్రుని 'రమ్భామఞ్జరీ', రుద్రదాసుని 'చన్ద్రలేఖా'. విశ్వేశ్వ రుని 'శృఙ్గార మఞ్జరీ', ఘన శ్యాముని 'ఆనన్ద సున్దరీ', — లభ్య సట్టకములు ఉత్పన్నములగు రూపకముల కలవు కాని వాటి నామములు, కర్తృనామములు తెలియవు.

ఇక అలభ్య ప్రాకృత కావ్యములు నాకు తెలిసినంతవరకు ఇవి.

౧ పాదలిప్త ప్రణీత 'తరంగ లోల'.[7]
౨ ఆఢ్యరాజు నిర్మిత 'మారీచ వధ'.
౩ పంచశిఖ కృత 'శూద్రకము'.
౪ చీనదేవ వినిర్మిత 'బుద్ధ కధ' (మాగధీ ప్రాకృతం).
౫ హలిక కవి వ్రాసిన 'విలాసవతీ'.
౬ రాజర్షి దేవగుప్త 'త్రిపురుస చరిద'.
౭ జయరామ వినిర్మిత 'ధమ్మ పరీక్ష'.
౮ భద్రబాహుని 'వాసుదేవ కధ'.
౯ సర్వసేనుని 'హరి విజయం' (పారిజాతాపహరణ కథ).
౧౦ అజ్ఞాతకవి నిర్మించిన 'అబ్ధి మంధనం'.
౧౧ వాక్పతి వ్రాసిన 'మధు మధనం'.
౧౨ ఆనన్దవర్ధన కృత 'విషమబాణ లీల'.
౧౩ షణ్ముఖ కవి 'రామాయణం'.
౧౪ మహాసేన ప్రణీత 'సులోచనా'[8] మున్నగునవి.

# పాద సూచికలు

1 సముద్దీపిత కన్దర్పా
కృతగౌరీ ప్రసాధనా
హరలీలేవ నో కస్య
విస్మయాయ బృహత్కథా। — హర్షచరితమ్

సగల కలాగమా ణిలయ
సిక్ఖావిద కవిజణస్య ముహచందా
కమలాసణో గుణడ్ఢో
సరస్సదీ జస్స బుడ్డకహా। — కువలయమాలా

2 పూర్తి వివరములకు శ్రీ జగదీశ చన్ద్ర జైన వ్రాసిన **'Vasudevahimdi : An authentic Jain version of the Brhatkatha' - Ahmedabad 1977.** చూడ వేడికోలు.

3 రెండవ సంచిత కృతి జయవల్లభుని "జయవల్లభము" అను వజ్జాలగ్గం. ఇందులోను ఏడువందల గాథలు కలవు. మూడవ సంచిత కృతి జినేశ్వర సూరి 'గాహారతన కోసో'. ఇందులో ఎనిమిది వందల ఇఱువది గాథలున్నవి. ఇట్టి సంకలన కృతులు నా దృష్టికి వచ్చినవి మఱి మూడు కలవు.

4 ఉద్ద్యోతన సూరి హాలుని కృతిని ప్రశంసించిన రమణీయ రీతిని గమనించండి.

పణ ఈహి కవిజణేణ అ
భమరేహి వ జస్స జాగపణఏహిం
కమలాగరో వ్వ కోసో
విలుప్పమాణో పి క్ఖి ణ క్ఖీణో। — కువలయమాలా

5 వివరములకు ఆచార్య శ్రీ కృష్ణకాన్త హండికీగారి ఆంగ్లీకరణను చదువ ప్రార్థన.
Setubandha – Ahmedabad 1975.

6 Dhurtakhyana –
edited by Muni Jina Vijaya.
Critical Introduction by
Dr. A. N. Upadhye, Bombay 1945.

7 ప్రసన్న గమ్భీర పథా
రథాఙ్గ మిథునాశ్రయా
పుణ్యా పునాతి గఙ్గేవ
గాం తరఙ్గవతీ కథా। — తిలకమఞ్జరీ

8 మహాసేనస్య మధురా
శీలాలఙ్కారధారిణీ
కథా న వర్ణితా కేన
వనితేవ సులోచనా। — హరివంశ : (జినసేన)

శ్రీ చల్లా సత్యం

# శాకుంతలము - కథామూలము - వంశవృక్షము

శాకుంతలము కథ భారతదేశములోని వివిధ భాషలలో కనబడుచున్నది. కేవలము తెలుగు భాషలోనే ఈ కథ వచనము, అచ్చతెనుగు, పద్యకావ్యము, గేయము, నాటకము, యక్షగానము — అను రీతులలో 16వ శతాబ్దిలోని రేవణూరి వేంకటార్యుని నాటినుండి ఈ నాటివరకు 65 మంది వివిధ సాహిత్యకారులచే రచింపబడినది. ఈ కథ చాల సుప్రసిద్ధమైనది. దీనికి మూలము శతపథ బ్రాహ్మణము.

ఈ కథామూలమును గూర్చి, కురు వంశమును గూర్చి ప్రొఫెసర్ డి. డి. కోశాంబి – ఒక అమెరికన్ పరిశోధనా పత్రికలో ఈ క్రిందివిధమున ప్రస్తావించి యున్నారు.[1]

"The union of Dushanta with Sakuntala is made responsible for the birth of Bharata, thus became the ancestor of the great Rgvedic tribe, though the Rgveda doesnot know of this romantic detail.

"Dushanta's union with Sakuntala is attested by all accounts, though she is called an apsara only in the Satapatha Brahmana (S. B. 13. 5. 4. 11.)

మొదట శాకుంతలము ప్రస్తావన శతపథ బ్రాహ్మణములోని 13వ కాండము – 5వ అధ్యాయము – 4వ బ్రాహ్మణము – 11–13–14 మంత్రములలో కలదనియు, అక్కడనే శకుంతల, దుష్యంత, భరత పాత్రల ప్రస్తావనయు కలదనియు తెలియుచున్నది.

శతపథ బ్రాహ్మణము తరువాత, ఈ కథ ప్రస్తావన వరుసగా ఈ క్రింది గ్రంథములలో కానవచ్చును. (Chronological Order)

(1) సంస్కృత మహాభారతము, (2) హరివంశము, (3) భాగవతము, (4) విష్ణుపురాణము, (5) జాతక కథలు, (6) కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము, (7) నన్నయభారతము, (8) పినవీరభద్రుని శృంగార శాకుంతలము.

మొదటినుండి ఈ కథలో శకుంతల, దుష్యంతుడు, భరతుడు, కణ్వుడు, అను నాలుగు పాత్రలే కనబడుచున్నవి. తక్కిన మార్పులన్నియు కాలక్రమమున వచ్చినవి. ఈ గ్రంథములలో దుష్యంత వంశవృక్షములు వివిధ రీతుల కానవచ్చుచున్నవి.

## 1 వ్యాస భారతము

ఆదిపర్వము : 69వ అధ్యాయమునుండి 74వ అధ్యాయము వరకు ఈ కథ పరిఢవిల్లినట్లు శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి మహాభారత చరిత్రమునందు పేర్కొని ఈ వంశవృక్షమును చూపినారు.

చంద్రవంశము (చంద్రుడు – తార) — బుధుడు — (పురూరవుడు, ఊర్వశి) — ఆయువు — నహుషుడు — యయాతి — పూరుడు — మనస్యుడు — రౌద్రాశ్వుడు — అనాధృష్టి — మతినారుడు — తంసుడు — ఈలినుడు — (దుష్యంతుడు, శకుంతల) — భరతుడు.

## 2 హరివంశములోని వంశవృక్షము

పూరుడు (ఈతని వంశములో) — బు చేయువు — మతినార — (ఈతని నాలుగవ కుమారుడు) నందనుడు లేక ధర్మనేత్రుడు — (ఈతని నలుగురు కుమారులలో మొదటివాడు) దుష్యంతుడు — భరతుడు.

## 3 మహా భాగవతములోని వంశవృక్షము

నహుషుడు (ఈతనికి గల ఆరుగురు కుమారులలో రెండవ వాడు) (యయాతి–భార్య దేవయాని) — ఈతనికి గల అయిదుగురు కుమారులలో చివరివాడు పూరువు — జనమేజయుడు — ప్రాచీన్వాంసుడు — ప్రవిరోధమన్యుడు — చారువు — సుద్యువు — బహుగతుడు — శర్యాతి — సంయాతి — రౌద్రాశ్వుడు — ఘృతాచి — బుతేపువు — అంతిసారుడు — (ఈతనికిగల ముగ్గురు

కుమారులలో మొదటివాడు) సుమతి—రైభ్యుడు — దుష్యంతుడు భరతుడు.

## 4 విష్ణుపురాణములోని వంశవృక్షము

జనమేజయుడు—ప్రచిన్వతుడు—ప్రవీరుడు— మనస్యుడు —భయదుడు —సుద్యుమ్నుడు—బహగవుడు—సంయాతి—అహంయాతి—రౌద్రాశ్వ—ఋతేయుడు—రంతినారుడు — తంశుడు — అనిలుడు—దుష్యంతుడు —భరతుడు.[2]

విష్ణుపురాణము తరువాత జాతక కథలలో ఈ కథ కానవచ్చుచున్నది. ఈ జాతక కథలు క్రీ. పూ. 2, 3 శతాబ్దములలోనివని కాళిదాసునకు పూర్వమునుండి గలవని తెలియుచున్నది.[3]

ఈ జాతక కథల వృత్తాంతములో గాంధర్వ వివాహ విషయమును గూర్చి, శకుంతలా దుష్యంతుల వివాహ విషయమునుగూర్చి, సంఘములో స్త్రీకిగల స్థానమును గూర్చి తెలుపబడినది.[4]

ఇక కాళిదాస కవి అభిజ్ఞాన శాకుంతలములో వంశవృక్షము లేదు. తెలుగులో మహాభారతము తరువాత వచ్చిన పినవీరభద్రుని శృంగార శాకుంతలములో దుష్యంత వంశ వివరములు గలవు. కాని యిందలి పేర్లు కొన్ని సంస్కృత మహాభారతమునందును, మరి కొన్ని యితరగ్రంథములందును, తక్కినవి క్రొత్తవిగాను కానవచ్చుచున్నవి.[5]

చంద్రుని వంశములో—బుధుడు—పురూరవుడు—ఆయువు—నహుష—యయాతి—పూరుడు—జనమే జయుడు—సంయాతి—అహంయాతి—సార్వభౌముడు—జయత్సేనుడు— సురాధీనుడు—మహాధేనుడు—యుతానియుతుడు—అక్రోధుడు —దేవాపి — రక్షకుడు—మతిధరుడు—దృశుడు—నీలుడు—దుష్యంతుడు.

ఈ విధముగా "శాకుంతలము"నకు సంబంధించిన అనేక వంశవృక్షములు, అనేక మూలములను పొడసూపుచున్నవి. కాని కథ మాత్రము దేశ, విదేశీయులగు అనేక పండితులకు ఆకర్షణీయమై, చాల ప్రాచీనమై, వివిధ భాషలలోనికి అనువదింపబడి, వేనోళ్ల పొగడబడినది. ఈ కథ తెలియని వారుండరనియే చెప్పవచ్చును.[6]

## ఆధోజ్ఞాపికలు

1 "The autochthonous element in the Maha Bharata" by Prof. D. D. Kosambi (Poona)
Journal of American Oriental Society Vol. 84 Number 1 March 15, 1964. Qly Baltimore – Maryland

2 A System of Hindu mythology and tradition By H. H. Wilson First edition – London 1840

3 పుట 17. The Abhijnana Sakuntala and Kattahari Jataka by A. B. Gajendragadkar. 6th edition.

4 Pre-Buddhist India- Section IV - Chapter IV. Position of woman – పుట 282 (1939) Ratilal N. Mehta

5 శృం. శా. ఆశ్వా. 4–పద్యములు. 26-41 వరకు.

6 ఈ రచనకు తోడ్పడిన గ్రంథరచయితలకు కృతజ్ఞతలు.

డా. ముదిగొండ వీరేశలింగము

# మినీకవిత

## మార్క్సి వ్యాఖ్య

ఏప్రిల్ 1980 భారతిలో మిత్రుడు శ్రీ రావి రంగారావు గారి "మినీకవిత" చదువగా వచ్చిన భావాలు :

మినీ కవితా ప్రక్రియ చాలా పాతది. అధర్వ వేదంలో మినీ కవితలున్నాయి. "చమత్కారం" ప్రాతిపదికగా తీసికొంటే మన సామెతలు, ఒడ్డుకథలు, పొడుపు కథలు, కన్నడంలోని "ఒగటు"లు మినీ కవితలలో జమకట్టవలసి వస్తుంది. ఇంగ్లీషులోని "ఎపిగ్రం" మినీ కవితయే. ఇది క్లుప్తవాక్యం, క్లుప్తకావ్యం. దీని దేహము పొట్టి, ఆత్మయును "విట్టీ." ఇంగ్లీషులో అలెగ్జాండరుపోపు, బేకను "ఎపిగ్రం"కు ప్రసిద్ధి. తెలుగులో వేమన, కన్నడమున సర్వజ్ఞుడు, అరవమున వళ్ళువరు మినీ కవితా కారులు. ఇంగ్లీషులోని "లిమరిక్కు"లు, "క్లెరిహ్యూ"లు మినీ కవితలే.

శ్రీ రంగరావుగారిచ్చిన మినీకవితోదాహరణములు గమనిస్తే, ఈ మినీకవితలకు మార్క్సి వ్యాఖ్యలు వారు చేసినట్లు చేస్తేగాని, ఈ మినీకవితల "సంక్షిప్తత", "నవ్యబంధురశైలి", "చమత్కారం" మన కర్థమయ్యేటట్లు లేవు. వారు "హాస్యామనిజం" అనే మినీ కవితకూ, విహారిగారి మినీకవితకూ చేసిన విస్తార గజిబిజి వ్యాఖ్యలే ఇందుకు నిదర్శనాలు. విహారిగారి

"పొయ్యిలో పిల్లుల్ని లేపుతుంటే
కడుపులో ఎలుకలు పారిపోతాయి"

అనే మినీకవితకు శ్రీ రంగారావు వ్యాఖ్య ప్రమాద పతితంగామూ పద్యాన్ని అర్థరహితం చేసేదిగా ఉందని చూపిస్తాను.

1. "పొయ్యిలో పిల్లుల్ని లేపటం అంటే వంటచెయ్యటం" అంటారు శ్రీ రంగారావుగారు.

పిల్లుల్ని లేపడమే వంటచేయడమెట్లా అవుతుంది? వంట చేయుట కుపక్రమించడమవుతుంది కాని!

2. కడుపులో ఎలుకలు పారిపోవడమంటే ఆకలి తీరడమట! కడుపులోని ఎలుకలు ఎట్లా పారిపోగలవు? వారి వాక్యాన్ని ప్రతీక పరంగానూ, క్రియాపరంగానూ విశ్లేషిస్తాను. పొయ్యిలోని పిల్లుల్ని లేపడం అనేది నిజంగాచేసే పని. కాని కడుపులోని ఎలుకలు పరుగెత్తుకొనిపోవడం ప్రతీక. కాబట్టి ఇందుగల ప్రతీక భావం చతికిల

బడింది. పొయ్యిలోని పిల్లుల్ని లేపడంచేస్తే (అంటే వంటకుపక్రమిస్తేనే), కడుపులోని ఎలుకలు పారిపోతాయా (ఆకలి పోతుందా)? ఇంకా ఎక్కువవుతుంది కాని పిల్లుల్ని "కుక్కే" వాసనకు! కాబట్టి క్రియాపరంగానూ అర్థం చెడింది.

3. వండే అన్నం సహజంగా తెల్లగా ఉంటుంది ఆలాగే పిల్లులూ ఎక్కువగ తెలుపుగానే ఉంటాయి అంటారు శ్రీ రంగారావుగారు.

"పొయ్యిలోని పిల్లుల్ని లేపడం"అనే ఒక యూనిట్టు భావం వంట చేయడానికి ప్రతీక కావచ్చును కానీ పిల్లి అన్నానికి సంకేతం కాజాలదు. పొయ్యిలోని పిల్లి నల్లగా ఉన్ననూ అన్నం మాత్రం తెల్లగానే ఉంటుంది కాబట్టి, అన్నానికి పిల్లి సామ్యం సరిపోదు. తినేది అన్నాన్నిగానీ పిల్లిని కాదు. చేసిన వంట తెల్లగానే ఉండక పోవచ్చును. ఉదా : రాగిముద్ద, సజ్జరొట్టె పొయ్యిలో పడుకొన్న పిల్లుల్ని లేపితే వళ్లు విరుచుకొంటూ లేచిపోతాయి. అచటనే ఉండి బూకుండలోనికి దూకి కుత కుత ఉడికి అన్నంగావు. ఇచట లేని పిల్లుల్ని అన్నంగా ప్రతీకీకరించడం సరియైన టెక్నిక్కు కాదు. పిల్లులు నల్లగానూ ఉంటాయి, నల్లపిల్లి శ్రేష్ఠమంటారు కూడా! ఎలుకలు తెల్లగానూఉంటాయి. వీటిని "ఆల్బినోరాట్సు"అంటారు. అదీకాక, ప్రకృతపద్యంలోని పిల్లి నల్లగాఉన్నా ఎలుక తెల్లగా ఉండ వచ్చుననుకొన్నా ఉండేదేమి ? ఎట్లా ఆ పిల్లులు లేచిపోయేవి, ఆ ఎలుకలు పారిపోయేవి.

4. "ఆకలికి ఒక రంగు చెప్పాలంటే దానికి నలుపు రంగే తగి ఉంటుంది, దరిద్రం నుండి పుట్టుకొచ్చేది కనుక" అంటారు శ్రీ రంగారావుగారు.

దరిద్రం నుంచి పుట్టుకొచ్చేదానికి నలుపురంగే తగినది అని ఎందు కనుకోవలెను ? దరిద్రం నల్లగా ఉంటుందా ? నల్లగా ఉంటుంది అనుకొన్నా నల్లవారికి తెల్లవారు పుట్టరా ? దరిద్రం, ఆకలి చెడ్డవి కాబట్టి అవి నల్లగా ఉంటాయనా భావం? ఈ భావ సరణి శ్వేత జాత్యహంకార సూచకం, వైట్‌మాన్స్ ఛావినిజంకాదా? "శ్వేతం రోత" అని ఒక నీగ్రో నాయకుడు ఈసడించుకొన్నాడు కాదా ! భారతీయులు ఇతఃపూర్వపు యూరోపియనులు వారికి తెల్లదనంపైగల పాక్షపాతాభిమానం పోలేదన్నాడు నీరదచౌదరి. శ్రీరంగారావు భావసరణి నీరదచౌదరీ అభియోగానికి సాక్ష్యీభూతంగ ఉంది.

ఆకలి దరిద్రునికేకాక ధనికునికీ వేస్తుంది. ఈ రెండోవానికి మరీనూ.

5. "పిల్లికి ఎలుకకూ బద్ధవైరం. పిల్లినిచూస్తే ఎలుక పారిపోతుంది. అలాగే ఆహారంపడితే కడుపులో ఆకలి మటుమాయం అవుతుంది" అన్నారు శ్రీ రంగారావుగారు.

ఈ రెండు భావాలు దేనికవి సబబుగా ఉన్నాయి కాని, ఇవి కవితలో ప్రతీకలతోనూ "మెటఫరు"తో ముడిపడ్డంతో భావంఅర్థం కాదు. ఉదాహరణకు :

పిల్లి అనే ఆహారాన్ని మింగితే ఎలుకలు అనే ఆకలి మటుమాయమవుతుందా ?

లేక

పిల్లి అనే ఆహారాన్ని మింగితే ఆకలి అనే ఎలుకలు మటుమాయమవుతుందా ?

లేక

ఆహారమనే పిల్లిని మింగితే ఎలుకలు అనే ఆకలి మటుమాయమవుతాయా ?

లేక

ఆహారమనే పిల్లిని మింగితే ఆకలిఅనే ఎలుకలు మటుమాయమవుతుందా ?

ఇట్లాచూస్తే విహారిగారి మినీకవితలో సారళ్యం, స్పష్టత లోపించినాయి. శ్రీ రంగారావుగారి వ్యాఖ్యానంలో అయోమయత, వస్తు ప్రతీకల దోష భూయిష్ఠ సాంకర్యం ఉంది.

6. "అల్పాక్షరముల ననల్పార్థ రచన"అని ప్రాచీన విమర్శకులన్నట్లు శ్రీ రంగారావుగారు అన్నారు. ఆ లక్షణం చెప్పింది పాల్కురికి సోమన. ఎవరైననూ నా చిన్న మట్టుకీ లక్షణం సరిపోలేదు. ఏలయంటరా ? అనల్పాక్షరముల నల్పార్థ రచన చేయుట ఎట్లు లోపమో అల్పాక్షరముల అనల్పార్థ రచన చేయుట అట్లే లోపము. ఆమాటకు వస్తే అనల్పాక్షరములలో నల్పార్థ చేయుటే గొప్ప కళయనీ వాదింపవచ్చును. మన దర్శన మాత్రాలు మినీగా ఉండటంవల్లనే, వ్యాఖ్యానాలు, సిద్ధాంత రాద్ధాంతాలు బయలుదేరి మనల్ని చీకటి లోయలో పడవేసి, మన మనస్సులకు సంకెళ్లు వేసినాయి.

అత్యంత మినీ కవిత "ఓం". ఇది ఏకాక్షర బ్రహ్మవిద్య, అట్లంటే ఏమి ? రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యం అన్నా, వాక్యం రసాత్మకం కావ్యం అన్నా మినీ కవితా స్వరూపాన్ని కాక, కవితా స్వభావాన్నే చెబుతున్నారు ఈ కొలబద్దలతో చూస్తే విహారి గారి మినీ కవితలో రమణీయార్థం వుందా ? "బువ్వతింటే ఆకలి పోతుంది" అను అర్థంలో ఏం రామణీయకత ఉందబ్బా? ఇక రసం సంగతా? శ్రీ రంగారావుగారు చెప్పిన అన్నం అనే పిల్లి (సిల్లి అనే అన్నం ?) తో కలుపుకొన్న "రసం" తప్ప వేఱే రసం కనబడదే ? అల్పాక్షరముల అనల్పార్థ రచనకు లక్ష్యీభూతుడైన తిక్కన 12 వేలకు పైగా పద్యాలు వ్రాసినాడు ! మినీ, మిడీ, మాక్సీ–ఏ కవిత అయినా అందులో గొప్ప భావం ఉండవలె. వంగ రచయిత "వనపూల్" రచనలు చూడండి.

7. "కవిత్వాన్ని ఇలానే అన్వయించుకోవాలని నేను శాసించుట లేదు. ఎవరి అనుభవంబట్టివారు ప్రత్యేక విభిన్న విషయానుభూతులు పొందవచ్చు" అన్నారు శ్రీ రంగారావుగారు.

అంటే కవిత్వంలో నిర్దిష్టమైన భావం ఉండదన్నమాట ! అంటే ఒక రచనలో పదవాక్యాలు బోలువి అన్నమాట ! వాటిలో

మనకు కావలిసిన అర్థాలను పెట్టవచ్చునన్నమాట వారు "కవిత్వంలో ఆటో ప్రిన్సిపల్ అని ఒక కొత్త పారిభాషిక పదాన్ని ప్రతిపాదిస్తున్నాను" అన్నారు. వారిదికంటె సమంజసతరమైన సరికొత్త పారిభాషిక పదాన్ని నేనిప్పుడు ప్రతిపాదిస్తున్నాను

అదేమంటే ఎప్‌టీ బాక్స్ ప్రిన్సిపల్. శ్రీ రంగారావుగారి "ఆటో"లో కూర్చున్నవాళ్ళు, ఒక ఊళ్ళోఉన్న విశేషాలు మాత్రమే చూడగలరు. మరి నా ఎమ్‌టీ బాక్స్‌లో మన కిష్టంవచ్చిన వస్తువులు ఉండవచ్చును. నా ప్రతిపాదనలో ఇంకొక్క సుగుణం కూడ ఉంది. అదేమంటే, ఇప్పుడు మనం మినీకవిత గదా చర్చిస్తూ ఉండేది ఏది మినీ మీరేచెప్పండి "ఆటో"యా బోలుపెట్టెయా?

"కవిత్వంలో కూడా ఇష్టమొచ్చిన ఏదో ఒక అనుభూతిని విశృంఖలంగా పాఠకుడు పొందటానికి వీలులేదని" మళ్ళా శ్రీరంగారావు అనడంవల్ల కవిత చదివే పాఠకుడేమి చేయవలెనో బోధపడకుండా ఉంది.

8. వీరు విభిన్న అనుభూతు లిచ్చేటటువంటిదీ, విశాల దృక్పథంతో ఆలోచింపజేసే కవితనే మల్టీపర్పస్ పొయెట్రీ అని అంటున్నారు. ఎన్ని అనుభూతులైనా అనుభూతి ఒక్కటే కాబట్టి "మల్టీపర్పస్" అనే విశేషణం సరికాదు. కావ్యం యశసేర్థకృతే వ్యవహార విదేశివేతరక్షయే సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మిత తయోపదేశయుజే లోనివి కవిత్వంయొక్క బహుళార్థక సాధకాలు.

దీనికి నేను "రద్దీ పేపరు"కు వేయుట అనే ప్రయోజనం చేర్చుచున్నాను. శ్రీ రంగారావుగారందుకే పెనారమిక్ పొయెట్రీ అనిఉండాల్సింది.

9. మినీ కవితను చర్చిస్తూ శ్రీ రంగారావుగారు మినీకవిత అనే దినుసు యువకులూ, విద్యార్థులూ వ్రాసేదనీ, విద్యార్థుల కారవతరగతి నుండీ నేర్పవలసి నట్టిదనే నిశ్చయ మేర్పడేటట్లు వ్రాసినారు. అంటే మినీకవిత చిన్నవారు వ్రాసేదనీ, బాలకులుచదివే దనేగా అర్థం! పెద్దవారు మినీకవిత వ్రాయకూడదా? మినీకవిత వ్రాసే యువకవులు (శ్రీ రంగారావుగారు ఉదాహరించిన యువకవి కె బాలరాజు ఫార్ ఎగ్జాంపుల్) నడివయస్సులో ఏ సైజు కవిత వ్రాయవలెను? బాలకులు మాక్సీకవిత, ఉదాత్తిక్కనను చదువరాదా?

10. నేనీ చర్చను వికట విమర్శకోసం వ్రాయలేదు. ఊసు పోక కేశదళనం చేయబూనలేదు. సీరియస్‌గా వ్రాస్తున్నాను. నేడు మనకు కావలసింది జాతి జీవితాన్ని దర్పణంగా చూపించగల్గిన మాక్సీ ఎపిక్కులు. అత్యంత వేగాన సాగిపోయే దైనందిన జీవికలో నలిగిపోయే అమెరికా, రష్యాలాంటి దేశాలలో దప్పుయిన పాత్రలు చదివేందుకు తీరికలేదేమో అని అనుకోవచ్చును. (ఇదీ సరిగాదు నేడా దేశాలలో పెద్ద పెద్ద నవలలు, పద్యాలు వస్తున్నాయి) మన దేశం వారికి పెద్ద పుస్తకాలు చదివేందుకు తీరిక లేదన్న నమ్మకం కుదరదు. మనకుండేది తీరిక మాత్రమేమో అనిపిస్తుంది నాకు. ఇక మనకు లేనిది ఓపిక అనుకునేందుకు వీలులేదు. ఓపిక కేమి? మస్తుగా ఉంది మనం ఏడాదిలో చదివే డిటెక్టివ్, పోర్నో, గ్లామర్, కిచెన్, సినీ లిటరేచర్లు లెక్క కట్టినచో తిక్కన మహాభారతం రెండింతలుంటుంది. అసలు మనకులేనిది అర్థజ్ఞానం, సహృదయత. ఎప్పుడూ సత్కావ్య పఠనం వలన మనస్సు అద్దం వలె అయి. కావ్య తన్మయత్వమందున్నవాడే సహృదయుడని అభినవ గుప్తుడంటాడు నట, విట, వినోద సాహిత్యం చదివే వారి తల లోపల అద్దం ఉండదు. తలబైటనే అద్దం ఉండును. ఈబయటె అద్దాన్ని చూచుకొనకుండా మనోముకురం చూచుకొనేటట్లు చేసే కవితే మనకు కావలె. అది మినీ అయినా, మిడి అయినా, మాక్సీ అయినా ఏం అభ్యంతరం?

"ఎన్ని గజాలు రాశాడన్నది కాదు
ఎన్ని నిజాలు చెప్పాడన్నది ముఖ్యం."

అని శ్రీరంగారావుగారు ఉటంకించిన ఆరుద్రగారి నియమం ఖచ్చితమైన తర్కంతో వివేచిస్తే, ఉత్త కాగితం పైననే అనంత సత్యం ఉండాల్సివస్తుంది.

శ్రీ పర్దేశాయి తిరుమలరావు

# లేఖలు

## 'శీర్పి'

(1) 'సంఖ్యాంకిత ప్రాంతీయ విభాగాలు' అన్న నా వ్యాసం ('భారతి' – డిసెంబరు 1979)లో చిఱపి–12 విభాగపు ముఖ్య గ్రామం చిఱపి నేటి మడకశిర తాలూకాలోని శిర్పిఅని పొరపాటుగా పేర్కొనటం జరిగింది. చిఱపి–12 విభాగాన్ని పేర్కొంటున్న శాసనం మడకశిరలోనిది కాని శిర్పి గ్రామం మడకశిర తాలూకాలోనిది కాదు – కళ్యాణదుర్గం తాలూకాలోనిదే [చూడుడు నా సిద్ధాంత వ్యాసము (అముద్రితము) A Study of Telugu Place-names, p. 101. ఆంధ్ర విశ్వ విద్యాలయం.] అనుకోకుండా జరిగిన ఈ పొరపాటును చూపిన శ్రీ శంకరగంటి రంగాచార్యులుగారికి ('భారతి' – మే – 1980) నా కృతజ్ఞతలు.

(2) శ్రీరంగాచార్యులుగారు కర్నాటకలోని శిరా తాలూకాలోని శిరా గ్రామమే 'చిఱపి' ప్రాంతీయ విభాగపు ముఖ్యగ్రామమై ఉండవచ్చునేమో అన్న సందేహాన్ని వ్యక్తం చేశారు. అయితే శిరా తాలూకాలోని శిరా ముఖ్య గ్రామంగా గల ప్రాంతీయ విభాగం, 9వ శతాబ్ది నుండి 18వ శతాబ్ది వరకూ గల శాసనాలలో, సీరెనాడు (క్రీ. శ 878, 1040, 1139, 1162, 1168, 1179, 1205, 1262, 1772), సిరె–300 (క్రీ. శ. 1128), శిర్యద సీమె (క్రీ. శ. 1720, 1777) అని వ్యవహరింపబడింది. శిరా గ్రామానికి కూడా సిరె (క్రీ. శ. 1541), సీర్య (క్రీ. శ. 1591, 1777) అన్న పేర్లు మాత్రమే శాసనాలలో కన్పిస్తున్నాయి. (Ep. carn., Vol. XII, Sira taluk, Nos. 7, 23, 34, 38, 40, 62, 73, 9?, 96, 112; SII, Vol. IX I Nos.

233, 268, 273; SII., Vol. VI, Nos. 557, 558). ఈ సీరె నాడులో హెంజేరు (నేటి మడకశిర తాలూకాలోని హేమావతి), మలయనూరు (ఇప్పటి కళ్యాణదుర్గం తాలూకాలోనిది) గ్రామాలు కూడా చేరి ఉన్నందున 12వ శతాబ్దిలో మడకశిర, కళ్యాణదుర్గం తాలూకాలు ఈ విభాగంలో చేరి ఉండేవని అనుకోవచ్చు.

అందువలన మనకు ప్రస్తుతం ఉన్న ఆధారాలనుబట్టి శిరా గ్రామానికి శిర్పి అన్న వ్యవహారం 18వ శతాబ్దికి పూర్వంలేదని విదితమౌతున్నది. కనుక చిఅపి – 12 విభాగపు ముఖ్య గ్రామం చిఅపిని నేటి కళ్యాణదుర్గం తాలూకాలోని శిర్పి గ్రామంగా పరిగణించటమే యుక్తమనిపిస్తుంది.

శ్రీ శివలంక శ్రీరామచంద్రమూర్తి

జూలై 1980 సంచిక చూశాను.

మేధావులిద్దరూ కొన్ని నెలలనుండి గురజాడ, విశ్వనాథలపై జరుపుతున్న చర్చను ఆసక్తితో చదువుతున్నాను. శ్రీ సర్దేశాయి తిరుమలరావుగారు గురజాడలో లేని శక్తులకోసం అన్వేషణ సాగిస్తున్నారు ఆయన ఆపాదనలవల్ల మహాకవి, అచ్చమైన కవి, అన్న వాస్తవాన్ని అతిశయోక్తి కిందికి దించేస్తున్నారు. ఇక డాక్టరు మురలీధర్‌గారు విశ్వనాథలో లేని లేక ఎక్కడో అలవోకగా ప్రస్తావింపబడిన ఒకటో, అరో వాక్యాలను ఆకాశానికెత్తుతూ గ్రంథం చేస్తున్నారు. 'రామాయస్వస్తి రావణాయస్వస్తి' అన్నట్టుగా కాదు కాని గురజాడ ఆంధ్రభూమిలో నవచైతన్యం తెచ్చాడు. తేవడానికి రచన చేశాడు. విశ్వనాథ మరీ పాశ్చాత్య వ్యామోహంలో పడిపోతున్న తెలుగు జాతికి 'ఇదీ మీ సంస్కృతి' అని తన కవితలో ఎలుగెత్తి చాటాడు.

ఐతే పరిశోధనాత్మకమైన చర్చ నాబోటి 'భారతి' పాఠకునికి ఎంతో ఉపయోగం ఎన్నో విషయాలు నేర్చుకొనే అవకాశం కలుగుతుంది. కాని సంయమనం కోలుపోయిన వ్రాతలతోనే తలపట్టుకోవలసి వస్తుంది. శ్రీ తిరుమలరావంతటి మనిషి ప్రతివిమర్శకుని 'కడుపు ఉబ్బరానికి వాము తీసుకొమ్మ'నడం (అది చదివినప్పుడే బాధ కలిగింది) బాగాలేదనుకుంటే డాక్టరుగారు కౌంటర్ ఎటాక్‌చేస్తూ 'బహిః ప్రదేశానికి పోయినపుడు పేపర్లతో తుడుచుకొనే'దాకా వెళ్ళడం అసహ్యంగాఉంది. కడుపు ఉబ్బరం తీర్చుకొనేందుకు, బహిఃప్రదేశానికి వెళ్ళేందుకు దేశంనిండా 'మరుగుదొడ్లు', చాలా ఉన్నాయి.

'భారతి' దాకా ఎందుకండీ !

తిరునగరి

# అచ్చుతప్పులు - సవరణ

జూలై, '80 'భారతి', 'కంగూరగంప' శీర్షికకింద మీరు ప్రకటించిన 'కృష్ణశాస్త్రి స్వీయచరిత్రాత్మక రచన' అచ్చులో చాలా తప్పులు వచ్చాయి. నా ముందుమాటల శీర్షిక 'ప్రవేశిక' కాగా 'ప్రదేశిక' అయింది. 'స్వీయచరిత్రాత్మక' అని వుండాల్సింది 'స్వీయ చరితాత్మక' అయింది. అవిగాక–యీ కిందివి కూడా సవరించుకోవాలి.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ఆంధ్ర | ఆంధ్ర | the harmong | the harmony |
| ప్రస్థావన | ప్రస్తావన | మదనసాయకు | మదనసాయకం |
| ధనుర్దాసు | ధనుర్దాసం | ఋతుచక్ర | ఋతుచక్రం |
| | | appreciates | appreciated |
| Lyrical of Social | Lyrical & Social | Edgan | Edgon |
| | | మళయానికి బేంద్రే | మళయాళానికి బేంద్రే |
| దేశం అంత | దేశం అంతా | | |
| అంతేకాక | కాక | | |

శ్రీ కె. వి. రమణారెడ్డి



# గ్రంథ విమర్శలు

## బాణభట్టు

[ఆంగ్లమూలం : శ్రీ కె. కృష్ణమూర్తి, తెలుగుసేత: డాక్టర్ పుల్లెల శ్రీ రామచంద్రుడు· డెమ్మీ 116 పుటలు, వెల: రూ. 2–50. సాహిత్య అకాడెమీ ప్రచురణ, న్యూఢిల్లీ. ప్రతులకు: సాహిత్య అకాడెమీ, రబీంద్ర భవన్, న్యూఢిల్లీ–1 అను చిరునామాకు వ్రాయవలెను.]

అమూల్యమైన గ్రంథాలను ప్రకటించి అపారమైన సాహిత్య సేవ చేస్తున్న కేంద్ర సాహిత్య అకాడమీవారు "భారతీయ సాహిత్య నిర్మాతలు" అనే విభాగంలో ప్రాచీన, ఆధునిక భారతీయ సాహిత్య నిర్మాతలను గురించి విశిష్ట విద్వాంసులచేత గ్రంథాలు రచింపజేసి ప్రకటిస్తున్నారు. మొదట ఆంగ్లంలో ప్రచురించబడిన గ్రంథాలను, ఆయా ప్రాంతాలవారి ఉపయోగార్థం దేశ భాషలలోకి కూడా తర్జుమా చేయించి ప్రకటించడం సాహిత్య అకాడెమీవారి ప్రత్యేకత. అట్టివానిలో ప్రాచీన సంస్కృత మహాకవి, గద్య కవిసార్వభౌముడు అయిన భట్టబాణుని చరిత్రనూ, కవితా వైశిష్ట్యాన్నీ వివరించే యీ గ్రంథం ఒకటి. దీనిని కె· కృష్ణమూర్తిగారు ఆంగ్లంలో రచించగా సర్వ సమర్థులైన డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు గారు ఆంధ్రంలోకి అనువదించారు. ఆంగ్ల మూలకర్త కృష్ణమూర్తిగారు సంస్కృతాంగ్ల భాషలలో భారతీయులు, పాశ్చాత్యులు వ్రాసిన పెక్కు ప్రమాణ గ్రంథాలను ఆధారం చేసుకుని తమ రచనను తయారు చేశారు. ఇందులో ఆరు శీర్షికలున్నవి. మొదటి దానిలో బాణుని జీవిత విశేషాలను గురించీ, రచనలను గురించీ ఉన్నది. రెండవ శీర్షికలో బాణుని సాహిత్యకళ పరిశీలించబడినది. తర్వాతి మూడు శీర్షికలలో వరుసగా ఆతని చండీశతకం, హర్ష చరిత్ర, కాదంబరి సమీక్షించబడి ఉన్నవి. తర్వాతి దానిలో అతని శైలిని గురించి ఉన్నది. చివర అనుబంధంగా ఏతద్రచనకు ఉపయోగపడిన గ్రంథాల పట్టిక ఉన్నది.

సాధారణంగా మహాకవులను మధురమైన కవిత్వంతోపాటు దారిద్ర్యం వరిస్తుంది. వారి జీవితం సుఖంగా గడవాలంటే ఏ మహారాజు కరుణా కటాక్షాలో వారిమీద ప్రసరించాలి. కాని మహాకవి బాణునికి అట్టి పరిస్థితి కలగలేదు. అతడు ఆగర్భ శ్రీమంతుల బిడ్డడు. తాను సుఖజీవితాన్ని గడపడమే కాకుండా తన సహచరుల నందరినీ తనతో సమానంగా చూచి పోషించేవాడు. శ్రీమంతుల బిడ్డలు చిన్నతనంలో స్వేచ్ఛగా తిరగడం పరిపాటి. అలాగే బాణుడున్నూ స్వేచ్ఛగా కొన్నాళ్లు తిరిగాడు. అయినా మహాప్రతిభాశాలి గనుక వేదశాస్త్రాల నన్నింటినీ క్షుణ్ణంగా గ్రహించాడు. మధురంగా కవిత్వం చెప్పే సామర్థ్యం అతనికి సహజంగానే అలవడింది తల్లి అతని చిరుతప్రాయంలనే గతించినది. తన 14వ ఏట తండ్రి మరణించాడు. పితృవియోగ దుఃఖాన్ని మరచిపోవడంకోసం బాణుడు దేశ సంచారానికి బయలుదేరాడు. అతని వెనక సర్పవైద్యుడు, చిత్రకారుగు, నాట్యకత్తె, గాయకుడూ, జూదగాడు మున్నగువారు కూడా ఉన్నారు. కొంతకాలం అతడు దేశాలు తిరిగి, రాజసభలను, పేరుపడిన విద్వాంసులను దర్శించి మంచిలోకానుభవంతో తిరిగి స్వగ్రామం చేరుకున్నాడు. అతనికి ఎక్కువ తక్కువ భేదంగాని, గర్వంగాని లేవు. అయినా అసూయాపరులగు కొందరు రాజాస్థానంలోని వారు ఇతడు సత్ప్రవర్తన కలవాడు కాడని శ్రీహర్షునికి చెప్పి బాణునిపై ఆ రాజాధిరాజునకు దురభిప్రాయం కలిగించారు. కాని, శ్రీహర్షుని సపత్నీ సోదరుడు కృష్ణరాజునకు ఎక్కువ గౌరవం. ప్రభువు మణిపురంలో మకాంచేసి ఉన్నప్పుడు—వెంటనే వచ్చి రాజదర్శనం చేసుకోమని అతడు వార్త పంపాడు. బాణుడు వెంటనే పోయి రాజదర్శనం చేశాడు. హర్షుడితని స్వేచ్ఛాప్రవృత్తిని ఉటంకించి తిరస్కారభావం చూపగా, ఇతడు శ్లేషతో "కామేభుజంగతా" అంటూ అద్భుతమైన వాగ్ధోరణిలో తన యోగ్యతనూ, వంశ గౌరవాన్నీ వెల్లడించాడు. ప్రభువునకు ఇతనిపై అపారమైన గౌరవం కలిగింది. తర్వాత ఇద్దరూ మిత్రులైనారు. బాణుడు మహా రాజభోగాలనుభవించాడు. ఇతని హర్షచరిత్రవల్ల హర్షవర్ధనుని కీర్తి, కాదంబరివల్ల ఇతనికీర్తి దిగంతాలు వ్యాపించాయి. "కాదంబరీ రసాస్వాదా దాహారోఽపిన రోచతే" అనే కీర్తి కాదంబరికి వచ్చింది. సుప్రసిద్ధాలైన యితని హర్షచరిత్ర, కాదంబరి అనే రెండు గ్రంథాలూ అసమగ్రంగానే ఉండిపోయాయి. దానికి కారణం యితని అకాలమరణమనేది ఊహామాత్రమే! పార్వతీ పరిణయనాటకం ఇతని రచన అనుకోవడంపొరపాటే! రెడ్డి రాజుల ఆస్థానంలో ఉండిన వామనుడు దానికర్త. కాదంబరి అడుగు జాడల్లో 'వేమభూపాల చరిత్ర'ను వ్రాయడంవల్ల అతనికి భట్టబాణుడనే పేరు వచ్చి అతడు వామనభట్ట బాణుడైనాడు· భట్టబాణుని కాదంబరిని అతని కుమారుడు పూర్తిచేశాడు. అతని పేరు కూడా ఇదమిత్థమని నిర్ణయం జరగలేదు. మహాకవి మయూరునికీ, బాణునికీ దగ్గరి చుట్టరికం ఉన్నదనీ, ఇద్దరికీ పోటీ అని యితని చండీశతకం, మయూరుని సూర్యశతకానికి పోటీగా వ్రాయబడినదనీ కొందరు అంటున్నారు. బాణుని భార్య ఇచ్చిన శాపంవల్లనే మయూరునికి కుష్ఠు రోగం వచ్చినదనీ, దానిని పోగొట్టుకొనడానికే అతడు సూర్యశతకం చెప్పాడనీ కూడా అంటున్నారు. ఈ రెండుశతకాలూ ఒకదాని కొకటి తీసిపోనివే!

'బాణుని సాహిత్యకళ' అనే శీర్షికలో కవిత్వం ఎలా ఉండాలో బాణుడు చెప్పిన శ్లోకం గమనించదగినది.

నవోఽర్థో జాతిరగ్రామ్యా
శ్లేషోఽక్లిష్టః స్ఫుటో రసః,
వికటాక్షర బంధశ్చ
కృత్స్నమేకత్ర దుష్కరమ్''

(హర్షచరిత్రమ్)

'నవ్యమైన అర్థం, గ్రామ్యంగాలేని స్వభావోక్తి' క్లిష్టంగా లేని శ్లేష, స్పష్టంగా ఉండేరసం, వికటాక్షరాలతోడి బంధం కవితకు అవసరం. ఇవన్నీ ఒకచోట కుదరడం చాలా అరుదు' అని బాణుని అభిప్రాయం. ఇవన్నీ కూడా ఇతని రచనలో ఉండడం బాణుని వైశిష్ట్యాన్ని తెలియజేస్తున్నది.

ఈ పుస్తకంలో బాణభట్టును గురించి తెలుసుకోదగిన విషయాలన్నీ తక్కువ పుటల్లో—పాఠకులకు విసుగులేని పద్ధతిని సమగ్రంగా కానవస్తున్నవి. దీన్ని తెలుగులోనికి మార్చడానికి బహుభాషావేత్తలూ, అన్నివిధాలా తగినవారూ అయిన డాక్టర్ శ్రీరామచంద్రుడుగారిని ఎన్నుకోవడం అకాడమీవారి ఉచితజ్ఞతను తెలుపుతున్నది. ఆయన కేవలం విద్వాంసులు మాత్రమేకాదు. చక్కని కవిత్వం కూడా చెప్పగల సమర్థులు. వారు ఆంధ్రీకరించిన పద్యాలూ, వారి వచనం వలెనే ఎంతో రమణీయంగా ఉన్నవి.

ఒక్క ఉదాహరణ—

''గతప్రాయా రాత్రిః కృశతను
శశీ శీర్యత ఇవ
ప్రదీపోఽయం నిద్రావశ
ముపగతో ఘూర్ణత ఇవ,
ప్రణామాంతోమానస్త్యజపి
న తథాపి క్రుధ మహో !
కుచ ప్రత్యా సత్యాహృదయ మపి
తే చండి! కఠినమ్''

అనే సుప్రసిద్ధ మూల శ్లోకానికి వీరి అనువాదం—

''తెలతెలవార వచ్చె నిదె
తీయని రేతిరి చంద్రబింబమున్
వెలవెలబారె దీపమట
నిద్దుర పై గొన జోగుచుండె పే
రలుకయు గాదె పాద పత
నావధి; మానమదేల పీడవో
అలఘుకుచాభిషక్తి హృద
యంబును చండి! కఠోరమాయెనే?''

(పుట 4)

ఇట్టి గ్రంథం వెలువడుటకు కారకులైన మూలకర్త, అనువాదకులు, కేంద్ర సాహిత్య అకాడమీవారు, చక్కగా ముద్రించిన మద్రాసు వెల్డన్ ప్రెస్సువారు అభినందనీయులు.

శ్రీ బులుసు వేంకటరమణయ్య

## చ ర మ రా త్రి (కథలు)

[శ్రీశ్రీ. వెల : రు. 6-00లు. ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ–520004]

మహాకవి ప్రతిభ ఏకముఖీనం కాకుండా బహుముఖీనంగా విస్తరిస్తుంది ఒకవైపునుండి గొప్పకవితా సృష్టేకాకుండా ఇంకో వైపునుంచి అనేక సాహితీ ప్రక్రియల సృష్టి కవితా చైతన్యంలో అంతర్భాగంగా మహాకవులలోకనబడటం సర్వసాధారణమైన విషయం. శ్రీశ్రీ గొప్ప కవిత్వం రాశాడు. ముఖ్యంగా ఆయన సాహిత్య వ్యవసాయం కవితా సంబంధి. కవిత్వంతోనే ఆగకుండా రేడియో నాటికలు, కథలు, అనేక విమర్శక వ్యాసాలు వెలయించాడు. ఇవన్నీ కలసి గతంలో 'శ్రీశ్రీ సాహిత్యం' అనే పేరుతో ఆరు సంకలనాలుగా ఆయన షష్టిపూర్తి సందర్భంగా వెలువరించబడిన సంగతి పాఠకలోకం ఎరిగినదే. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు 'చరమరాత్రి' కథాసంకలనాన్ని మళ్ళీ ముద్రించడం ముదావహమైన విషయం. ఇందులో మొత్తం ఇరవయి కథలున్నాయి.

శ్రీశ్రీ రాసిన ఈ కథల్లో సంప్రదాయకమార్గంలో కథన పద్ధతిని, కథావస్తువును అన్వేషించడం వృథాశ్రమ. మామూలు కథలకు ఈ సంకలనంలోని కథలకు పోలికలుండవు. సాధారణంగా మనం చదివే కథల్లో రచయిత కనబడడు. కథ, పాత్రలు, సన్నివేశాలు ప్రారంభ, ఉపసంహారాలు ఒక పద్ధతిలో ఉంటాయి. అక్కడ రచయిత ప్రశక్తి ఉండదు. ఈ కథల్లో రచయిత అడుగడుగునా పాఠకునికి దర్శనమిస్తాడు. ఎందుచేతంటే కథన పద్ధతికంటె రచయిత చెప్పదల్చుకున్న భావం ప్రధానమైనది కనుక. అంటే స్వతహాగా శ్రీశ్రీ కవి గనుక ఆయన రాసిన కథల్లో కూడా ఈ కవితా ఛాయలు ప్రస్ఫుటంగా గోచరించడమే గాక కవిత్వంలో ఏ సిద్ధాంత భావనైతో చెబుతున్నాడో కథల్లో కూడా అదే సిద్ధాంత భావనను బోధించడానికి ప్రయత్నం జరిగిందని అర్థం. ఈ చెప్పడంలో కథన ప్రాముఖ్యత తగ్గడం, ఉపన్యాసధోరణి పెరగడం అనివార్యమయింది.

శ్రీశ్రీ ఎప్పుడూ ప్రయోగశీలి, ప్రగతివాది. నియమాలను అనుసరించడంకంటె ఉల్లంఘించడమే సాహిత్యంలో ఆయన చేసిన పని. అందుకే అనామిక అనే కథలో 'సరిహద్దులు వెదకడం ప్రయో

జనం లేనిపని. సరిహద్దులలో ఇమడకపోవడంలోనే ప్రజ్ఞ అనేది ఇమిడి ఉంది' అంటాడు. 'చంమరాత్రి' కథ వర్తమాన వ్యవస్థకు దానికి సంబంధించిన బీభత్సానికి ప్రతీక. ఇందులో యువకుడు ఆత్మహత్య చేసుకొనడానికిగల కారణాల వివరణ వ్యాపార నాగరికతకు చెందిన ఈ వ్యవస్థలో మానవతా విలువలు ఎట్లా విధ్వంసం చెందుతున్నాయో తెలియచెప్పడానికి నిదర్శనం. నేస్తం నేటి ప్రపంచానికి తెలిసింది ఒక్కటే విలువ ధనం.. ఎవరికివారు, తమ తెలివితేటలను, జిత్తులనూ, సామర్థ్యాలనూ డబ్బుకింద మార్చుకోడానికి ప్రయత్నించడం పరిపాటి. ధనార్జన ప్రధానమై, పరదైవమే మానవులకు మహదాశయమైపోయింది. ప్రపంచ సమస్య అంటే ఆర్థిక సమస్య. మనుష్యుల విలువలు కొలవడానికి స్పష్టంగా కనిపించే కొలత ధనం కాక మరేముంది ప్రస్తుత పరిస్థితులలో... 'నేడీ వ్యవస్థకొక నీతి లేదు. ఒక నియమంలేదు' అంటాడు ఆత్మహత్య చేసుకోబోతున్న యువకుడు. 'మానవుడే సత్యమని, మానవుడే నిత్యమని, అతనే ఈశ్వరుడ'ని నిరూపించే కథ. 'ఒసే తువ్వాలందు ' కథ భార్యాభర్తల ఆంతరంగిక మనోగత వ్యాపారాలపై పెద్ద సెటైరు. 'కోనేటి దినం' 'కోనేటి రాత్రి' 'కోనేటి జన్మ' అనే మూడు భాగాలు కలిగిన ఈ కథ అతి సామాన్యుని నికృష్ట జీవితానికి నిదర్శనం. కనీసం కలలో కూడా ఆనందం లభించని అతి భయంకర జీవితం ఈ కథలో దృగ్గోచరమవుతుంది. ఈ కథలోనే శ్రీశ్రీ కొద్దిగా స్ట్రీమ్ ఆఫ్ థాట్ టెక్నిక్‌ని ప్రవేశపెట్టాడు. 'బాధ కవిత్వానికి పర్యాయపదం' అనే కథ కవికిగాని, రచయితకు గాని ఉండవలసిన స్వతంత్ర ప్రవృత్తిని నొక్కి వక్కాణిస్తుంది. 'నువ్వు స్వయంగా అపాయాల్లోకి వెళ్ళు. ఎరువు తెచ్చుకున్న అభిప్రాయాల్ని తగులబెట్టడానికి వీలుగా ఒక అగ్గిపెట్టె నీతో తీసుకువెళ్ళడం మరచిపోకు. గుండుసూదిమీద ఒంటికాలితో నిలబడడం గొప్ప మాటే. కాని అదే అంత గొప్పకాదు ' ఇంకోకవి–ఎంతగొప్పవాడైనా నువ్వు వాడివి కావాలని ప్రయత్నించకు. ఇన్నాళ్ళూ నువ్వు అర్ధామస్వారంలాగి, ముద్రాసురిడిలాగా బతికేవు. పేపర్ వెయిట్‌లాగి, రబ్బరు స్టాంప్‌లాగ బతికేవు. వెళ్ళు జీవితంలోకి! రెండోరకం పద్యంలో కూడ బాధ ఉంటుంది. కాని అది 'బతికే బాధకాదు. బతికించే బాధ కానే కాదు' అంటాడు శ్రీశ్రీ తన దగ్గరకు పద్యాలు వినిపించడానికి వచ్చిన కుర్రవాడితో. ఈ కథలో శ్రీశ్రీ వినిపించిన ధ్వని ఒకటుంది. ప్రతి కవినీ చదవవలసిందే. అయితే చదివిన ప్రతి గొప్ప కవికి ప్రతిధ్వనిగా రచయిత ఉండకూడదని చెప్పడం కథ పరమార్థం. పోగా రచన జీవితంలోంచి రావాలనేది ఒక హెచ్చరిక. ఇట్లా ఈ సంకలనంలోని కథలన్నీ ఒక భావంయొక్క విస్తరణగా కనబడతాయి. కేవలం వారపత్రికల్లో కథలు చదవడానికి అలవాటుపడిన పాఠకలోకానికి ఇది జీర్ణంకావు. గొప్ప కథలు ఎప్పుడూ అందరికీ జీర్ణం కావు అనేది సత్యం.

శ్రీ టి. ఎల్. కాంతారావు

# మంటల జెండాలు

[అలిశెట్టి ప్రభాకర్. చిన్నసైజు 48 పుటలు; వెల 2/రు. ప్రతులకు : గ్రంధకర్త, స్టుడియో పూర్ణిమ, జగిత్తియాల్ – 505 327.]

రేగిన ఒక పైశాచిక ప్రవృత్తితో, కార్చిచ్చును పిలిచి నగరానికి దహన సంస్కారం చేయమన్న ఆవేదన, ఆక్రోశం ఈ రచయిత పేగులను తరిగివేస్తున్నవి. కాబట్టే ప్రతిదానిని నిర్మూలనదృష్టితో చూస్తున్నాడు. అయినా కవికి నవ్య భావ స్ఫురణ నవ్యపదబంధము పై స్థాయిలో ఉన్నవి; ఉపమానాలు కొత్త తీరువే. ఏదో మంచి పనిచేయాలన్న కండగాతి ఈయనను ప్రేరేపిస్తున్నది. కాబట్టే "పుట్టటం పెరగటం చావటం" బ్రతుకుకు నిర్వచనంకాదని, జీవితాన్ని ప్రయోజనకారి చేయమంటాడు.

నిప్పును ఆశ్రయాళం–ఆశ్రయించినదానిని తినేది అంటారు. అందువల్లనే ద్వేషానలం ఈయనకే ముప్పుదెచ్చి కవి మనసును కలుషితం చేసినట్లున్నది. కవితా దృష్టితోచూస్తే భాషలో భావంలో కొన్ని మంచివి :– చీకట్లో జడుసుకొంటే ఒక చెట్టే నీ చుట్టూర అరణ్యమై భయపెడుతుంది; ఒక కన్నీటి బొట్టును పరిశీలిస్తే పరిధే దొరకదు – పెద్ద భావం; రామతీర్థస్వామి కన్నీటి బొట్టులోనే సృష్టి రహస్యమున్నదన్నారు. రాజకీయ ప్రమాణాలను వాగ్దానాలను బాగా బాదినాడు. "ఆకలే చరిత్రను సృష్టించి, అన్నం ముద్దే ప్రపంచాన్ని పాలిస్తునట్టు" – బ్రహ్మాండ సత్యం! పూలను చూచి, మీకోసం అడుగునపడి అజ్ఞాతవాసమున్న వ్రేళ్లను గుర్తించమన్నది చక్కటి నవ్యధోరణి. నగరంలో అంగళ్ల వరుసను వేశ్యలతో పోల్చి, వాటి పొంతకు పోని సామాన్యుని కొనియాడుతున్నాడు. "పిరికిదనపు విరేచనాలలో పొర్లాడే" – ఇట్లాంటి మొరటు మాటలు మానితే ఈ కవితకు అందం ఎక్కుతుంది.

సేల్సు ఏజెంట్లు కావలెను

స్త్రీ పురుషులకు మేము తయారుచేయు దుస్తులకు సేల్సు ఏజెంట్లు కావలెను.

నెలకు రు. 500 సంపాదించవచ్చును.

**HANDTEX PRINTERS**
**MEERUT CITY (U. P)**

# అందాల కాంత

[తెనుగు ఆంగ్ల కవితా సంపుటి. డెమ్మి – 40 పొరటలు; ధర : 3/ రు ; ప్రతులకు : లక్ష్మీ ప్రింటింగ్ ప్రెస్; వీక్లీబజార్; నిజామాబాద్–503 001.]

ఇదంతా ప్రణయోన్మాద ప్రలాపం. నేటి – దోపిడి చెమట కంపు కవిత్వ దినాలలో దీనిని పాతబాణి అనవచ్చు కాని, ప్రేమ శాశ్వతమైనది గదా! ఈ కవి ఊహలలో సొంపు వ్రాతలో ఇంపు ఉన్నది. తెనుగు నుడికారం ఎన్నదగి ఉన్నది. ''అందాల కాంత'' శీర్షిక భావ సౌకుమార్యం కలిగి ఉన్నది:– యవ్వనము (యౌ)తెచ్చిన ఒంపు సొంపులు; నీ కనుచూపుల పరిధిలో ఆడుకోవాలని, మెత్తని నీ మనసు పరచిన పచ్చిక బయలుపై నేనొక ప్రణయ గీతికను పాడుకోవాలని; నీ నిండైన నవ్వులో ధ్వని తరంగాలు పగిలి బద్దలై పోతుంటే, వయసుపెట్టే గిలిగింతలు, మనసునుపెనవేయు మధుర క్షణాలు. ''బొమ్మలకు ప్రాణాలొస్తే''లో బ్రతుకంతా యౌవనం కావాలంటాడు; ఒడుదుడుకులు లేకుంటే జీవితం విసుగు పుట్టిస్తుంది గదా; ఇదే శాశ్వతమైతే దాని బాధ చెప్పాలనా? 30 ఏండ్ల దేవతల అగచాట్లు పురాణాలు వర్ణించడం వినలేదా ?

విశిరాత్రి – ఇదేంది పేపర్ కాగితమన్నట్లు? దొండపండ్లను బోలు పెదవులని – ప్రణయంవల్ల ప్రబంధ ధోరణిలో పడినాడు అవును! పెదవికి రంగువేసుని ఆడుది ఆరణ్యక అనిగదా నవనాగర కుల భావన.

ఇక ఇంగ్లీషు – ఇది తెనుగు ఇంగ్లీషు. దానికి జాత్యమైన ప్రేజ్ లేదు. కవి, వ్రాయాలన్న చేతిగుల తీర్చుకొన్నాడు.

# మమత

[చారిత్రక కావ్యం. మహమ్మద్ అలి. డెమ్మి 128పేజీలు, మూల్యం : 6/– రు., ప్రతులకు : మునివ్వర్ పబ్లికేషన్స్, ఖిల్లా లోపల, ఖమ్మం.]

నిజాం పాలనలో ఉరుదూచేత గొంతు నొక్కబడినా, పుట్టుకతో ముస్లిం అయినా తెనుగును వలచి, ఆమెతో ప్రణయ భాగవతాలాడి కావ్య కన్యకల కని, ఆంధ్ర సాంప్రదాయిక మహాకవులలో సపంక్తి భోజనం చేసిన మహమ్మద్ అలి ప్రజ్ఞావంతుడనక తప్పదు. ఈయనకు కవిత్వం ఉగ్గుపాలతో కలిపి పోయబడినది. పరిశ్రమ భాషా పాటవాన్ని అబ్బజేసినది. లోకజ్ఞానం భావుకతను పెంచినది నేటి యతి మతిలేని కవితా కల్లోలంలో మేరునగధీరంగా నిలిచి, ఆంధ్ర సాహిత్య సత్ సంప్రదాయాన్ని ఈ ముస్లిం ఆంధ్ర కవి సాగించినాడు. ఈ కవిత పురోగతి కాదంటే, అది సాహిత్యలోకంలో గతిలేని మాట.

ఈ బహుభాషావేత్త పెద్ద ప్రభుత్వోద్యోగిగా ఉండిగూడ ఇంతటి మధుర కవితా శక్తిని పెంచుకొనడం అరిది గుణం. అలి కవిత గుణ గౌరవభూషి–లలిత భావ బంధుర. ఒక చిన్న చారిత్రిక సంఘటనకు ఇందోపల కవితా రూపం ఇచ్చి నిలబెట్టినాడు, కొన్ని పద్యాలు ఏరి పళ్లెరంలో బెడుతున్నా :–

మూగవోయిన వీణ యా ముగిత బ్రతుకు,
ధ్వని సమాధులు గలవెన్నొ తంత్రులందు.

అప్పులలో ద్వర్థి గమనించండి:– ఇదీ కవితా ప్రౌఢిమ !

అప్పులొసంగె నర్కునకు నంబుధి మున్ను నిదాఘమందునన్
ఉప్పుల కల్తియున్న, నిను దుష్కృత వాయ గ్రహించె నెట్టులో;
ఇప్పుడు, ప్రావృషన్ మరల నిమ్మడి ముమ్మడు తీయతీయనౌ
అప్పులుగాను బుచ్చుకొను నంబుధి; యప్పుల వారలింతయే !
(అప్పు=నీరు, ఋణము)

విధిచే నోటమి జెంది తేజముడుగన్ వేవెల్గు పర్వెత్తె
కు ధరా వాస మొనర్చ పశ్చిమమునన్.

పావురాళ్ళ ఉత్ప్రేక్ష మనోజ్ఞం.

కలియుట విడివడుట విధిచేష్ట; దానినిఅంటున్నాడు కవి:–

ఒక చెట్టాకు ధరపై
ఒకచో బడె గాని, గాలి యురవడిలో వే
రొకచో విడిపోవుట గని
యొకింత నిట్టూర్చి మమత యూరక యుండెన్.

# వెలుగు

[కరపత్రం. ఎడిటర్ : వెంపలి వెంకట శివప్రసాద్, చింతా వారి వీధి, అనకాపల్లి.]

ఈ కరపత్రం ఎర్ర జీరల కండ్లతో, ఎర్రజెండాలతో ఆధునిక కవితా లోకంపై కర్రపెత్తనం చేయాలని బయలుదేరినది. ఇది రూపంలో ఎంత చిన్నదో గుణంలో అంత సున్నది. మినీ కవిత కొత్తగా ఆకాశాన్నుంచి ఊడిపడినట్లు, గోరంత కొండంత చేయబడుతున్నది. ఇందు ఒక రచయిత ఈ ప్రక్రియను పొగడతూనే మన శతకాలు ముక్తకాలు ఈ జాతివే అన్నాడు. ఈయన పుణ్యాన మన పాత చిన్న కవితలు చాటువులు బ్రతికినట్లే. వీరు తెనుగు కవిత్వానికి తెనుగు పేరు పెట్టకూడదా? ఈ నూతన ప్రక్రియలన్నీ సోడాబుడ్డి పొంగు వంటివి; ముమ్ముందు ఏమి నిలుస్తవో చూస్తుందాం.

# చీకటి తరగలు

[కవితా సంకలనం. డెమ్మి 52 పేజీలు; వెల : 3/- రు. నిశి పబ్లికేషన్స్; 20-10-18, రాగిమాను వీధి, మిట్టూరు, చిత్తూరు-517001.]

నిశి పబ్లికేషన్‌ను కాబట్టి చీకటి తరగలు బయలుదేరడం బాగానే ఉన్నది. మధ్యాహ్నం 3-45 గంటని పేర్కొనడంలో ఏమి విశేషమో తెలియకున్నది; కొంచెం కొంత వైరితనం (ఎక్‌సెన్‌ట్రిక్) అనవచ్చు. కాని, ఈ ఐదుగురి తరగలు తరకలు (పొల్లుగింజలు)గా తేలిపోవడం విచారకరం. నేటి నూతన ప్రపంచంలో ఉండి భావి సంతతికి హితం చెపుతున్నారు-వీరు. పుస్తకం మొదలు తుదలు అయోమయం వీరు అనుకొన్నదేదో చెప్పినదేదో తేలడం లేదు; ఆ ప్రాంతపు తిరుమలేశ్వరునికైనా తెలుస్తుందో లేదో! ఎన్ని మార్లయినా స్మశానం (శ్మశానం) అంటారు. స్పెలింగ్ ఎట్లా ఉంటే ఏమని కాబోలు వీరి భావం.

గణితపు గుర్తుల ఖండికలు అంతే పట్టేయడం లేదు. ఈ యువకులు స్థిమితం తెచ్చుకోవాల.

కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామరెడ్డి

# ఏడు నవలలు

## ఓనమాలు

[రచన : మహీధర రామమోహనరావు. వెల : ఎనిమిది రూపాయలు, ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-520004]

1947నాటి తెలంగాణా సంఘర్షణలను ఇతివృత్తంగా శ్రీ రామమోహనరావు యీ నవల వ్రాశారు. ఇది కేవలం రాజకీయ నవల మాత్రమే కాదు. సాంఘికమయినది కూడా. ఆనాటి తెలంగాణాలో జరిగిన సంఘర్షణలను రాజకీయంగా మాత్రమే కాకుండా అక్కడి ప్రజల జీవిత పరిణామంలో ఒక దశగాకూడా పరిగణించితే ఇది మంచి నవల అని సహృదయులకు అనిపించుతుంది. సామాన్య మానవుల జీవితానికి ప్రాతిపదికగా ఒక తాత్విక సూత్రంవుంటుంది. ప్రేయసీ ప్రియులుగా కనిపించిన సామాన్యులు కూడా రాజకీయోద్యమానికి చేయూత నివ్వగలిగారంటే తాత్విక సిద్ధాంతాలు మానవుల ప్రవర్తననుంచి రూపొందినవేననీ, సిద్ధాంతాలకోసం సిద్ధాంతాలు యేర్పడలేదనీ విశదమవుతుంది గదా!

ఈ నవలలోని ఇతివృత్తం అంతా సత్తెమ్మ, వెంకటయ్యల మీదుగా నడిచింది. రాజకీయమైన ఇతివృత్తాన్ని ఇలా కాయకలాపంగా ప్రారంభించడంలో యీ రచయిత నైపుణ్యం, పాండిత్యం అవగతమవుతాయి. ఇతివృత్తం రాజకీయమూ, సాంఘికమూ అయినది కాగా యీ రచయిత కథను ఎలా ప్రారంభించారో చూడండి: ''ఆమె తల రెండు అరచేతుల్లో పట్టుకుని ఎత్తి తనవేపు తిప్పుకున్నాడు. ఒత్తి ఒత్తి పెదవులమీద వూదాడు.'' ఈ వాక్యం చదివి ఇదేదో సెక్సు నవల అని భ్రమిస్తే పాఠకుడు పప్పులో కాలువేసిన వాడవుతాడు. ఇలా ప్రారంభించడంవల్ల పాఠకుడు పుస్తకమంతా చదివేట్టుచేసే చాతుర్యం ప్రదర్శితమవుతుంది. వెంకటయ్య, సత్తెమ్మల సంభాషణలద్వారా ''సంగం'' ప్రస్తావన వచ్చింది. 'సంగం' అంటే ఆంధ్రమహాసభ సత్తెమ్మ సంసార జీవితాన్ని పరిచయం చేస్తూ సత్తెమ్మ భర్త ''పెళ్ళాంమీద చెయ్యి వెయ్యకుండానే మంచం మీద శరీరం జేరవేసేడు'' అని వ్రాశారు యీ రచయిత. ఈ వాక్యంలో చమత్కారమే కాకుండా శ్లేషార్థం కూడా వున్నది. వెంకటయ్య, సత్తెమ్మల ప్రథమ సమాగమాన్ని యీ రచయిత చిత్రించిన తీరులో శృంగారమే వున్నది కానీ అశ్లీలతలేదు. సత్తెమ్మ వితంతువు. ఆ కులంలో వితంతువులకు నూరు మనువులేవు. అనుభవించడానికి అవరోధం కానట్టి కులం, వివాహం చేసుకొనడానికి పెద్ద అవరోధంగా నిలబడడం, ఆ అవరోధాల కారణంగా సత్తెమ్మలో రకరకాల ఆలోచనలు కలగడం యీ నవలలోని వైవిధ్యానికి బలం ఇస్తాయి.

సత్తెమ్మ తమ్ముడు రంగయ్య ఆలోచనల తీరూ, సత్తిరెడ్డి అనే ఆంధ్రమహాసభ కార్యకర్తతో ఆ వూళ్ళోని యువకుల సమావేశాలూ, వెంకటయ్యతో సత్తెమ్మ పునర్వివాహం ప్రతిపాదనను ఆమె కుటుంబంలోనివారూ, స్నేహితులూ ప్రతిఘటించిన తీరూ యీ నవలకు మానవతను చేకూర్చాయి 1947 ప్రాంతంలో తెలంగాణా గ్రామీణుల జీవితాన్ని ఈ నవల పరిచయం చేస్తుంది. ఆ గ్రామం జాగీర్దారుకు అల్లుడయిన రాజారెడ్డి ఆలోచనల తీరుకు ఒక ఉదాహరణ! ''మనుష్యుడు బతికేది ప్రేమించడానికా? బాధించడానికా? ఒకళ్ళ సుఖం చూసి సంతోషించడెందుకు? ఆ సుఖం తాను ప్రతిష్ఠగా భావించిన దేనికో నష్టకరంఅని ఎందుకనుకోవాలి? ఆ సుఖాన్ని నాశనం చేసినా ప్రతిష్ఠ నిలబడేదీలేదు-దానిలో ఆనందమూలేదు. కాని, అతని ఆలోచనలు అటే నడుస్తాయి. బహుశా దుఃఖం, బాధ మనుష్యుణ్ణి ఆకర్షిస్తాయేమో!''

జాగీర్దారీ వ్యవస్థను ఈ రచయిత గతితార్కికదృష్టితో చిత్రించారు యీ నవలలో. రజాకార్ల అఘాయిత్యాలనూ, పంచమాంగదళం కార్యకలాపాలనూ యీ నవల పరిచయం చేస్తుంది. ఈ తరం రాజకీయవాదులు కూడా చదువవలసిన మంచినవలలో ఇది ఒకటి.

## ఇన్‌క్రెడిబుల్ గాడెన్

[రచయిత : డాక్టర్ కేశవరెడ్డి, వెల: ఏడురూపాయలు, ప్రచురణ : విశ్వప్రభ పబ్లిషింగ్ హౌస్; నేండ్రగుంట, చిత్తూరు జిల్లా.]

రాయలసీమలోని హరిజనుల అగచాట్లను ఈ రచయిత ఈ నవలలో చిత్రించారు భాగ్యవంతులందరూ నిర్దయులు — అమానుషంగా ప్రవర్తిస్తారు అనే దృష్టితో యీ నవలలోని ఇతివృత్తాన్ని డాక్టర్ కేశవరెడ్డి మలిచారు. దీనుల స్థితి, దుర్బల వర్గాల స్థితి దేశమంతటా ఒకే విధంగా వున్నది వారి దుస్థితికి ఇతరులు ఎంత కారణమో వారు కూడా అంతే బాధ్యులని యీనవల చదివే సాహితీ ప్రియులకు అనిపించుతుంది. ఈ కథలోని నాయకుడు రామచంద్రుడు, అతని భార్య, నాగ, కొడుకు కృష్ణుడు దుర్బలులు. ఎదురుతిరగడం వారికి చేతకాదు. వారిలో ఆవేశం వున్నదేగాని కార్యదక్షతలేదు. నిజాయితీపరులందరూ బహుశా యీ విధంగానే బాధ పడుతూంటారు వర్తమాన కాలంలో వారి నిస్సహాయ స్థితికి వారి కులంవారే చాలా వరకూ కారణం అనడం యీ రోజులలో చెల్లుతుందా !

తమ మిత్రులెవరో, శత్రువులెవరో తెలియనంతటి అజ్ఞానంలో హరిజనులూ, ఇతర నిమ్నజాతులవారూ యీనాడున్నారా ? మొహం మీద కామందు వుమ్మేసినా హరిజనులు నోరు మూసుకుని పడివుంటారా యీనాడు? ఇలా చిత్రించడంలో రచయిత సాంఘిక ధర్మాన్ని ఎంతవరకూ పాటించారు ? పీడన ప్రకృతిలోనే వున్నదనే సిద్ధాంతం ఎంతవరకూ సమంజసం? మానవుని కార్యకలాపాలనుంచి వచ్చిన విపరీతాలలో పీడన ఒకటి కాదా ?

హరిజనవాడలోని దాదాపు అందరూ తనకు అనుకూలంగా సాక్ష్యంచెప్పగా, ఒక్క రామచంద్రుడు మాత్రమే అబద్ధపుసాక్ష్యం చెప్పలేదని అతని మీద పెదరెడ్డి అంత పగపడతాడా ? గ్రామాలలో యిలాంటివి జరుగుతూండవచ్చు. కానీ మానవునిలోని 'పగ' ప్రవృత్తిని అంత క్రూరంగా చిత్రించడం ద్వారా రచయిత సాధించిన ప్రయోజనం ఏమిటి ? సరే .. ఆ పాత్రను అలా వుంచండి. రామచంద్రుడి తోటి హరిజనులలో ఒకడయిన సత్తెయ్య పాత్రను ఎలా సమర్థించాలి? పెద్దరెడ్డి బంట్లుగా హరిజనులందరినీ చిత్రించడం ఏమంత న్యాయం? చదువురాని కారణంగా రామచంద్రుడు అన్ని అవస్థలు పడవలసి వచ్చిందని చిత్రించితే అది మరొక రకంగా వుండేది. చదువు సంగతికి ప్రాముఖ్యత లేకపోవడం యీ నవలలో పెద్ద లోపంగా కనిపించింది. అలాకాదు ఒక సిద్ధాంతం ప్రాతిపదికన కేశవరెడ్డిగారు యీ నవల వ్రాశారని అనుకుందామంటే మరి అర్జునుడి పాత్రను ఎలా సమర్థించాలి. హరిజనుల దుస్థితిని చిత్రించడం వరకూ యీ రచయిత కృషి బాగున్నది. ఈ నవల లక్ష్యం బహుశా అదేనేమో? కానీ, ఇది మెచ్చదగిన రచన అని అనగలమా? భూస్వాములందరూ రాక్షసులనడం న్యాయమా ? ఈ నవలకు ''ఇన్‌క్రెడిబుల్ గాడెన్'' అనే పేరు ఎంతవరకూ సమంజసము ?

## దరిచేరిన కెరటం

[రచన: శ్రీమతి పి. శారదానాథ్, వెల: అయిదు రూపాయలు, ప్రచురణ—స్పందన సాహితీ సమాఖ్య. మచిలీపట్నం ]

రాధ, భానుమతి, డాక్టరు వేణు, నర్సు మేరీ, పుష్ప, డాక్టరు ధర్మారెడ్డి, జానకి అనే పాత్రలు యీ నవలలో ప్రధానమయినవి. వారి మనస్తత్వాలనూ, ఆలోచనలనూ వివిధ కోణాలనుంచీ విశ్లేషించడానికి యీ రచయిత్రి యీ నవలలో ప్రయత్నించారు. గోపాలకృష్ణుడల్లే జల్సాగా తిరిగే డాక్టరు వేణులో ధర్మదృష్టి, నీతి నియమాలు, బాధ్యత, కర్తవ్యదీక్ష, మానవత నిద్రాణంగా వుంటాయి. అతను భానుమతిని వివాహమాడిన తర్వాత ఆ మంచి గుణాలన్నీ వికసించి, ఇది తప్పు—చేయరాదు అని తెలిసిరావడం జరుగుతుంది. అతనంటే యేమాత్రం గౌరవంలేని రాధ తన స్నేహితురాలు భానుమతి డాక్టరు వేణువల్ల పెద్దదెబ్బ తినబోతున్నదని కలవరపడుతుంది. ''ఏమి చూచి అతన్ని ప్రేమించా''వని స్నేహితురాలిని ప్రశ్నించుతుంది. కృష్ణుడు అంతమంది గోపికలతో విహరించినా రాధ దశను గోపికలు చేరుకోగలిగారా? అని ఎదురు ప్రశ్న వేస్తుంది భానుమతి.

ఈ నవలలోని ఇతివృత్తం సాధారణమయినదే. మిత్రుల ఆప్యాయత, ''సత్సంగత్వే నిస్సంగత్వం'' అన్నట్టు ఒక స్త్రీ నడవడిలో మార్పు రావడంవంటి అంశాలను యీ రచయిత్రి చిత్రించిన తీరు ప్రశంసనీయంగా వున్నది. ఒక కథ వ్రాయాలన్నా, ఒక నవల వ్రాయాలన్నా మనోవిశ్లేషణ అవసరమే. ఆ విశ్లేషణ కేంద్రంగానే కథగానీ, నవలగానీ నడుస్తుంది. విశ్లేషణ ఎంత బాగా జరిగిందనే అంశాన్నిబట్టే సాంఘిక నవలల సాహిత్య ప్రయోజనం నిర్ణయమవుతుంది. ఈ నవలలోని జానకీదేవి పాత్ర కాలగమనానికి చిహ్నం. పాఠకులను యీ పాత్రద్వారా రచయిత్రి భ్రమింపజేసి, కథాకథనంతో మీ వూహ పొరపాటు అని తేల్చుతుంది. ఇంతకంటే మరేమికావాలి మంచి నవలకు? సాధారణ విషయాన్ని, అనుభవాన్ని అసాధారణంగా, సార్వజన్యకంగా చిత్రించగలగడంలో యీ రచయిత్రి నేర్పరితనం వ్యక్తమవుతుంది.

## మట్టి మనుషులు

[ఒడియామూలం : కాళిందీచరణ పాణిగ్రాహి, తెలుగుసేత పురిపండా అప్పలస్వామి. వెల : ఆరురూపాయలు.]

ఒడియా భాషలో ''మట్టి మనుషులు'' నవల పాతిక సంవత్సరాల కిందట తొలుత వెలవడినది—1979లో రెండవసారి ప్రచు

రితమయినది. ఈ నవలలోని ఇతివృత్తం మధ్యతరగతి ఉమ్మడి కుటుంబ జీవితం. ఇతివృత్తం ఎంత సాధారణమైనదో అంత అసాధారణంగా కాళిందీచరణ పాణిగ్రాహి కథనాన్ని నడిపారు. ఆస్తి గురించి తోటికోడళ్ళమధ్య తగాదాలు రావడం మధ్యతరగతి కుటుంబాలలో మామూలే. కానీ, అన్నదమ్ములమధ్య కుదురు అనేదొకటి వుంటే ఆ తగాదాల కారణంగా వారు విడిపోవలసిన అవసరం వుండదు. ఆ కుటుంబానికి శామపధాను పెద్ద. ఆయన భార్య ఆయనకు అనుకూలవతి. ఆయన రైతు. నిజాయితీపరుడు. వూళ్ళో తగాదాలు కోర్టుకెక్కకుండా ఆయన వాటిని పరిష్కరించుకుంటాడు బీదలను ఆదుకుంటాడు. ఆయన పెద్ద కొడుకు బరజూ, చిన్న కొడుకు ఛకడీ. తొలుత భార్య, ఆ తర్వాత శానుపధాను మరణిస్తారు.

మరణశయ్యమీద శామపధాను కొడుకుతో ''ఒరే బాబూ నా పనేమో అయిపోయింది. ఇక మీ సంగతి మీరు చూచుకోండి. ఒక్కటిమాత్రం నేను చెపుతున్నాను. మీరు యిద్దరూ అన్నదమ్ములు కదూ. చూడూ పొలంమధ్య గట్టుపడకూడదు. కొంప మధ్య గోడ లేవకూడదు. ఇదిమాత్రం నువ్వు కాయాలి'' అని చెప్పాడు.

ఆ తండ్రి మాటను నిలబెట్టడానికి,ఆయన చెప్పినట్టు చెయ్యడానికి బరజూ చేసిన త్యాగం, కృషి యీ నవలలోని ప్రధాన ఇతివృత్తం. భారతీయ సంప్రదాయాని కనుగుణంగా వ్రాసిన నవల ఇది. ఆ గ్రామ పంచాయతీ ప్రెసిడెంటు హరిమిశ్రా బరజూ, ఛకడీలను విడదీయాలని యత్నిస్తాడు. దానికి కారణం తండ్రివలెనే బరజూ కూడా నిజాయితీపరుడయి గ్రామంలోని ప్రజల గౌరవాభిమానాలను పొంది, వారిలో వారు కీచులాడుకొనకుండా చేయడం. మరొక చెంప ఛకడీ భార్య వేరే పోదామని ఛకడీకి నూరిపోసి అతని మనసును చెడగొట్టింది. అన్నకు చెప్పకుండా ఆ యేడు పొలంలో పండిన పెసలూ, బెల్లం అమ్మి డబ్బంతా తనే వాడుకుంటాడు. అదంతా బరజూ భార్యకు కోపం కలిగించింది. అయినా భర్త ఆదేశం ప్రకారం నోరెత్తదామె. బరజూ త్యాగదృష్టి ఫలితంగా అతని భార్యలో పరివర్తనం వచ్చింది. ఛకడీ తరఫున పెద్దమనిషిగా హరిమిశ్రా బరజూ దగ్గరకు రాయబారం వెళ్ళి ఆస్తి పంపిణీ చేయవలసినదిగా కోరుతాడు. బరజూకు తన తండ్రి చెప్పిన మాటలు గుర్తొచ్చినవి. ఆస్తి, ఇల్లూ అన్నీ తమ్ముడివేనని చెప్పి, మర్నాడు ఇంటినుంచి భార్యా బిడ్డలతో బరజూ బయలుదేరాడు. గ్రామంలోని వారందరూ విచారపడినారు. బరజూ మరదలు నేత్రమణికి మాత్రం అదంతా ఆనందం కలిగించింది. హరిపురం గౌరంగవేణు కోరికను మన్నించి బరజూ అతని ఇంటికి వెళ్ళాడు. సంతనుంచి తిరిగి వచ్చిన ఛకడీ అదంతా తెలుసుకుని చాలా ఆవేదన పడ్డాడు. తను ఎంత తప్పు చేసినదీ, ఎంత విశాలహృదయుడయిన అన్నను కోల్పోయినదీ ఛకడీకి అవగతమవుతుంది. మరుసటి ఉదయం బయలుదేరి హరిపురం గౌరంగవేణు ఇంటికి వెళ్ళి వీధి గుమ్మంలో కూర్చున్నాడు. బరజూ కుమారుడు దామ ''అమ్మా వాలే చిన్నాన్న వచ్చాడు'' అన్నాడు. బరజూ బయటికి వెళ్ళి తమ్ముడిని అడిగాడు ''ఏం రా నువ్విటు వచ్చేశావు.'' ఛకడీ మెల్లిమెల్లిగా చెప్పాడు ''నేనూ వస్తాను' ''నువ్వెక్కడికిరా' అన్నాడు బరజూ. ''మీరు ఎక్కడికి వెళితే అక్కడికి'' అని చెప్పాడు ఛకడి హృదయాన్ని కదిలించే గొప్ప నవల ఇది. శ్రీ పురిపండావారి అనువాదం చక్కగా వున్నది. ఈ కాలంలో యీ నవలలోని పాత్రలవంటి ధర్మనిరతు లెంతమంది వుంటారు? ఈ నవలలోని సాంఘిక ధర్మాన్ని ఎంతమంది గ్రహించి ఆదరించగలరూ?

## చుట్టాలు

[రచన : రంగనాయకమ్మ. వెల : నాలుగు రూపాయలు, ప్రచురణ : స్వీట్‌హోమ్ పబ్లికేషన్స్, హైదరాబాద్.]

బస్తీలలో నివసించే మధ్యతరగతి కుటుంబాల వారి ఇండ్లకు చుట్టాలొస్తే, ఆ కుటుంబీకులు రకరకాల ఇబ్బందులకు లోనుకావలసి వస్తుంది అవతలివారి ఇబ్బందులను గమనించి, సర్దుకుపోలేని చుట్టాలయితే ఇబ్బందులు మరీ ఎక్కువవుతాయి. అలాంటి చుట్టాలవల్ల వచ్చే యిబ్బందులు గమనించి, సర్దుకుపోలేని వ్యక్తి భర్త అయితే, ఆ గృహిణి ఇబ్బందులు మరీ ఎక్కువవుతాయి. ఇటువంటి చుట్టాలకంటే ఇంగితజ్ఞానంవున్న మిత్రులు చాలా మేలన్నదే యీ నవలలోని ఇతివృత్తం. ఈ నవలలోని వరలక్ష్మి వంటి భార్యలూ, రామ్మూర్తి వంటి భర్తలూ అన్ని పట్టణాలలోనూ వుంటారు. కానీ, శకుంతల, కనకమ్మవంటి వ్యక్తులు యీ రోజులలో కూడా వుంటారా? వారు భాగ్యవంతులయినప్పుడు, ప్రతిచిన్న సౌకర్యం కోసమూ ఇతరుల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడినట్టు,

ఆదివాసి జాతులకు ప్రత్యేక మండలాల ఏర్పాటు నేటి వార్త.
గిరిజనులకు స్వయంపాలిత ప్రత్యేక ప్రాంతాల సూచన ఏనాటిదో
గిరిజన, బహుజన జనజీవిత సంస్కృత గాథల చర్చలకు చదవండి.
కళింగదేవ
వెల రు. 30 లు.
సంస్థలు కొనుటకు
ఆమోదింపబడెను.
అనేకు లెరుగని అంశాలు, అనన్య దుర్లభమైన ఛాయా చిత్రాలకు
మా ప్రచురణల ప్రత్యేకత మైలారదేవ రు. 10 గుడీ గుంపా లేవు.
మా ప్రచురణలు విశాలాంధ్ర బుక్ హవుస్ బ్రాంచిల్లోనూ ఉన్నాయి.
వర్మన్ పబ్లికేషన్స్, తాడేపల్లిగూడెం–534101

తమకు ఆతిథ్యం ఇచ్చినవారి ఇబ్బందులను బొత్తిగా పట్టించుకొనక పోవడం, వారి ఆశయానికి దెబ్బకాదా? పోతే నారాయణ అనే మిత్రుడిని మరీ అంత ఎక్కువగా పొగడడం యేమంత సమంజసం? పసిపిల్లవాడికి మొలతాడు కట్టడం గురించిన ప్రస్తావన యీ నవలలో అంతగా అతికినట్లు కనిపించదు. స్నేహితుని పిల్లవాడు ఉయ్యాలలో దొడ్డికి వెడితే ఆబిడ్డను బావిదగ్గరకు తీసుకునిపోయి, స్నానం చేయించడం, ఉయ్యాలను వూడదీసి, శుభ్రం చేయడం వంటి పనులు నారాయణ చేశాడని చిత్రించడం కొంచెం అతిశయోక్తిగా వున్నది.

## స్వేచ్ఛాపథం

[ఇంగ్లీష్ మూలం : హువర్డ్ ఫాస్ట్, పరిచయం : రంగనాయకమ్మ, వెల : అయిదు రూపాయలు, ప్రచురణ : స్వీట్‌హోమ్ పబ్లికేషన్స్, హైదరాబాద్.]

ఆంగ్లంలో హువర్డ్‌ఫాస్ట్ వ్రాసిన 'స్వేచ్ఛాపథం' (ఫ్రీడమ్ రోడ్) నవలను పాతిక సంవత్సరాల కిందట అశ్వనీకుమార దత్తు తెలుగులోకి అనువదించారు. తనపరిచయంతో రంగనాయకమ్మగారు ఆ నవలను ఇప్పుడు మళ్ళీ ప్రచురించారు. 1867 నుంచీ వోటు హక్కు నీగ్రోలకు లభించడంతో యీనవల ప్రారంభమై 1876లో హేస్ అమెరికా అధ్యక్షుడుగా రావడం, నీగ్రోల పరిస్థితులు దుర్భరమైపోవడంతో (యీ నవలలోని ఇతివృత్తం) ముగుస్తుంది. ఈ నవలలోని ఇతివృత్తం, అమెరికా, అమెరికాలోని దక్షిణ కరోలినాలోని — ఇరవై రెండు వేల ఎకరాల కార్వెల్లు జమీకి సంబంధించినది. కొందరు శ్వేత జాతీయులు, నీగ్రోల వోట్లతో రాష్ట్ర శాసన సభకు ఎన్నికయిన గిడియన్ అనే నీగ్రో కృషికి ఈ నవలలో ప్రాధాన్యత వున్నది. ఆజమీని ప్రభుత్వం వేలం వెయ్యాలని నిర్ణయించినప్పుడు అంతకాలమూ ఆ గడ్డను నమ్ముకుని బ్రతికిన శ్వేత జాతీయులనూ, నీగ్రోలనూ కలుపుకువచ్చి కొంత భూమిని వేలంలో గిడియన్ బృందం కొంటుంది. తన ప్రాంతంలోని ప్రజల స్థితిగతులను మెరుగుపరచడానికి గిడియన్ చాలా కృషి చేశాడు. వారు బాగుపడడం సైఫాన్ వంటి దొరలకు ఇష్టం వుండదు. అంతలో 1876 ఎన్నికలలో రిపబ్లికన్ పార్టీ అభ్యర్థిగా హేస్ అమెరికా అధ్యక్ష పదవికి ఎన్నికయినాడు. దక్షిణాదిన నీగ్రోల స్వాతంత్ర్యాన్ని అంతవరకూ కాపాడుతూండిన సైన్యాల ఉపసంహరణకు కొత్త అధ్యకుడు ఆదేశమిచ్చాడు. అమెరికాలోని 'క్లాను సంఘం' దౌర్జన్యాలు అధికమయినాయి. గిడియన్ కుమారులిరువురూ ఆ దౌర్జన్యాలకు ఆహుతి అయినారు. క్లాన్ సంఘం తాలూకు దుండగులు ఫిరంగులతో, నీగ్రోలు, కొంతమంది శ్వేతజాతీయులూదాగిన కార్వెల్ భవనంపై దాడి జరిపారు. కార్వెల్ భవనం చితిగా మారినది. ఇది చారిత్రక నవల. మానవ చరిత్రలో అభివృద్ధి శక్తులు ఎప్పుడూ బలహీనంగానే వున్నాయి. గూండాకు వుండే బలం బుద్ధిమంతుడికి ఎక్కడనుంచి వస్తుంది? మానవేతిహాసంలో అదొకదశ. ఆదృష్టితో వ్రాసిన మంచి నవలలలో ఇదొకటి.

## టామ్ మామ ఇల్లు

[అంకుల్ టామ్స్ కాబిన్స్ ఇంగ్లీషు మూలం : హారియట్ బీషర్‌స్టోవే, పరిచయం : రంగనాయకమ్మ, వెల : ఎనిమిది రూపాయలు, ప్రచురణ . స్వీట్‌హోమ్ పబ్లికేషన్స్, హైదరాబాద్.]

అమెరికాలోని నీగ్రో బానిసల జీవితాలను ఇతివృత్తంగా వ్రాసిన నవల 'అంకుల్ టామ్స్ కాబిన్'. ఒకరి ప్రాణాలనూ, సుఖ స్వాతంత్ర్యాలనూ లాగుకొనే హక్కు మరొకరికి లేదని వాదించిన అమెరికా స్వాతంత్ర్యవాదులు తమ దేశంలో బానిస విధానాన్ని రద్దు చేయలేకపోయినారు. 'అంకుల్ టామ్స్ కాబిన్' నవలతో అమెరికా అంతర్యుద్ధం ప్రారంభమయినదని అప్పటి అమెరికా అధ్యకుడు అబ్రహామ్ లింకన్ యీ నవలను ప్రశంసించాడు. ఒక చెంప బానిసల జీవితాన్ని మరొక చెంప వారి దైవచింతననూ, సౌశీల్యాన్ని, బానిసత్వ విధానం గురించి అమెరికా, ఉత్తర దక్షిణ రాష్ట్రాలమధ్య వుండిన అభిప్రాయ భేదాలనూ యీ నవలలో రచయిత్రి చిత్రించారు. అమెరికాలోని నీగ్రోల బానిసత్వం సమస్యను ప్రపంచం దృష్టికి తెచ్చిన మొట్టమొదటి నవల ఇది. ఈ నవలలో ప్రస్తావించిన కొన్ని సమస్యలు యీ కాలంలో కూడా ఏదో ఒకరూపంలో మానవాళిని వేధించడం లేదా! ఈ నవలలోని టామ్ అహింసావాది. ఈ నవలను చదివిన ఒక రాచకుటుంబపు స్త్రీ (సియాంలో) తన 130 మంది బానిసలకూ స్వేచ్ఛ ఇచ్చేసిందట, ఇది మంచి నవల అని చెప్పడానికి అంతకంటే మరేమి నిదర్శన కావాలి.

రంగనాయకమ్మగారు చేసిన అనువాదం సరళంగా వున్నది. ఆమె చారిత్రక పరిజ్ఞానానికి నిదర్శనం యీ నవలకు ఆమె వ్రాసిన చివరి మాట. ఈ కథలోని టామ్ తన యజమానుల ప్రేమ వాత్సల్యాలను బాగా సంపాదిస్తాడు. తుదకు అతను మరణించిన తర్వాత అతని యజమాని కొడుకు జార్జి తనబానిసలందరికీ స్వేచ్ఛ ఇచ్చాడు. టామ్ అంటే అంత ప్రేమ జార్జికి. ప్రేమకు వీరు నీగ్రోలూ, వీరు మరొకరు అనే వివక్షత వుండదు గదా!

**శ్రీ వి. ఎస్. అవధాని**

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.**

# లక్షలాది మందికి ఆశాజ్యోతి

మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి రూపొందించిన 20 అంశాల కనీస ఆర్థిక కార్యక్రమం మన రాష్ట్రంలో శక్తివంతంగా దృఢదీక్షతో అమలు జరుగుతోంది. రాష్ట్రం నలుమూలలా యీ కార్యక్రమం ముమ్మరంగా అమలులో ఉంది. ప్రజలలో వివిధ వర్గాలవారు, ముఖ్యముగా బలహీనవర్గాలకు చెందినవారు, యీ కార్యక్రమం వల్ల ప్రయోజనం పొందుతున్నారు.

దక్షిణాది ధాన్యాగారంగా పేరుపొందిన ఆంధ్రప్రదేశ్ గడచిన రెండేళ్లలో పెను తుఫానులు వచ్చినా, గత ఏడాది అనేక జిల్లాలలో దుర్భిక్ష పరిస్థితి ఏర్పడినప్పటికీ నేటికీ ఆ పేరును [ధాన్యాగారం] సగర్వంగా నిలబెట్టుకోగలిగింది. దారుణ దుర్భిక్ష పరిస్థితిని తట్టుకుని నిలబడేందుకు వీలుగా రాష్ట్ర ప్రభుత్వం అత్యవసర ప్రాతిపదికపై ఒక వ్యవసాయ కార్యక్రమాన్ని రూపొందించి అమలు జరిపింది. ఈ పథకం ప్రకారం కందులు, ఆముదాలు వగైరా ప్రత్యామ్నాయ పంటలకు మళ్లేటట్లు రైతాంగాన్ని ప్రోత్సహించింది. ఖరీఫ్ సీజను ఆఖరులో రబీ సీజను మొదట్లో వేరుశనగ, మేలు రకం జొన్న, పప్పుదినుసులు పంటల క్రింద అదనపు భూములను సాగులోకి తీసుకువచ్చింది. ముఖ్యంగా ఆ పంటలు అలవాటు లేని ప్రాంతాలలో వాటిని ప్రోత్సహించడం జరిగింది. అంతేగాక దుర్భిక్ష ప్రాంతాలలో రైతాంగానికి అవసరమైన అనేక ప్రోత్సాహకాలను ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఉన్న పంటలను కాపాడేందుకు చర్యలు తీసుకుంది. ఫలితంగా ఆహారధాన్యోత్పత్తి పడిపోకుండా నివారించగలిగింది. ఇందువల్ల 1979—80లో 90 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు ఉత్పత్తి అయ్యాయి.

రాష్ట్రంలో భూసంస్కరణలను చురుగ్గా అమలుజరపడం జరిగింది. 3.79 లక్షల ఎకరాల మిగులు భూమి ప్రభుత్వం స్వాధీన పరుచుకుంది. ఇందులో 17,957 ఎకరాల మాగాణి భూములను, 2,41,310 ఎకరాల మెట్ట భూములను 1,74,125 మందికి పంచింది. వీటిలో 86,878 మంది షెడ్యూలు కులాలవారు, 26,897 మంది షెడ్యూలు తెగలవారు, 49,192 మందివెనుకబడిన తరగతులకు చెందినవారు ఉన్నారు.

పెద్ద ఎత్తున గృహ నిర్మాణ కార్యక్రమాన్ని రాష్ట్ర ప్రభుత్వం పేదవర్గాల కోసం చేపట్టింది. 12 లక్షల కుటుంబాలకు ఇళ్ల స్థలాలను పంచిపెట్టింది ఈ ఇళ్ల నిర్మాణ కార్యక్రమము వల్ల 2.5 లక్షల కుటుంబాలు ప్రయోజనం పొందాయి.

రాష్ట్రంలో చేనేత పరిశ్రమాభివృద్ధికి మరిన్ని ప్రోత్సాహకాలను ప్రవేశపెట్టడంతో జనతా వస్త్రాల ఉత్పత్తి 3 కోట్ల 30 లక్షల చదరపు మీటర్లకుచేరుకుంది.

నిరుద్యోగులుగా ఉన్న యువకులకు అప్రెంటిస్‌షిప్ శిక్షణ కార్యక్రమం బాగా సాగుతోంది. ప్రస్తుతం 4847 మంది అభ్యర్థులు యీ శిక్షణ పొందుతున్నారు. వీరిలో 510 మంది షెడ్యూలు కులాలకు చెందినవారు, 30 మంది షెడ్యూలు తెగలకు చెందినవారు, 2,109 మంది వెనుకబడిన తరగతులకుచెందినవారు ఉన్నారు. ఈ ఏడాది విద్యార్థులకు చౌక ధరలకు సుమారు మూడు కోట్ల నోటు పుస్తకాలను ప్రభుత్వం సరఫరా చేసింది.

బియ్యం, గోధుమలు వంట నూనెలు చక్కెర, కిరసనాయిలు మొదలైన నిత్యావసర సరుకులను చౌక ధరలకు రాష్ట్రవ్యాప్తంగా ఉన్న 22 వేల చౌక డిపోల ద్వారా పంపిణీ చేస్తున్నారు. ఈ డిపోలద్వారా ప్రతి నెల సుమారు 40,000 టన్నుల బియ్యం ప్రభుత్వం విడుదల చేస్తోంది.

రాష్ట్ర పౌర సరఫరాల కార్పొరేషన్, కేంద్ర ఆహార సంస్థ కొనుగోలు కేంద్రాల ద్వారా జరిగే ఆహారధాన్యాల కొనుగోళ్ల సందర్భంగా రైతాంగానికి గిట్టుబాటు ధర లభించేటట్లు ప్రభుత్వం చర్యలు తీసుకుంది. గత సంవత్సరం ఖరీఫ్ కాలంలో ధాన్యం కొనుగోలు నిమిత్తం సుమారు 350 కేంద్రాలు తెరిచారు. రబీ ఉత్పత్తులకు 226 కేంద్రాలను తెరిచారు. 7.87 లక్షల టన్నుల ధాన్యం కొనుగోలు చేయడం జరిగింది. అంతేగాక మిల్లు లెవీ పథకం క్రింద మిల్లర్ల నుంచి 5,16,450 టన్నుల బియ్యం కూడ కొనుగోలు చేయడం జరిగింది.

వెట్టిచాకిరి నుంచి విముక్తిపొందిన వారి పునరావాసం కోసం ప్రత్యేక పథకాలను చేపట్టి, కొన్ని వేల కుటుంబాల జీవనాధారానికి అవకాశాలు కల్పించబడ్డాయి ప్రస్తుతం రాష్ట్రంలో వెట్టిచాకిరిలేదు.

ఈ విధంగా 20 అంశాల ఆర్థిక కార్యక్రమంలోని పెక్కు అంశాలు అమలు జరపడంలో ఆంధ్రప్రదేశ్ అగ్రభాగంలో నిలబడివుంది. అనేక సంక్షేమ పథకాలను అమలుపరచేందుకు కేటాయించిన నిధులను ప్రభుత్వం 1978 మార్చిలో అధికారంలోకి వచ్చింది లగాయతు ప్రవేశపెట్టిన వార్షిక బడ్జెట్‌లలో పెంచుకుంటూ వస్తోంది. అంతేకాదు, రాష్ట్రప్రభుత్వం ఇంకా అనేక యితర విప్లవాత్మకమైన చర్యలను ప్రారంభించింది. అవి: పల్లె పల్లెకు బస్సు సౌకర్యం, గ్రామీణ ప్రాంతాలలోని చిన్న ఉత్పత్తిదారులకు ప్రయోజనం కలిగే విధంగా సరుకు రవాణా [కార్గో] బస్సు సర్వీసుల ఏర్పాటు, అభ్యుదయ ప్రాథమిక విద్యాసంస్థల ద్వారా గ్రామాలలో ఆదర్శ పాఠశాలల ఏర్పాటు, గ్రామాలకు రక్షిత మంచినీటి సరఫరా నిమిత్తము బృహత్ పథకం రూపొందించడం.

పోలవరం బరాజు ప్రాజెక్టువల్ల విశాఖపట్నం ఉక్కు ఫ్యాక్టరీకి, ఆ సమీపంలోని యితర పరిశ్రమలకూ అవసరమైనటువంటి నీరు సరఫరా కావడమే గాక విశాఖపట్నం, తూర్పు గోదావరి జిల్లాలలో అదనపు నీటి పారుదల సౌకర్యాలు సమకూరుతాయి. శ్రీశైలం కుడి కాల్వ ప్రాజెక్టువల్ల దీర్ఘకాలంగా దుర్భిక్షానికి గురి అవుతూ వస్తున్న రైతాంగం ఊపిరి పీల్చుకొనే విధంగా కర్నూలు, కడప జిల్లాలలోని భూములను సాగులోకి తేవడం సుసాధ్యం అవుతుంది.

పారిశ్రామాభివృద్ధిలో కూడ రాష్ట్రం గణనీయమైన అభివృద్ధిని సాధించింది. ఈ అభివృద్ధి వేగాన్ని కాపాడేందుకు 6,300 కోట్ల మేర పెట్టుబడులు లభ్యమవుతున్నాయి.

DIPR 5078/Advt./1/C3/80

